




ముఖచిత్రం : జ్యేష్ఠ పూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

జూలై సంచికలో పూర్తి నవల

**ఇనుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రిగారి**

# సాధన

# మే నెల క్విజ్

## సమాధానాలు

1 — బి   2 — బి   3 — సి

4 — బి   5 — డి

6. 1851   7. సికిందర్ లోడి   8. నందూనటేకర్

9. లాన్‌స్టన్   10. సోఫియా




**దీపక్**
హైద్రాబాద్

**రాజేశ్వర్**
సికింద్రాబాద్

**శ్యామ్**
ఖైరతాబాద్

— L. A.

జూలై నెల యువ

# భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 25 + రూ. 25**

**ఈ కార్టూనుకు హాస్యయుత వాక్య (Caption) కావాలి**



గమనిక : వాక్యాలు పోస్టుకార్డు మీదనే వ్రాయాలి.
మే 31 వ తేదీ లోపు మాకు చేరాలి.

---

జూన్ నెల యువ భావపరిచయ పోటీకి సరిఅయిన హాస్యయుత వాక్య రానందున బహుమతి సొమ్ము 25 రూ. జూలై నెల భావపరిచయ పోటీకి కలుపడమైంది.

—సంపాదకుడు

అనాది కాలప్రవృత్తముగా సంగీతము పారంపర్యంగా భారతీయ సమాజంతో నిగూఢంగా పేనబడినది. సంస్కృతి తనంతటతానే ఏ విధంగా ముగులపై ఏకంగా భాసించునో, అదే విధముగా, భారతదేశంలో, పక్షులు, జంతువులకేగాక, దేవతలు సంగీత వాద్యములతో విడదీయ లేని విధంగా సమ్మిళితమైయున్నారు. స్థితి కారకుడైన చతుర్భుజుడైన మహావిష్ణు, ఒక చేతిలో శంఖమును ధరించి యున్నాడు; కళలకు, విద్యకు మూలవిరాట్టైన సరస్వతి వీణ మీటుచున్నది; శ్రీ కృష్ణ భగవానుడు సర్వదా వేణువుతో సాక్షాత్కరించును. ఇక శివుని చేతిలో ఢమరుకం.

ఢమరు కానికి శివునితో అవినాభావ సంబంధం ఉంది. శివుడు 'తాండవ నృత్యం' చేసినప్పుడు పద్నాలుగు సార్లు ఢమరాన్ని వాయించాడట —పద్నాలుగు మహేశ్వర సూత్రాలు ఆవిర్భవించాయట. ఆ సూత్రాలే పాణిని వ్యాకరణ సూత్రం యొక్క ప్రారంభ సూత్రాలయ్యాయి. పైన యారూ చూసే ఆ తబలా యొక్క పూర్వస్వరూపం ఢమరుకం.

# దావణగెరె

అనంతమైన నాణ్యతకు మరో పేరు
ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్, దావణగెరె, 577 002.

షోరూములు:
చిత్రదుర్గా రోడ్, దావణగెరె 577 002.
కావేరి భవన్, బెంగళూర్ 560 009.
దాజిబన్‌పేట్, హుబ్లి 580 020.

THOMAS/DCM/77/B/TEL

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 37 జూన్, 1978 సంచిక 6


ఆంధ్రప్రదేశ్‌లో కొత్త మంత్రిమండలి ఏర్పడి రెండు నెలలు అయింది. మంత్రులంతా తమ పదవులను స్వీకరించిన తరువాత, తమతమ నియోజక వర్గాలకూ, తమ జిల్లాలకుకూ మాత్రమే కాక, ఇతర ప్రాంతాలకు కూడా వెళ్లి, ప్రజల అవసరాలనూ, ఆ యా ప్రాంతాలలోని పరిస్థితులనూ తెలుసుకున్నారు. మధ్యలో తాత్కాలిక బ్జెటుకొరకు అసెంబ్లీ సమావేశంకూడా జరిగింది కాబట్టి, రెండు మూడు నెలలపాటు మంత్రులు చాలా అవసరమైన పనివుంటే తప్ప రాజధానినుంచి బైటకి వెళ్లకుండా, పేరుకొనిపోయిన ఫైళ్ళను పరిశీలించి, వాటిమీద ఉత్తరువులను జారీచెయ్యడం చాలా అవసరం

మంత్రుల ఉత్తరువులకోసం నిలబడిపోయిన ఫైళ్ళు చాలా వున్నాయనీ, వాటిలో ఆరేడు మాసాలుగా ఏవుత్తరువూ లేకుండా వున్నవి కొన్ని వున్నాయనీ వినవస్తూ వుంది. మంత్రుల ఉత్తరువుకోసం, ఒక ఫైలు నిలబడిందంటే, ఒక వ్యక్తికో, ఒక కుటుంబానికో, ఒక గ్రామానికో సంబంధించిన సమస్య పరిష్కారంకాకుండా అలా నిలబడిపోయిందన్నమాట. ఇలాంటి ఆలస్యం కొన్ని సందర్భాలలో, ఆ ఫైలుకు సంబంధించినవారికి చాలా నష్ట, కష్టాలను కలిగిస్తుందన్నమాట అందరికీ తెలిసినదే. కాబట్టి మంత్రులు త్వరత్వరగా తమ బల్లమీది ఫైళ్లను, తమ ఉత్తరువులతో అధికారులకు పంపడమేకాక.

ఆ వుత్తరువులను అమలు జరపడంలో అధికారులు ఏమాత్రం జాప్యంచెయ్యకుండా చూడాలి.

భూసంస్కరణల చట్టం, నగర నివేశన స్థలాల పరిమితి చట్టం మొదలైన వాటికి సంబంధించిన సమస్యలు ఎంత త్వరగా పరిష్కారమైతే అంత మంచిది. కంట్రాక్టర్లకు ప్రభుత్వంనుంచి రావలసిన డబ్బు ఎంత త్వరగా చెల్లించబడితే, అంత హుషారుగా తక్కిన పనులు జరుగుతాయి. చిన్న, చిన్న ప్రాజెక్టులు ఎంత త్వరగా పూర్తిచేయబడితే, వాటి ప్రయోజనం ప్రజలకు అంత త్వరగా లభిస్తుంది. ప్రజల అవసరాలను గ్రహించడానికి, ఆ అవసరాలను త్వరితగతిలో తీర్చడానికి కృషిచేసేదే. ప్రజాప్రభుత్వం. ప్రజలంటే ఏ ఒక్క వర్గమో కాదు. ప్రతి వ్యక్తీ ప్రజే. ఏ ఒక్క వ్యక్తికీ బాధ కలుగ కుండా, ప్రజా బాహుళ్యానికి ప్రయోజనకరమైన విధానాలను అమలు జరిపేదే ప్రజాప్రభుత్వం.

* * *

న్యాయస్థానాలలో పరిష్కారంకాకుండా కొన్ని వేల కేసులు, ఎన్నో సంవత్సరాలనాటివి నిలబడిపోయివున్నాయనీ, అలా జరగటానికి కారణం చాలావరకు న్యాయవాదులు వాయిదాలను అడుగుతూ వుండడమేననీ, ఇటీవల ఒక న్యాయమూర్తి సూచించారు. ఈ సూచనను గ్రహించి, న్యాయవాదులు తాము చేపట్టిన కేసులు త్వరితంగా పరిష్కారం అయేటట్లుగా, కోర్టులతో సహకరించాలి. అవసరమైతే ఎక్కువమంది జడ్జీలను నియమించి, ఏ విధమైన కేసు అయినా ఏడాది లోపల ముగింపుకు వచ్చేటట్లు ప్రభుత్వం ఏర్పాటు చెయ్యాలి.

అలాగే, ఇన్ కంటాక్స్ కేసులు పరిష్కారం కాకుండా వున్నవి ఎన్నో వున్నవి. వీటిలో పార్టీలకు తిరిగిరావలసిన డబ్బు ఎక్కువ. వాటిని, త్వరగా నిర్ణయించి, ముదరా యివ్వవలసిన సందర్భాలలో వెంటనే వుత్తరువులు ఇవ్వవలసిందిగా ఇన్‌కంటాక్స్ ఆఫీసర్లకు ప్రభుత్వం ఆదేశం యివ్వాలి. అడ్వాన్సు పన్ను కట్టవలసిన యీ రోజులలో, ప్రభుత్వానికి బాకీ వుండే కేసులు చాలా స్వల్పంగా వుంటాయి. ప్రభుత్వానికి రావలసిన డబ్బు వచ్చేసిందికదా, పార్టీలకు ముదరా ఇవ్వవలసిన డబ్బు విషయంలో ఆలస్యం జరిగితే ఫరవాలేదనే భావం ఆఫీసర్లకు వుండకూడదు. పరిపాలనా దృష్టిలో, ఇలా జరగడానికి కారణాలు వుండవచ్చునుగాని, ప్రజల దృష్టిలో ఇవి బాధలు. ఈ బాధలను తొలగించడమే పరిపాలకుల ప్రధాన కర్తవ్యం.



# నట్టింట దీపం

సుమిత్ర నట్టింట్లో దీపం వెలిగించింది. శ్రీమారావు అక్కగారూ, సీతయ్య బాబూ జ్యోతికి నమస్కరించారు.

* * *

మృత్యుముఖంలో నుంచున్న శ్రీమారావుకి స్పృహ తప్పిపోవడం కొద్దిగా జ్ఞప్తి ఉంది. మళ్ళీ కళ్ళు తెరుపులకి వచ్చే వేళకి యావత్ప్రపంచం రూపుమారిపోయింది. తనకి మరణ మాసన్నమయింది; కింకరదర్శన మింకా కాలేదు,

అది తన చేతులమీదుగా దాటిపోయింది. అదృష్టవంతురాలు కనక పునిస్త్రీచావు చచ్చింది. ఈ నాలుగేళ్ళ బట్టీ ఆ ముసిలిది-అక్కగారు-ఉండబట్టి యింత వండి పడేస్తోంది. తనుమాత్రం యింకా బతికి ఏం బావుకోవాలి!

ఈ భూమ్మీదికి వొచ్చిన పని అయిపోయింది. ఏదో ఉన్నదాంట్లో నలుగురికి పెట్టాడు – తను తిన్నాడు. గుట్టుగా రోజులు వెళ్ళిపోయాయి. సీతయ్యబాబు తనకంటె ఏడేళ్ళు పెద్ద; కాని, దుంగలా ఉన్నాడు. ఎటొచ్చీ చూపు సరిగ్గా ఆనడంలేదాయనకి. డొక్కల కరువు గురించి యిప్పటికీ ఎంతో యిదిగా చెబుతూ వుంటాడు సీతయ్యబాబు.

తనకి చావంటే భయంలేదు. రామస్మరణ చేసుకుంటూ హాయిగా కళ్ళు మూసుకోగలడు. కాని ఆ ముసిలిది...? తనకంటె పదేళ్ళు పెద్ద. దానిరోజు లెలావెళ్తాయి? ఆవిణ్ణి గురించి తల్చుకుంటేనే మనసు కాస్త పీకుతోంది. ఏమిటో, కర్మ పరిపక్వమవాలి. ఇదంతా ఋణానుబంధం. ఎవరి కెన్నాళ్ళ గింజ లుంటాయో అన్నాళ్ళూ ఉండక తప్పుతుందా? కాలువా కాళ్ళమీద కప్పుతూ, ఔషధం పుచ్చుకోమంటోంది సుమిత్ర. ఇంకా తన కెందుకు ఈ మందులూ మాకులూ?

ఈ అసురసంధ్యలో ఆ తెర తొలగించి చూడగలిగితే...? మనిషి మరణించిన తర్వాత జీవుడు ఏమవుతాడు? పాపపుణ్యాల్నిబట్టి రకరకాల జన్మలు ఎత్తేమాట నిజమేనా? తనకి ముందు జన్మ ఎలాటిది ప్రాప్తిస్తుంది? ఈ జబ్బు నెమ్మదిస్తుందా? మళ్ళీ గడపదాటగలడా? ధనుర్వాత మన్నారు దీన్ని! ఆయువు మూడేందుకు ఏ

---

యస్. ఆర్. చందూర్

---

దై తేనేం ఏదో ఒక పేరు. తనకి మారక దశ అని జాతకంలో స్పష్టంగా రాసే ఉంది.

ఏర్పాట్లన్నీ వెనకెప్పుడో చేసేశాడు భీమారావు. ముసిలిదాని పేర నాలు గెకరాలు ఉందనే వుంది. కొరివిపెట్టే కొడుక్కి ఆస్తి రాతకోతల్లేకుండానే సంక్రమిస్తుంది. ఎటొచ్చీ మిగిలింది ఆ కుర్రదీ. పాపం-రెండిందాలా చెడింది. చూస్తూ చూస్తూ తల్లీ తండ్రీ లేని దాన్ని, ఆ రాజు కిచ్చి ముడిపెట్టలేకపోయాడు.

సుమిత్ర భీమారావు చెల్లెలు కూతురు. చెల్లెలు కలరా తగిలీ, బావమరిది హృద్రోగంవల్లా మరణించగా సుమిత్రని భీమారావే పెంచాడు. తల్లీ తండ్రీ పోయేటప్పటికి అది నాలుగేళ్ళ కూన.

తనాపిల్లకి ఏంలోటు చేశాడూ? అయిదువేలు కట్నం యిచ్చి దేవేంద్ర వైభవంతో వివాహం చేశాడు. అవు పోసనం చేదామనుకుంటూవుండగా ఆ అబ్బాయి గుటుక్కుమన్నాడు. ఇంతకీ ఎవరి ఖర్మకి ఎవరు కర్తలు! సుమిత్ర నాలుగు ముక్కలు నేర్చుకుని వివేకవతి అవాలని పక్క పట్నంలో చదువు చెప్పిస్తూ వుండగా బంధువులు తనను వెలేసినట్టు చూసేవారు. కొందరు బంతి భోజనాలు కూడా మానుకున్నారు. ఎవరి పాపం వాళ్ళది. తనెవర్నీ ద్రోహం చెయ్యలేదుగా! ఈనాడు సుమిత్రకైనా ఏమీ యిబ్బంది లేదు. దాని చదువుకీ, తిండీ బట్టలకీ సరిపడేటంత ధనం సీతయ్యబాబుద్వారా జాగర్త చేశాడు. సీతయ్యబాబు నిప్పులాంటిమనిషి; ఒకర్ని అన్యాయంచేసే బాపతు కాదు ... ఈ రోజుల్లో ఎందరు చేసుకోవడం లేదూ! రాజు సుమిత్రని...

భీమారావు మెదడులో ఆలోచనలు అల్లుకుపోతున్నాయి. మనసు నిర్మలంగా ఉంచుకుని రామనామం జపిద్దామని ఆత్రంగా ఉందిగాని సాధ్యపడటంలేదు. ఆలోచనలు తేనెటీగల్లా రొదచేస్తూ కుడుతున్నాయి. బయట చీకటి చీకటిగా ఉంది. తన మంచంచుట్టూ, మండువా లోనూ చాలామంది ఉన్నారు. మొహాలు మసకమసకగా కనిపిస్తున్నాయి. అదుగో ముసుగేసుకుని ఉత్తరంవైపు వసారా గుమ్మందగ్గిర తన అక్కగారు కూచుంది. తన చావుకంటె ఆమె బతుకు భయంకరం. ఏకోదరి దైన్యానికి భీమారావు కళ్ళు చెమర్చాయి.

కాని, ఆ చెమర్చినకళ్ళే యింకెవరినో వెతుకుతున్నాయి. సుమిత్ర పాలచెంబు యిస్తోంది పాలేరుకి. "అయ్యగోరి కెట్టా గుంది?" అని కాలో అడుగుతున్నాడు వాడు. తనకి కావల్సిన మొహం ఆ గుంపులో లేదు. లేదు. ఇంకా రాలేదన్న మాట. వస్తే తన పక్కలోకి వొచ్చి కూచోడూ? వాడు రాకుండానే ప్రాణాలు 'హరీ' అవవుగదా!

భీమారావు మన లోకంనుంచి కళ్ళు మూసేసుకున్నాడు. ధన్వంతరి నాడి

పరీక్షించి, మళ్ళీ మగత వొచ్చింది, రేపు సాయంత్రందాకా యిలా ఉండే గండం గడిచినట్టే" అన్నాడు.

* * *

సుమిత్ర నట్టింట్లో దీపం వెలిగించింది భీమారావు అక్కగారూ, సీతయ్యబాబూ జ్యోతికి నమస్కరించారు. పడమట నించి వచ్చే బండి ఎన్ని గంటలకి వొస్తుందని కాసేపు తర్జనభర్జన జరిగింది

రాత్రి రెండుగంటల రైలులో దిగి, వంటెద్దుబండి చేయించుకొని. రాజు గ్రామం చేరుకునేటప్పటికి వేగుచుక్క పొడిచింది. బండబ్బాయి తన తండ్రి జీవించేవున్నాడనీ, కాని ప్రాణం అటూ ఇటుగా ఉందనీ స్టేషన్ దగ్గిరే చెప్పాడు. సావిటితలుపు తెరిచే ఉంచారు వీధి వాకిట్లో పాలేరూ, సీతయ్యబాబూ యింకో రైతూ పడుకున్నారు. భీమారావు అక్క గారు కూచుని కునికిపాట్లు పడుతోంది. వాలుకుర్చీలో పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్న సుమిత్ర "బావా" అంటూ ఎదురెళ్ళింది.

ముసిలావిడ, "వచ్చావా నాయనా" అంటూ ఘొల్లుమంది...యింటిల్లిపాదీ లేచారు. ఆడవాళ్ళ ఏడుపు రాజుకి చీకాకుగావున్నా భరించవలసి వచ్చింది. తొలికోడి కూసింది. ప్రత్యూష పవనాలు భీమారావు సూక్ష్మదేహానికి వేళయిందని సందేశ మంపాయి. కొడుకునిఒక్కసారి తండ్రి చూసుకున్నాడు. ఇంక నిశ్చింత. వెనక తల్లివిషయంలోనూ యిలాగే వేళకి అందుకున్నాడు రాజు. భీమారావు పెదవులు కదుపుతున్నాడుగాని మాట్లాడే శక్తి లేకపోతోంది. యావచ్ఛక్తితో గొంతుకలోనుంచి మాట పెకిలిద్దామని భీమారావు నరకయాతన పడుతున్నాడు. ఆ ప్రయత్నంలో వికృతాకారం దాలుస్తున్న అతని మొహంలోని బాధ చూడలేక, "నాన్నా" అని పెద్దపెట్టున అరిచాడు రాజు భీమారావు తల వొరగే శాడు నాన్న నిర్గమించాడని ధన్వంతరి రాజుని వెనక్కి లేవదీశాడు సీతయ్యబాబు 'నారాయణ--నారాయణ'అని భీమారావు చెవిలో ఊదాడు రాజు గుండెలమీద తల అన్చి, చేతులు భుజాలమీద వేసి వెక్కి వెక్కి ఏడ్చింది సుమిత్ర. వెనక అత్తయ్య చచ్చిపోయినప్పుడు మామయ్య దగ్గిర యిలాగే ఏడ్చింది. అప్పుడు మామయ్య సముదాయించినట్టే యిప్పుడు బావ తల నిమురుతూ "ఊరుకో అమ్మా, ఊరుకో" అంటున్నాడు.

రాజు గుండెనిబ్బరం గల మనిషి. కష్టసుఖాలు జీవితమనే త్రాసులో సమానంగా తూగుతాయనే వాళ్ళలో ఒకడు. శవదహనం చేసి వచ్చిన తర్వాత పురోహితుడు ప్రమిదలోని జ్యోతికి నమస్కారం చెయ్యమన్నాడు. రెండు గంటలక్రితం అగ్ని సహస్రనాలుకలతో తండ్రి భౌతిక దేహాన్ని కబళించింది.

అదే అగ్నికి ప్రణమిల్లమని సంస్కృత మంత్రాలు వర్తిస్తున్నాడు పురోహితుడు. వాటి అర్థం తనకి తెలీదు; భావం గ్రహించగలడు అవి మంటలు—పారి శుద్ధ్యానికీ వినాశనానికీ కారణభూతమయే మంటలు, యిది చిన్న జ్యోతి—అంధ కారాన్ని పారద్రోలే కాంతికిరణం ఈ రెంటినీ సమన్వయింపజేసిన ప్రాచీన విజ్ఞానసంపద ముందు తానొక అంగుష్ఠ మాత్రుణ్ణి అనుకున్నాడు. ప్రమిదలోని జ్యోతికి నమస్కరిస్తున్నప్పుడు అప్రయత్నంగా రాలాయి అతని కళ్ళలోనుంచి కన్నీటిబొట్లు. తన తండ్రి మంచం, పరుపూ, కుర్చీలూ, బట్టలూ—ఏ ఒక్కటీ లేవు ఆ గదిలో. చిన్నజ్యోతి దీపారాధన—మాత్రమే ఉందక్కడ. శూన్యత రాజు మనసుని కలవరబెట్టింది.

మానవుడు సమస్తాన్నీ దిగమ్రింగు తాడు. ప్రతి కొత్త పరిస్థితికీ అనువుగా మారిపోతూవుంటాడు. తనలో తను తిరిగే భూమిలా మార్పుతో తను మారే మానవుడు విపత్తులు జీర్ణించుకుని శూన్యతని తరిమేస్తూవుంటాడు.

పదమూడు రోజులూ యిట్టే గడిచి పోయాయి. కర్మ యథావిధిగా జరిపిం చారు. గోదానం, భూదానం, వస్త్ర దానం యిత్యాదులన్నీ సక్రమంగా జరిగాయి. పదమూడో రోజు సాయంత్రం పొట్లపాదు దగ్గిరలో నుంచుని కాయలకి రాళ్ళు కడుతోంది సుమిత్ర. పాలేరు మల్లెపందిరికి నీళ్ళుతోడి పోస్తున్నాడు. గేదెలు రెండూ మేతనించి వచ్చాయి గాని నల్లావు యింకా రాలేదు; అంచేత దొడ్డితలుపు తెరిచే ఉంచారు. సుమిత్ర స్నానమింకా చెయ్యలేదు. మల్లెపందిర పని అయినతర్వాత స్నానాలకొట్లో నీళ్ళు పోస్తాడు పనివాడు.

"సుమిత్రా, రేపు సాయింత్రం నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు రాజు అమాంతం.

సుమిత్రకి ఏడవాలో నవ్వాలో తెలీ లేదు. బావ నవ్వులాటలకి అంటున్నాడో, నిజంగా అంటున్నాడో అంతకన్నా తెలీదు అదీకాక బావ తనతో ఏనాడూ సరసోక్తులు పలకలేదు. ఏదో దూర దూరంగా, అంటీ ముట్టనట్లు, ముక్త సరిగా మాట్లాడుతాడు. అతని స్వభావమే అంత. మనసివ్వడు: మనసు విప్పి చెప్పుకోడు. ఈ అనాలో తెలీలేదు, ఊహూ అనాలో తెలీలేదు. ఊరుకుంది.

కాని, సుమిత్ర హృదిలో బాంబర్లు పరిగెడుతున్నాయి. బావ ఉద్దేశం ఏమిటి ? తన గతి ఏంకాను ? ముసిలిది పెత్తల్లి ఏమవుతుంది ? ఈ గొడ్డూ గోదా ఏమిటి ? బావ ఎవరో మహారాష్ట్రి అమ్మాయితో ఉంటున్నాడని తను లోగడ వింది. తనతో స్పష్టంగా చెప్పొచ్చుగా ? తనేమైనా కాదంటుందా? ఈ ముసుగులో గుద్దులాట ఎందుకు ?

(సశేషం)

రామాచంద్రమౌళి

# శాసించే అనుభవాలు




సింహాద్రికి చటుక్కున తెలివి పుట్టింది. కళ్ళు తెరిచాడు.

యింకా తెల్లవారలేదు.

పల్లెలో కోళ్ళు కూస్తున్నాయి.

అలాగే కుక్కిమంచంలో పడుకుని, రెండు చేతులనూ తలక్రింద మడుచుకుని ఒట్టి పసివానిలా ఆకాశంలోకి చూస్తూ ఉండిపోయాడు.

అతని మనసు బాగా లాగిన రబ్బరులా ఉంది.

మళ్ళీ ఆలోచనలు వానచినుకుల్లా కురియడం మొదలైంది అతని మెదడులో.

'తనేంజేయాలి...తనేం జేయాలి-'

రాత్రినుండి యీ ప్రశ్న మొసలిలా పట్టి పీడిస్తోందతన్ని.

ఎంత పిండినా యిసుకలోనుండి రాని నూనెలా అతనికి జవాబు దొరకలేదు.

"తనేదీ చేయలేడా ... చూస్తూ ఊరోక్కోవలసిందేనా?"

"ఊరోక్కోవలసిందే - అంతకన్నా నువ్వేం జేయగలవు చెప్పు."

"..................."

మనసు పగిలిన బొమ్మలా ఐపోయింది.

చటుక్కున లేచి కూర్చుని తలగడ క్రింది పొగాకు చుట్టను నోట్లో పెట్టుకుని వెలిగించుకున్నాడు. వెలిగించుకుని చేతిలో ఎర్రగా మండుతున్న అగ్గిపుల్లవంక ఓ క్షణం తదేకంగా పిచ్చిగా చూచి విసిరేశాడు చెయ్యి కాలగానే.

వెంటనే తుపుక్కున ఉమ్మేసి...లేచి గుడిసె ముందర వాకిట్లో అటు యిటూ నడుస్తున్నాడు అటు యిటూ తన్నుతున్న బంతిలా.

గుడిసె లోపల ఖాళీ—

తన గుండె లోపల ఖాళీ—

తన బ్రతుకంతా ఖాళీ—

...ఏం జీవితం తనది...ఛూ.

తనూ, ఎంకీ కలసి నలభై ఏండ్ల జీవితాన్ని ఓ క్షణంలా గడిపి...తమకు పిల్లలు లేకున్నా ఎంకి పొందులో ఆ ధ్యాసే లేకుండా బ్రతికి ... మొన్న మొన్న ఎంకి కన్నుమూయగానే ప్రాణం పోయిన పక్షిలా ఐపోయాడు తను.

తనిప్పుడు ఒంటరి...ఒంటరి.

ఒంటరితనం యిప్పుడు తప్పనిసరిగా గుప్పిట్లో పట్టుకోవాల్సిన నిప్పులా ఉంది.

—వ్చ్...

గుడిసె చూరు వాసాల కొనలకు వ్రేలాడగట్టిన పంజరాల దిక్కు చూశాడు, సింహాద్రి.

అన్నింటి నిండా పక్షులే-

కొన్ని చిలకలు, కొన్ని గోరింకలు, కొన్ని పావురాలు, కొన్ని పిట్టలు-

పక్కనే నేలమీద బోర్లించిన వెదురు బుట్టలవంక చూశాడు. ఒకదాంట్లో రెండు కొంగలున్నాయి. యింకోదాంట్లో రెండు మూడు కుందేళ్ళు.

తను యిన్నాళ్ళూ యిదే వృత్తి మీద బ్రతుకుతూ-ఎన్ని పక్షులను పట్టాడో, ఎన్ని జంతువులను చిక్కించుకున్నాడో-

తన నందరూ "పచ్చులోడు" అంటారు.

కాని యిప్పుడిక పక్షులను పట్టాలని గానీ, వాటి నమ్ముకుని బ్రతకాలనిగానీ లేదు... బ్రతుకంతా శూన్యంగా, ఒట్టి గడ్డిని నములుతున్నట్లుగా ఉంది.

సింహాద్రి చూరుకు వ్రేలాడుతున్న ఓ పంజరాన్ని తీసుకుని మంచంపై కూలబడ్డాడు-తలెత్తి ఎదురుగా కనబడు తున్న మర్రిచెట్టు దిక్కు చూశాడు. చెట్టు నల్లగా ... ఒంటరిగా నిలబడ్డ రాక్షసిలా అనిపించింది.

యింకో నాలుగు గంటల్లో

పెద్దమనుషులు ఆ చెట్టుక్రింద కూర్చుని రాజి సంగతీ, రాజయ్య సంగతీ తేల్చి పారేసి—

"అన్యాయం...అన్యాయం."

సన్నగా మూల్గాడు సింహాద్రి బాధగా.

ఊరివంక చూశాడు. మసక మసగ్గా ముసుగుతన్ని పడుకున్న ఎలుగుబంటులా అనిపించిందతనికి. మంచానికి ఆనుకుని ఉన్న తన బరిసెను చూసుకున్నాడు తన త్రిశూలంవైపు ఆప్యాయంగా చూచుకుంటున్న శివునిలా

అతనిలోకి ఏదో విద్యుత్తు ప్రవహించింది

నిట్టూర్చి ... చేతిలోని పంజరం కిటికీ తెరిచాడు.

లోపలినుండి ఓ చిలక బుర్రున బయటికి పరుగెత్తి ఆకాశంలోకి ఎగిరి పోయింది తర్వాత యింకో చిలక... ఆ తర్వాత యింకొకటి-

ఖాళీ పంజరం మిగిలింది.

పంజరం పక్షిని కోల్పోయి వికారంగా...తనలా మిగిలి...

పక్షి ఉంటే పంజరానికి అందం... కాని పక్షికి...పక్షి బందీ అయి ఏడుస్తూ-

తప్పదు..బలమున్న చేతిలో బలహీన మైన జీవి చిక్కినప్పుడు యీ ఆత్మార్పణ తప్పదు.

యింకో పంజరం తెచ్చి తెరిచాడు.

పావురాలన్నీ ఎగిరిపోయాయి ఒక దాని వెనుక యింకొకటి

యింకో పంజరం-

గోరింకలు ఎగిరిపోతున్నాయి.

చిట్టచివర ఎగిరిపోతున్న పక్షి వంక అలాగే చూస్తూ ఉండిపోయాడు సింహాద్రి. పక్షి ఆకాశంలో పరుగెత్తి పరుగెత్తి ... దూరంగా ... కనుచూపు మేరను దాటి మబ్బుల్లో కలిసిపోయి- పక్షి పారిపోయి ... చూపులు ఓడిపోయాయి

సింహాద్రి చేతిలో పూర్తిగా కాలిన చుట్టను కాలి క్రింద రాసి లేచి నిలబడ్డాడు విషాన్ని మింగి నిటారుగా నిలబడ్డ శివునిలా.

ఎదురుగా తూర్పుదిక్కు మేఘాలు తగులబడ్డట్టు ఎర్రగా మండిపోతూ పొద్దు పొడుస్తోంది.

సరిగ్గా అప్పుడే ఊళ్ళోనుండి దుమ్ము రేపుకుంటూ ఓ జీపు పరుగెత్తుకొచ్చింది సర్రున. వచ్చి సింహాద్రి గుడిసె ముందర ఆగి ... జీపులోనుండి ఓ కాకిబట్టల మనిషి దిగి-

ఆ కాకిబట్టల మనిషి చొక్కా జేబుపై "హోటల్ అప్సర" అని ఉంది, ఎర్రని దారంతో కుట్టి

"ఏం సిమ్మాద్రీ. తీసుకురావచ్చుల్ని. పొద్దెక్కుతోంది...పోవాలె "

"... ... ... ... ..."సింహాద్రి మాట్లాడలేదు

"ఏమాయె"

"............" ఖాళీ పంజరాల దిక్కు చూపించాడు.

వచ్చిన హోటల్‌బాయ్ చటుక్కున షాక్‌తిని "ఏమైందివ్వాళ.." అన్నాడు

"............" సింహాద్రి ఎటో చూస్తున్నాడు పరధ్యానంగా.

బాయ్ గబగబా వెళ్ళి బుట్టలక్రింది కొంగలనూ, కుందేళ్ళనూ తీసుకుపోయి జీపులో పడేసి వచ్చి "యివ్వాళ సేఠ్‌తో నున్నది చావు. ఎట్లనో ఏమొ. గిరాకి నెట్ల సంభాళించాలెనో" అని గొణుక్కుంటూ నోట్లను లెక్కబెట్టి సింహాద్రి జేబులో కుక్కి "మరి రేపన్నా యిట్ల జెయ్యకు...ఊ" అని అరస్తూ ఉరికి జీపులో కూర్చున్నాడు.

జీపు దుమ్ము రేపుకుంటూ వెళ్ళి పోయింది ఊళ్ళోకి.

సింహాద్రి శిలలా ఆటుదిక్కు చూస్తూ ఉండిపోయాడు. అతని తలలో ఆలోచనలు సముద్రంలా అరుస్తున్నాయి.

* * *

సాయంత్రం మూడు దాటింది.

మర్రిచెట్టు క్రింద-రచ్చబండమీద గుమికూడిన జనంలో కోలాహలం ఎక్కువైంది. ఒకేసారి నలుగురైదుగురు మాట్లాడుతున్నారు. ఒకరిమాట ఒకరికి అర్థంగావడంలేదు. అంతా గందరగోళంగా ఉంది.

మర్రిచెట్టుకు దూరంగా వేపచెట్టు పంగ నడుమ కూర్చున్నాడు సింహాద్రి ఒంటరిగా. కూర్చుని రచ్చబండ దగ్గర జరుగుతున్న పంచాయితీని గమనిస్తూ చేతిలోని బరిసెతో కొమ్మను గుచ్చుతున్నాడు కసిగా...ఆవేశంతో. అతనికి ఒంటిపై కిరోసిన్ పోసుకుని నిప్పంటించుకున్నట్టు మంటగా ఉంది.

రచ్చబండ దగ్గర-

రెండు దిక్కులా యిరు పక్షాలకు సంబంధించిన పెద్దమనుషులు కూర్చుని ఉన్నారు. ఒక వర్గం దిక్కు రాజయ్య, రాజయ్య తల్లి, రాజయ్య తండ్రి ముద్దాయిలు యింకో దిక్కు రాజి, రాజి తండ్రి, నడుమ జనం, సాక్షులు... గారడి ఆట చుట్టూ జనంలా.

"అయ్యా ఒంటరిగాన్ని. మొన్న మొన్ననే తాడిచెట్టు మీదకెల్లి పడి సచ్చేటోన్ని బతికిన. ఒంట్లె బొక్కలన్ని యిరిగి ముక్కలైనై. రెక్కల్లేనోన్నై పోయిన. సావలేక బతుకుతాన. గిసోంటి నా దగ్గరినుండి వీళ్ళకేం కట్నకానెక్క లస్తయని నా బిడ్డకు రంకు అంటగట్టి దాన్ని అపకీర్తి పాల్చేసి యిడిపించుకోవాలని సూత్తాండ్లు దీని పీడబోతె తన కొడుక్కు నాల్గుపైసలు పట్కచ్చే యింకో పిల్లను సూచి సెయ్యచ్చును కుంటాండ్లు ఆయనె తల్లిదండ్రులు. తల్లి గీచిన గీత దాటని ఆ పిల్లగాడు నోరు మెదుపుతలేదు ... అయ్యా...నా బిడ్డ




బతుకు కాపాడుండ్లి. అది ఏ తప్పు జేయలేదు. మీ కాల్మొక్త. నాయం చూడుండ్లి యీ గులాపోని పోరిని కాపాడుండ్లి-" రాజి తండ్రి ఏడుస్తున్నాడు గోడుగోడున-పసివానిలా.

"ఏహే నువ్వూర్కో వో-ఏడుపు" కసిరాడు ఓ పెద్దమనిషి

"నువ్విట్రార రాజిగా-" యింకో పెద్దమనిషి.

రాజయ్య వచ్చాడు తలవంచుకుని

"నీ పెండ్లాం రంకు చేసిందంటా-" పెద్దమనిషి బీడీ అంటించుకుంటున్నాడు.

" ... ... ... ... " రాజయ్య మాట్లాడలేదు. తలెత్తి యిక తను విడిచి పెట్టబోయే భార్య రాజి వంక దీనంగా చూచి మరుక్షణం తల్లివంక భయంగా చూశాడు.

"అనుదేందండి మురిదట కనబడుతాంటెనో" గడగడా అంది రాజయ్య తల్లి

"నువ్వూర్కోవమ్మ ... వాన్ని మాట్లాకనీ"

"చెప్పురా చెప్పు. గట్లుంటవేంది. బెల్లంకొట్టిన రాయిలెక్క" అందామె మళ్ళీ కొడుకుతో.

"ఔ ... నా పెండ్లాం లచ్చిగాని దగ్గర పన్నది."

"ఎట్ల ఋజువు చేస్తవ్?"

"లచ్చిగాన్నడుగుండ్లి దాన్నడుగుండ్లి"

"ఊం..."

"..........." రాజయ్య తల్లి వంక చూశాడు పాఠం అప్పజెప్పి పంతులువంక చూస్తున్న పసివానిలా.

"గంతే...అడుగుండ్లి లచ్చిగాన్ని" అంది రాజయ్య తల్లి ఆవేశంగా.

"ఏంరా లచ్చిగా యిట్రా."

లచ్చిగాడు సర్పంచ్ పాలేరు. వచ్చాడు బిస్కట్ చూసిన కుక్కలా.

"నీకూ రాజికీ సంబంధమున్నాదిరా?"

లచ్చిగాడు తలవంచుకుని సిగ్గుపడు తున్నాడు.

"చెప్పురా..."

"..........." నవ్వుతున్నాడు ప్రపంచాన్ని జయించిన వీరునిలా

"ఏం జెప్తదండీ మొగోడు అంత కంటే." రాజయ్య తల్లి.

"నువ్ వో. రాజీ నువ్విటు రావే-"

రాజి వచ్చింది మంటల్లోకి నడుస్తున్న సీతలా.

"ఊఁ- చెప్పు నీ సంగతి."

"నేనే పాపం జెయ్యలేదు. పుట్టిచ్చిండ్లు యివన్ని."

"ఊఁ...లచ్చిగాడు నీకుతెలువదా?"

"ఎరికే మా యింటి ఎదురుగానే ఉంటడాయె. కాని వానితో నేనే పాప మెరుగ—"

"ఊఁ ... యింకేమన్నా సెప్పు కుంటావా!"

"నా సంసారం కాపాడుండ్లి..."

"దొంగముండ. ఎట్ల పల్కుతోందో సూడు పతివతోల్లె. గా మొకం జూడు ఎట్లున్నదో. ఏర్పడ్తలేదా" రాజయ్య తల్లి విజృంభిస్తోంది తుఫానులా.

పెద్దమనుషులు ప్రశ్నలు మానేసి తమలో తామే మాట్లాడుకుంటున్నారు. జనం తమలో తామే గొణుక్కుంటు న్నారు ఏదో.

యింకో ఐదు నిముషాల తర్వాత పెద్దమనుషులందరూ లేచి మర్రిచెట్టుకు దూరంగా నడిచి గుసగుస పెట్టుకుంటూ-

"యిప్పుడు రాజిగాని తల్లి యిచ్చిన పైకమెంతరా?"

"మూడు వందలు."

"మనిషి కెన్నస్తానయ్?"

"యాభై."

"మరింకేంది యిప్పుడు కాయితం రాసిపారెయ్యక."

"హా"

"హా"

యీ మాటలు మర్రిచెట్టు ప్రాంతాలకు వినబడలేదు.

పెద్దమనుషులు మళ్ళీ వచ్చారు మర్రిచెట్టు క్రిందికి రాబందుల గుంపులా. వచ్చి సర్పంచ్ స్వయంగా "లచ్చిగానికి రాజికి సంబంధ మున్నదని స్పష్టంగా తేలిపోయింది గాబట్టి యిక యిడ్పు కాయితం (విడాకుల పత్రం) రాయ డానికి పెద్దమనుషులు నిర్ణయించిండ్లు... రాఘవులూ రాసెయ్‌రా కాయితం..." అన్నాడు రాతిగొంతుతో.

రాజి భోరున ఏడుస్తూ వచ్చి సర్పంచ్ కాళ్ళమీద బడ్డది, శిలైన దేవుని పాదాలపై బడ్డట్టు

ఆమె ఏడుపు ఎవరూ వినలేదు. విన్నవాళ్ళు ఏమీ చేయలేరు.




ఓ పదినిముషాల్లో విడాకుల కాగితం సిద్ధమైంది.

రాజయ్యతో బొటనవ్రేలి ముద్ర వేయించారు. రాజి వేలికి ఎవరో సిరా రాస్తూంటే ఎండిపోతున్న సిరాపై ఓ కన్నీటి బొట్టును రాల్చి తడిచేసి ముద్ర వేసింది...కాదు వేయించారు.

రాజయ్య రాజివంక అప్పుడే మనిషిని చంపిన హంతకునిలా భయంగా, దీనంగా చూసి తల్లివెంట వెళ్ళిపోయాడు యజమాని వెంట కుక్కలా.

ఆ తర్వాత జనం వెళ్ళిపోయారు. పెద్దమనుషులు వెళ్ళిపోయారు.

యిక మర్రిచెట్టు క్రింద మిగిలింది రాజి-రాజితండ్రి...నిశ్శబ్దం...కన్నీళ్ళు.

ఓ పదినిముషాల తర్వాత వేపచెట్టు మీదనుండి దిగి మర్రిచెట్టు మధ్యకు వచ్చాడు సింహాద్రి చేతిలో బరిసెతో. వచ్చి ఏడుస్తున్న తల్లివంక లోకం తెలియని పసివాడు అమాయకంగా చూచినట్టు రాజి ఓక్క చూచి మౌనంగా ఊళ్ళోకి నడిచాడు.

రాజయ్య సింహాద్రికి బాగా పరిచయమే. రాజయ్య కుటుంబంతో

కూడా స్నేహం ఉందతనికి. ఐతే రాజయ్య తల్లి ఆదపులని సింహాద్రి క్కూడా తెలుసు

సింహాద్రి వెళ్ళేసరికి రాజయ్య వాకిట్లో నులకమంచంపై కూర్చున్నాడు ఒక్కడే. యింకెవరూ లేరు చుట్టు ప్రక్కల.

సింహాద్రిని చూసి "దా—అన్నా" అన్నాడు రాజయ్య.

"వచ్చాడ చెంకగని ... తాళ్ళలకు పోదాం రా. సుక్కేసొక్కవాలె. తోడెవ్వరులేరు."

రాజయ్యకు మహా సంతోషమైంది. తాను మందేసుకోవాలంటే అమ్మ దబ్బివ్వాలి. తాను తాగాలి...యిప్పుడు తేరగా సింహాద్రి సుక్కేయిస్తుంటే.., ఎగిరి గంతేసి సింహాద్రి వెంట నడిచాడు.

యిద్దరూ తోటలోకి నడిచింతర్వాత- సుక్కేసి...,

అప్పటికే మసకచీకటి ముసురు కుంటోంది. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి.

సింహాద్రి ఓ చెట్టు ముందరాగి రాజయ్యను పిలిచి "అటు చూడు" అన్నాడు.

కొమ్మమీద రెండు పిచ్చుకలు నిలబడి ఉన్నై కునికిపాట్లు పడుతూ..

రాజయ్య చూస్తూండగానే ఆ రెండు పిచ్చుకలనూ పట్టుకున్నాడు సింహాద్రి ఓ పావుగంటలో.

రెండింటిలో ఒకటి మగ యింకొకటి ఆడది.

రాజయ్య ఎదుటనే ఆడపిచ్చుకన్ ఉంచుకుని మగదాన్ని మళ్ళీ విడిచి పెట్టాడు. అది బుర్రున లేచిపోయింది.

చేతిలో పిట్టతో నడుస్తున్నారు యిద్దరూ. వాళ్ళపైన గాలిలో ఎగురుతూ అరుస్తూ వెంట వస్తోంది మగపిచ్చుక.

"యివ్వాళ రాత్రి నా దగ్గరనే ఉందరా రాజిగా ఓ కుందేలున్నది, దాన్ని వండుకుందాం. నీకూ మనసు బాగలేద గద. రేపు పోదువుశే."

యింటిదగ్గర రాక్షసిలాంటి తల్లి.

అన్యాయంగా రాజిని పోగొట్టుకున్న జ్ఞాపకాలు...జ్ఞాపకాలు...

రాజయ్య మనస్సు కూలిపోయిన చెట్టులా ఉంది. "సరే" అన్నాడు. ఓ రెండుగంటల తర్వాత యిద్దరూ భోం చేసి బయటమంచంపై కూర్చున్నారు.

సింహాద్రి ఏమీ మాట్లాడ్డంలేదు. చేతిలో ఆడపిచ్చుకను పట్టుకొక్కూర్చు న్నాడు. మగపిచ్చుక యింకా అక్కడే ఉన్న సంగతి అప్పుడుగాని గమనించ లేదు రాజయ్య. అది గుడిసె ఎదురుగా ఉన్న జామచెట్టుమీద నిర్విరామంగా అరుస్తోంది

యిద్దరూ చెరో మంచంలో పడుకున్నారు.

యిటు ఆడపిచ్చుక అరుపు—

అటు మగపిచ్చుక అరుపు—






రాత్రంతా అరుపులు...అరుపులు... అరుపులు.

రాజయ్యకు ప్రపంచమంతా అరుపులై...ఎటు చూచినా అరుపులై వినిపిస్తూ 'పిచ్చుకలే వేరై యింతగా గుండెలు పగిలేట్టు ఏడుస్తూంటే...తన రాజి'...రాజి...రాజి...రాజి

మసక మసక చీకట్లో ... యింకా పొద్దు పొడవక ముందే తనతో చెప్ప కుండా వెళ్ళిపోతున్న రాజయ్యను చూచి నిట్టూర్చాడు సింహాద్రి తృప్తిగా.

తూర్పు ఎరుపెక్కి సూర్యుడు నెత్తురుముద్దలా ఉరికొస్తూండగా ...

"సింహాద్రన్నా" అన్న పిలుపు వినబడ్డది.

గుడిసెలోనుండి బయటికొచ్చాడు సింహాద్రి.

ఎదురుగా రాజయ్య ... రాజి ... జంటగా...నవ్వుతూ—

"నాకు బుద్ధొచ్చిందన్నా" అన్నాడు రాజయ్య సిగ్గుతో.

ఎదురుగా జామచెట్టుమీద మగ పిచ్చుక ఉరుసూనే ఉంది యింకా.

సింహాద్రి గబగబా గుడిసెలోకెళ్ళి పంజరాన్ని పట్టుకొచ్చాడు.

ఆడపిచ్చుక అరచి అరచి సొమ్మ సిల్లుతోంది.

పంజ౦ం తలుపు తెరిచాడు.

పిచ్చుక తుర్రున ఎగిరిపోయి ... జామచెట్టుమీద వాలి ... అక్కడినుండి రెండూ ఎగిరిపోతున్నాయి నీలాకాశంలో స్వేచ్ఛగా ... హుషారుగా.

సింహాద్రి ఊపిరి పీల్చుకున్నాడు తృప్తిగా ఖాళీ పంజరాన్ని చూచి.

———




'గాలీ వాన'లాగా వచ్చేడు మురళి!

వర్ధనం తలుపు తీస్తూనే ఆశ్చర్యపోయి, ఆ మాటే అంది- "ఏమిటిలా గాలీ వాన లాగా వచ్చేవేమిటి, మురళీ!"

మురళి ముఖంలో మందహాసం మబ్బుల్లోంచి ఇబ్బందిగా తొంగిచూసే చంద్రుడిలా ద్యోతకమయింది వర్ధనానికి.

"అవును ... నీతో అత్యవసరంపడి వచ్చేను..." అన్నాడతను.

"ఏమిటీ?! నాతోనా!" వర్ధనం విస్మయం నిండిన కళ్ళతో నవ్వింది.

మురళి చేతిలోని ఎయిర్ బాగ్ ఆగదిలో టేబిలుమీద వుంచి, చుట్టూ చూస్తూ "మీ ఆయనేరీ? ఇంకా రాలేదేం ఆఫీసు నుంచి?" అడిగేడు.

వర్ధనం గబగబా అంది- "ఆయన కాంపు కెళ్ళారు ... సరేగాని నువ్వు బట్టలు మార్చుకో! పెరట్లో నీళ్ళోసుకుందువుగాని, రా! ఆనక కాఫీ ఇమ్మంటావా? ఇప్పుడే ఇవ్వనా?"

"ఇప్పుడే ఇవ్వు..."

వర్ధనం లోనకెళుతూంటే వెనకనించి చూస్తూ నిట్టూర్చేడు మురళి.

చిన్ననాటి స్నేహితురాలు వర్ధనం! కాకినాడలో వాళ్ళదీ, తమదీ రెండు ఇళ్ళూ పక్కపక్కనే వుండేవి. ఆడుతూ పాడుతూ పెంచుకున్న స్నేహాన్ని వయసు వచ్చేక 'వలపుగా' పండించుకున్నారు. కాని...కథ మామూలే అయిపోయింది ఇక్కడానూ! 'కులం' అడ్డు

అయింది! పెద్దవాళ్ళ అభ్యంతరానికి తమ ప్రేమ నిలవలేకపోయింది!!

వర్ధనం పెళ్ళయిపోయింది! ఈ వూరికి మకాం మారింది. తను కాకినాడలో డిగ్రీ సంపాదించి, ఓ గుమాస్తాగిరీ కూడా సంపాదించేడు.

"ఎంత అన్యాయం! నీకు పెళ్ళయిందన్న కబురే నాకు రాసేవుకాదు!?" అంది వర్ధనం కాఫీ తెచ్చియిస్తూ.

"మరెలా తెలిసింది నీకు?" అడిగే హత్రంగా మురళి.

"నా స్నేహితురాలొకామెకి మీ ఆవిడ చుట్టమేనుట...నా ఫ్రెండు నీ పెళ్ళికి వెళ్ళిందట..."

ఓ గుక్క తాగి, ఇక తాగలేనట్టు కాఫీగ్లాసు టేబిలుమీద పెట్టేసేడు మురళి.

"అదేం ? వేడి చాల్లేదా?"

"చాలా వేడిగా వుంది..."

"పంచదార ఇంకొంచెం వెయ్యనా?"

"ఆహఁ...వద్దు..."

"మరి?"

వర్ధనం అతన్ని చూస్తూ "నీ పెళ్ళి వూసు ఎత్తేసరికి కాఫీ సయించలేదా?" అంది కొంచెం నవ్వి.

మురళి దొరికిపోయిన దొంగలా యిబ్బందిగా చూశాడు.

"అసలు నేనొస్తే నీకేవిటి అడ్డు, నీ పెళ్ళిలో ? ఎంత స్నేహితురాలిని అయినా, పెళ్ళి అయిపోయిన దానినే గదా? నీ పెళ్ళి చూశామని ఎంత ఉబలాట పడ్డానో, నీకేం తెల్సు?"

"ఆ వుబలాటం తీరిపోలేదా నీకు! నీ స్నేహితురాలు ఏం చెప్పలేదా, నా పెళ్ళి విశేషాలు?"

వర్ధనం అదోలా నవ్వి, "నీకు ఆ అమ్మాయి ఇష్టంలేదుటగదూ? పీటల మీదకూడా కోపంగానే వున్నావుట! ఏఁవిటో! ఇలాంటి గుంపుసింపులు దాచుకుందామన్నా దాగవు!" అంది.

"అవును! దాగవులే...చెప్పేస్తున్నా పూర్తిగా విను! గీతని పెళ్ళిచూపుల్లోనే తిరస్కరించేను. కానీ, మావాళ్ళు బలవంతంగా నా కంటగట్టేరు..."

"నీ మాటేం బావోలేదు...నువ్వేం పాల్తాగే పాపాయివా, బలవంతంగా పాలంసీసా నోట్లో కుక్కి, ముక్కు మూసి తాగించడానికి?"

మురళి సిగ్గుపడిపోతూ, "నేను పాపాయినికాను...కాని ఈ పెద్దవాళ్ళు పిల్లల్ని వయసొచ్చినా, పాల్తాగే పాపాయిల్లాగే ట్రీట్ చేస్తామంటారు, అంత బలవంతంగానూ, అంత ఫోర్సు తోనూ! మన పెళ్ళివిషయంలో ఏం చేసేరు? అప్పుడు నేనూ, ఇన్ని మాటలంటున్న నువ్వూ ఏం చెయ్యగలిగేం చెప్పు?" అన్నాడు.

" నా వూసొదిలెయ్! నే నాడదాన్ని! నే నెంత ఫోర్సు చేసినా లాభం వుండదు! నువ్వు మగాడివి! నీకుండాలి ఫోర్సు!

వుఁహుఁ! ప్చ్! నువ్వెప్పుడూ ఒక్కలాగే వున్నావు!!"

"వర్ధనం! నేను నిన్ను నమ్ముకుని నీ సలహాకోసం వస్తే, నువ్వు మాటలతో నన్ను దావగొడ్తున్నావిదేం బావులేదు.."

"నన్ను నమ్ముకుని వచ్చేవా?! అరే! ఇంక నా మీద నమ్మకాలు, విశ్వాసాలూ నీకు ఎందుకటా? నేనేం చెయ్య గలననిటా??"

"నా దాంపత్యం విషయంలో..."

"వూఁ...చల్లకొచ్చి ముంత దాచటం దేనికో? ఆగిపోయావేం? పూర్తిగా చెప్పు!"

"నాకు గీత యిష్టంలేదు..."

"ఓసారి చెప్పేవు..."

"గీత మొహం చూస్తేనే నా కదేవిటో...చిరాకూ, కోపం పుట్టుకొచ్చే స్తాయ్! యింక తనతో ఎట్లా గడిపేదీ? మాటలే కలవందీ మనసే విటి? మనువేమిటి?"

"అయితే?!..."

"జంతువులా నేను సంసారం చెయ్య లేను! ఇద్దరం ఎడాపెడగానే వున్నాము"

వర్ధనం గట్టిగా నిట్టూర్చింది. "నేను బాధపడుతున్నాను..." అంది.

మురళి ఆమెని ఆశగా చూస్తూ "నా మీద నీకు ఆమాత్రం అభిమానం ఉందంటే చాలు!" అన్నాడు.

"నేను బాధపడుతున్నది గీత గురించి మురళీ!"

"గీత గురించా? ..." ముఖం ఎర్రగా చేసుకున్నాడతను. "ఎప్పటి నుంచో అనుబంధం వున్న నా గురించి ఆరాటపడక, ముక్కూ మొహం తెలీని మనిషికోసం బాధపడిపోతున్నావేం?!"

"గీత నాకు అపరిచితురాలె కావచ్చు! గీత సాటి ఆడది, మురళీ! గీత పరిస్థితి చాలా అధ్వాన్న స్థితిలో వుంది! నా జాతి మనిషిగా ఆమె గురించి జాలిపడడం, బాధపడడం నా కనీస ధర్మం!!"

"అధ్వాన్న స్థితిలో నేనూ వున్నాను!"

"నీ కేం మగాడివి! సమాజం ఎంత పురోగమించుతున్నానని విర్రవీగు తున్నా, మనిషికో రూలని అది పాటి స్తూనే వుంది! మీ మగాళ్ళ ధీమా, మీ ఫోజులు చెల్లుతూనే వున్నాయిగా?"

మురళి విసుక్కున్నాడు. "నా మొహం ధీమా! నా పరిస్థితి అసలు నీకేం తెలుసు! గీతతో నేను కాపురం చెయ్య లేదని, 'నేను మగాడిని కానంటూ' అందరితో కసిగా చెబుతోంది! దాంతో నే నందరి దృష్టిలో వుత్త పనికిమాలిన వెధవగా జమ అయిపోయేను! గీతని మంచిచేసుకొం కి నేను తనతో కాపురం చెయ్యాలా? లేక విడాకులు తీసు కోవాలా?..." అంటూ ఆగిపోయాడు.

"ఈ ప్రశ్నలు అడగడానికేనా




వచ్చేవు?" వర్ధనం సాలోచనగా చూస్తూ అంది

"ఇది నా జీవిత సమస్య, వర్ధనం! నా భవిష్యత్తు ఆ రెండు ప్రశ్నల మీదే ఆధారపడి వుంది!"

వర్ధనం ఫకాల్న నవ్వింది. ఆగి మళ్ళా నవ్వింది. మళ్ళా నవ్వింది.

"వర్ధనం!" మురళి వుడుకెత్తి పోయేడు.

"నీ కంత ఎగతాళిగా వుందా, నన్ను చూస్తే?"

వర్ధనం నవ్వినందువల్ల పైట జారి పోయిందికూడా చూసుకోలేదు. నవ్వుతో కళ్ళలో చిప్పిల్లిన నీటిని చేత్తో తుడుచు కొంటూంటే, మురళి ఆమె ఎగసి ఎగసి పడుతూన్న వక్షోజాల్ని, ఆడదాన్నెర గనివాడిలా చూడసాగేడు కళ్ళు విప్పార్చి

"మురళీ! అలా ఎగిరిపడకు! నీ రెండు ప్రశ్నలు వింటూంటే నాకు నవ్వు వచ్చింది. కాకపోతే ఏమిటా ప్రశ్నలు? నన్నే అడిగేవా? ఇంకెవరినైనా అడిగేవా అన్సర్లు చెప్పమని!"

మురళి మాట్లాడలేదు

వర్ధనం అప్పటికి తనవంక చూసుకుని పైట సర్దుకొంది. మురళి దగ్గరగా వెళ్ళి "కోపం తగ్గలేదా మురళీ! ఇలా చూడు! ఇంత పెద్దవాడి వయ్యేవు గాని నీలో ఇంకా చిన్నతనం పోలేదోయ్! నీ భార్యకి సంబంధించిన సమస్యలు పైవాళ్ళతో చెప్పుకుంటే నీ ముందు ఆలకించినట్టున్నా! వెనకాల నవ్వు కొంటారు!" అంటూ అతని వీపుమీద లాలనగా చెయ్యి వేసింది.

"నేను అందరితో చెప్పలేదు. నువ్వు బాల్యస్నేహితురాలివని, నేనంటే నీకు

చాలా చాలా ఇదని...అనుకుని వచ్చేను గాని......"

వర్ధనం పెదవులు విడకుండా నవ్వింది. ఆ నవ్వు!...అదంటే మురళికి ఎంతో యిష్టం! చిన్నప్పుడు వర్ధనం అలా నవ్వితే తను అయిసయిపోయి, తన దగ్గర ఏ వస్తువుంటే అది 'అచ్చంగా' ఇచ్చేసేవాడు! ఎదుగుతున్న వయసులో, ఎవ్వరూ వుండని ఏకాంతంలో 'ముద్దులు' కూడా ఇచ్చేడు! ఆ నవ్వు...మళ్ళా... ఇన్నాళ్ళకి!? మురళి దిగాలుపడి పోయేడు. ఇప్పుడు వర్ధనం అట్లా నవ్వితే...తను? ... గుండెలు ఝల్లు మన్నది. ఇద్దరికీ ఒక తెర వుందిప్పుడు!!

మురళి స్నానం చేశాక, ఇద్దరూ కూచుని భోజనం చేశారు. మురళి ఆమె వంట చాలా బావుందంటూ ఎక్కువే తిన్నాడు.

"ఇలా నీ దగ్గర కూచుని, నువ్వు వడ్డిస్తోంటే తినే అదృష్టానికి కనీసం ఇప్పుడైనా నోచుకున్నాను!"

వర్ధనానికి అతనలా అంటే చప్పున మనస్సు రాగరంజితమైంది. ఎదురుగా వున్నా, అతను ఒకప్పుడు తన ప్రేమికుడు!! అది కాదు లేదని అనలేని నిజం!!

"నీ జీవితం ఇలా అయినందుకు నాకు విచారంగా వున్నది మురళీ!" అంది నిట్టూర్చి.

"పోనీలే! ఇంతసేపటికయినా నా మీద నీకు జాలి కలిగిందదే చాలు!"

"అదేం మాట మురళీ! నేను నీ మీద ద్వేషంతో నిండి వున్నా నను కొంటున్నావా?! అలా అయితే నిన్ను నా యింట్లోకే రానివ్వను తెల్సా?"

"నే నీ రాత్రికి ఇక్కడే వుంటాను సుమా! మీ ఆయన కాంపు కెళ్ళారని నన్ను పొమ్మనకు! రేపెలా నూ పోతాను..." మురళి భయం నటిస్తూ అన్నాడు.

"అయితే నా పక్క ఆ గదిలో వేసుకుంటాను ... నువ్వు ఇదిగో ఈ మంచంమీద పడుకో!"

"మీ ఆయన ఓ రాత్రివేళ వస్తే?.."

"ఫర్వాలేదు! మేం ఏదోలా సర్దుకొంటాములే! అతిధికి అమర్యాద చెయ్యం!"

మురళి మంచంమీద కూచుని అన్నాడు : "నా కివాళ రిలీఫ్‌గా వున్నది వర్ధనం! నా మనసులోని ఆ బాధ నీతో చెప్పేసుకుంటే ... నీ సమక్షంలో గడిపితే......"

వర్ధనం ఆవులించి వెళుతూంటే "ఇంతకీ నా ప్రశ్నలకి జవాబు చెప్పేవు కాదు! నేను రేపు వెళ్ళిపోవాలి!" అన్నాడు.

"రాత్రి ఆలోచించి, రేపు చెబుతాను..." అని నవ్వి వర్ధనం వెళ్ళి పడుకుంది.

మురళికి నిద్ర రావడంలేదు. టేబిలు మీదున్న తన రిస్ట్‌వాచ్ తీసి టైము చూశాడు. పదిన్నర! ఆ గదిలోకి చూశాడు. తలుపు సగం వేసుంది. వర్ధనం తలుపు పూర్తిగా ఎందుకు వేసుకోలేదు? తనమీద సగం నమ్మకం వుంచిందా? సగం తలుపు తెరిచి!... పక్కమీద అటు యిటు దొర్లాడు. వుఁహు! కళ్ళు మూతలు పడడంలేదు. మనసు మూత పడడం లేదు. ఆలోచనలు!! జరిగిపోయినవి!! గీతతో పెళ్ళి. గీతతో కార్యం గదిలో, తన చిరాకు...గీత కన్నీళ్ళు. తర్వాత...గీత తనమీద అందర్తో చెడ్డగా చెప్పడం... తనకి మరింత ఆగ్రహం, వుద్రేకం!! తండ్రి...తల్లి, అందరిమీద ప్రళయ రుద్రుడే అయ్యాడొకసారి! తన జీవితాన్ని నాశనం చేశారని ... తల్లి బ్రతిమాలింది. జరిగిందేదో జరిగింది. ఆ పిల్లని అన్యాయం చెయ్యకంది. విడాకులిచ్చేస్తానన్నాడు. బంధువులంతా వెలివేసినట్టే చూశారు తను అలా అంటే!? "మగాడివి కావు గనకనే విడాకులిచ్చేస్తానంటున్నావ్!" అనేశాడు గీత తండ్రి! ఆ మాటతో తనకి పౌరుషం పెరిగిపోయింది. కాని అప్పటికే అలుసై పోయేడే! అర్జెంటుగా శలవుపెట్టి ఇలా వచ్చేడు! మనసుకి రిలీఫ్‌కోసం!! తన ఆవేదన బాల్యస్నేహితురాలితో చెప్పు కోవడంకోసం! వర్ధనంనుంచి ఏదో సలహా తీసుకొందికి......

మురళి ఇబ్బందిగా లేచి కూచున్నాడు, పక్కమీద. లోపల అసంతృప్తి...తినేస్తోంది! సుఖంలేదు. తృప్తిలేదు. సరదాలేదు. సంతోషం లేదు! ఇవన్నీ లేకపోవడానికి కారణం తనకి ధైర్యం లేకపోవడమే! తెగింపు లేకపోవడమే! వుంటే వర్ధనాన్ని పెళ్ళి చేసేసుకుని హాయిగా వుండేవాడిప్పుడు! వర్ధనం! అప్పటికీ యిప్పటికీ ఒక్కలాగే వుంది! శరీరంలో బింకం అలానే వుంది. మురళి మనసులో.. ఇందాక వర్ధనం నవ్విన దృశ్యం మెదిలింది. పైట జారి ఎగిరెగిరిపడుతున్న వక్షం......

మురళి కూచోలేక లేచి నుంచున్నాడు. వొంట్లో రక్తం వురకలేస్తూంది. నరాలు పొంగుతున్నాయ్. ఆలోచనలన్నీ ఒకే వైపు వున్నాయ్ ఇప్పుడు! కావాలి కావాలి! ఈ అసంతృప్తి దేహానికి... ఈ అశాంతపూరిత హృదయానికి ... వుపశమనం...

అడుగులో అడుగేస్తూ అతను వర్ధనం గది దగ్గరకు వెళ్ళేడు. తలుపు ఎడంలోంచి చూశాడు. వర్ధనం పట్టె మంచంమీద వెల్లకిలా పడుకునుంది, చేతులు రెండూ అటూ ఇటూ చాచి. వుచ్ఛ్వాస నిశ్వాసాలతో వక్షం ఎగసి పడుతూంది. మురళి తలుపు తోశాడు. గదిలోకి నడిచేడు. వుద్రేకంతో వొళ్ళు వొణుకుతోంది. వూపిరి వేగంగా వస్తోంది. మంచం దగ్గరికి వెళ్ళేడు.

వర్ధనం గాఢనిద్రలో వుంది! పమిట పక్కమీదికి జారింది. చీర మోకాళ్ళ వరకూ స్థానం మారింది. నిగ్రహం కోల్పోయేడు మురళి. వొంగి, వర్ధనం పెదవులతో తన పెదవుల్ని కలిపాడు. వివశత్వంతో గాఢంగా చుంబించాడు. వులిక్కిపడి కళ్ళు తెరిచింది వర్ధనం.

మురళి!!

"మురళీ!!" చిన్నకేక వేసింది. అతన్ని విడిపించుకోబోతూ. మురళి విడివడలేదు ఆమెని అల్లుకుపోతున్నాడు! "ఛీ! తప్పు! వొదులు!"

"వర్ధనం! కావాలి వర్ధనం...నువ్వు నాక్కావాలి" అంటూ అతను గాఢంగా ఆమెని పెనవేసుకుపోతున్నాడు.

"ఛీ! కావాలిట!! నేనా? ఇప్పుడా?! నీకు సిగ్గులేదా? నాకు భర్త వున్నాడు!" "వొదులూ! వూఁ...!"

"వుంటే వుండనీయి! ఇక్కడిప్పుడు లేడుగా?"

వర్ధనం బలవంతంగా లేస్తూ "నీకు కావల్సింది వర్ధనం కాదు! ఆడది! పరాయి ఆడది! నీ భార్య తప్ప ఏ ఆడదేనా నీకాక్కావాలి, ? ఏం ఛీ!" ఛీత్కారం చేసింది.

"నువ్వే నువ్వే కావాలి వర్ధనం!... ఇంకెవరూ వద్దు నాకు! ఏమీ వద్దు!" అతను జంతువే అయిపోయాడు! వర్ధనాన్ని లేవకుండా, కదలనీకుండా బలవంతంగా నొక్కిపడుతూ, జాకెట్టు పర్శ మని చించేసాడు. చీర లాగేశాడు, లంగా కూడా లాగేయబోతూంటే వర్ధనం ఒక్కవూపున కాళికలా లేచింది. మురళి దబ్బున పడిపోయాడు నేలన. వర్ధనం అతన్ని లేపి మరీ ఈ చెంపా ఆ చెంపా టపటపా వాయించేసింది.

"ఛీ! దుర్మార్గుడా! నిన్ను అన్నం పెట్టి, ఆదరించినందుకు నాకు ఇదా నువ్విచ్చే ప్రతిఫలం?! ఫో! నీ పెళ్ళాం మీద పడు! వూరివాళ్ళమీద కాదు!! నీ దాహం చల్లారుతుంది! ఆ మనిషి నిన్ను మగాడిగా ముగుడిగా చూసుకుంటుంది!"......

మురళి సిగ్గుతో కుంచించుకుపోతూ గోడకి అతుక్కుపోయి నిలబడ్డాడు, తలొంచుకుని.

వర్ధనం చీరె తీసి కట్టుకుంది. ఆ భుజాలమీంచి చీరచెంగు కప్పుకొని అతని దగ్గరగా వెళ్ళి "విడాకులు కావాలా? ఎందుకూ? యిందుకా? అచ్చోసిన ఆంబోతులా అందరు ఆడాళ్ళమీదా పడ్డానికా, విడాకులు?! ఇవ్వదు నీ పెళ్ళాం! ఏమనుకుంటున్నావో! కట్టుకున్న ఏ భార్యా అంత తేలిగ్గా విడాకు లివ్వదు! ఇప్పటికైనా పోయి నీ పెళ్ళాం కొంగట్టుకున్నావా సరి! లేకపోతే నిన్నింకా ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగిస్తుంది తెల్సుకో!!"

మురళి తల ఇంకా వొంగిపోయింది.

"ఇంకా నిలబడ్డావేం?! దొంగ

వేషాలేస్తున్నావేం? నాకు మీ మగాళ్ళ మీద నమ్మకం ఏడాది క్రిందటే పోయింది. అందుకే నా మొగుడు కాంపుకి వెళ్ళాడని చెప్పాను.... అయినా నీ జంతు బుద్ధి చూపించుకున్నావు!..."

మురళి ఆశ్చర్యంతో తలెత్తి గొంతు కూడదీసుకుని "అయన..." గొణిగేడు.

వర్ధనం విసురుగా "ఆఁ ... ఆ మహానుభావుడు వెళ్ళింది కాంపుక్కాదు.. దేశంమీదికి. ఇల్లు, ఇల్లాలు ... అంతా వొదిలేసి పోయేడు...ఏడాది క్రితం... నాకు తెలియక అడుగుతాను., పెళ్ళాల్ని వదిలి పారిపోడానికి, మీకు పెళ్ళెళ్ళెందు కయ్యా అయితే?" రౌద్రంగా అంది. వర్ధనంలో ఇందాకటికీ, ఇప్పటికీ ఎంత తేడా?! అప్పుడెంత సౌమ్యమూర్తి! ఇప్పుడెంత రుద్రమూర్తి!?

మురళి గబగబ తన బట్టలు వేసుకుని బాగ్ పట్టుకున్నాడు.

"ఒక్క సందేహం...నువ్వు నువ్వయితే, ఎలా యిప్పుడు?"

వర్ధనం విసుగ్గా నవ్వి, "మొగుడు వదలి పారిపోతే బతకలేననుకున్నావా? నా పియ్యూసీ, టైపు సర్టిఫికేట్లు నాకున్నాయి. ఇదిగో పెళ్ళాం లేకపోతే గతి లేనట్టు మీరు వూరిమీద నీచంగా పడ్తారు గాని, మా కా పాడు కర్మ్కర్తి వుండదు! ఎలాగో గౌరవంగా మా బతుకు మేం బతక్కపోము!"

మురళి పరిగెత్తినట్టే నడిచేడు.

* * *

"అయితే ఆ తర్వాత ఏమైంది? మురళి కాపురం?" ఆత్రంగా అడిగేడు రమణమూర్తి నన్ను.

ఆ గదిలో నేనూ, రమణమూర్తి కుర్చీల్లో కూచుని వున్నాం. మా ముందు టేబిలుమీద సిగరెట్ పాకెట్లు, అగ్గిపెట్టె, కథ రాసిన కాయితాల దొంతర, వాటి మీద పేపరు వెయిటు, పెన్ను, ఆ ప్రక్కన పొడుగాటి కవర్లు కొన్ని వున్నాయి. ఫ్లాస్కు కూడా వుందక్కడ.

నే నిటీవల రాసిన కథ మిత్రుడికి ఇంతసేపూ, చదివి వినిపించేను. ఎండింగు ఇంకా రాయలేదు. మూర్తి సిగరెట్టు నోట్లోది ఆఖరి పీల్పు పీల్చి యాష్ ట్రేలో పడేసి, వెంటనే ఇంకోటి అంటిస్తూ, మళ్ళా అడిగేడు. "చెప్పు కృష్ణా? లాస్టుకి ఏమౌతుంది?"

ఫ్లాస్కు తెరిచేను. లేచి కిటికీలో వున్న రెండు గాజు గ్లాసులు తీసి, ఫ్లాస్కులో కాఫీ గ్లాసుల్లో వొంపాను. యింతసేపూ సస్పెన్స్‌తో మూర్తి యాంగ్జైటీగా వీలవడం గమనిస్తున్నాను! నవ్వుతూ నేనో గుక్క తాగి, అతని గ్లాసు జరిపి, "చెప్పు? నువ్వు? ఆఖరికేమౌతుందో? నా కథంతా విన్నావు గదా సరిగ్గా?" అన్నాను.

మూర్తి కాఫీ గబగబా తాగేసి "ఇదిగో నీ కథ ప్రకారం అయితే ఆ మురళి చచ్చినట్టు ఏలుకుంటాడు భార్యని,

వర్ధనం ఇంట్లో జరిగిన ఇన్సిడెంటుకి!!.." అన్నాడు.

"అలా జరగాలి! అలా అయితేనే సహజంగా వుంటుంది. కథ ..." అన్నాడు మురళి.

"అవును ... కథలో అయితే ఆ ఎండింగు సహజంగా వుంటుంది. కథకి న్యాయం చేకూరుతుంది. ఏం?"

నా మాటకి మూర్తి "అదేం? అలా అంటున్నావ్? నువ్వు ఇంకొకలా ఎండ్ చేద్దామనుకుంటున్నావా?" అడిగేడు ఆశ్చర్యంతో.

"నేను రాస్తోన్నది కథ కాదు ... జీవితం! అందుకని జీవితంలాగే ముగింపు ఇస్తాను..." అన్నాను నా ఖాళీగ్లాసు టేబిలు మీదుంచి.

మూర్తి మరింత ఆశ్చర్యంతో "కథ కాదా?! ఎవరి జీవితం అదయితే?" అడిగేడు.

"చెబుతాను ... ముందు మురళి గురించి చెప్పనీ! అతను భార్యని ఏలుకుంటాడనీ, మారిపోయాడనీ కదూ అన్నావ్? లేదు...మురళి వర్ధనం ఇంటినుంచి వెళ్ళాక భార్యని మరింత ద్వేషించేడు..."

"ఆఁ!?"

"గీత విడాకులివ్వకపోయినా, అతను మట్టుకు గీతని ఏలుకోలేదు ...... ఆ వూర్నించి వెళ్ళిపోయి, ఒక్కడూ ఓ వూళ్ళో, ఓ చోట ట్యూషన్స్ చెప్పుకొంటూ, కథలు రాసుకుంటూ జీవితాన్ని దొర్లించేస్తున్నాడు నిర్లిప్తంగా..."

మూర్తి కళ్ళు విప్పార్చి "అయితే?" అని నన్ను చూస్తూ ఆగిపోయేడు.

"ఆ వూరినీ, ఆ వుద్యోగాన్నీ, భార్యనీ అందర్నీ అన్నిటినీ పరిత్యజించేసి, వెళ్ళిపోయి ఇక్కడిలా..."

"నువ్వేనా అయితే, కృష్ణా? మరి మురళి...?"

"నా పూర్తిపేరు మురళీకృష్ణ ... కొందరితో బాటు, సగం పేరు నే వదిలేసేను...నీతో పరిచయం అయ్యాక ఈ రెండేళ్ళలో ఒక్కమారూ నా కథ నీకు చెప్పలేదుగదూ? నిన్న ఎందుకో నా పాత జీవితం కళ్ళముందు మెదలిందోయ్! పడుకున్న టైములో ... కాయితాలమీద పెట్టాలనుకున్నాను..."

మూర్తి సందేహంగా, "అయితే మీ..." అన్నాడాగిపోతూ.

"వాళ్ళంతా ఏమయ్యారో తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు. ఆ అవసరం నాకు లేదు..." నా గొంతులో మార్పుని చూసి మూర్తి జంకి, కుర్చీలోంచి లేచేడు.






ఆ వేళకి, ఆ వీధి రోజూ దాదాపు నిర్మానుష్య మవుతుంది. అక్కడ భయంకర నిశ్శబ్దం తాండవిస్తుంది. రాత్రి పదకొండు, పన్నెండు గంటల మధ్య అది సహజం. అది నేను రాత్రి డ్యూటీ ముగించుకుని వచ్చే వేళ. వీధుల్లోని సవ్వడి ఇళ్ళలో దూరి, నిద్ర పోయే వేళ

ఒక ఇంట యువదంపతుల అదిరే అధరాల అమృతపు విందులు...మరొక ఇంట పసిపిల్ల తల్లి రొమ్ములో తల దూర్చి చేసే చిలిపిచేష్టలు. వేరొక ఇంట అలసిపోయిన యిల్లాలు మగతనిద్ర, కలవరింతలు . ఇంకొకచోట ఒంటరి యవ్వనం జంటకోసం అన్వేషణ...

అదీనేను ఇంటికితిరిగివచ్చే సమయం.

ఆ ఇంట్లోంచి ఓ ఇల్లాలి ఆర్తనాదం వినిపించే సమయం

పాపం. ఆ మేడమీద కాపురం చేస్తున్నది ఎవరోనని అనేకమార్లు అనుకున్నాను.

అక్కడకు వచ్చేసరికి నా గుండె గుభిల్లు మంటుంది. కాళ్లు భయంతో వణుకుతాయి. నా చూపులు అప్రయత్నంగా, ఆ మేడపైకి ప్రసరిస్తాయి. ఎవరూ కనిపించరు. చీకటిని చీల్చుకుంటూ వచ్చే ఏడుపు మాత్రం వినిపిస్తుంది. దుర్భరమైన కేకలు, అరుపులు, ఆర్తనాదం...

* * *

ఆమె కిటికీవద్ద నిలబడి దైన్యంగా వీధిలోకి చూస్తుంది. ఆ కళ్ళు చీకట్లో, ఆశాదీపాలు. కర్టెన్ పక్కకు వత్తిగిలించి, కమ్మికి తల ఆన్చి, ఉబికి వస్తున్న దుఃఖాన్ని పెదాల వెనుక దాచ ప్రయత్నిస్తోంది, ముహూర్తం వేళ ఆసన్న మవుతుంటే, ఆశ, ఆ వెంట భయం, నిరీక్షణలో ఆనందం ఆనందం చివర గుండె మంట...అది అనుభవం..

అడుగుల చప్పుడు...ఆ చప్పుడు ఆమెకు అనుభవమే...తను ఎదురు చూచేది ఆ చప్పుడు కోసమేనన్నట్లు నీల తలెత్తి చూసింది

'ఆయనే' అనుకుంది.

కళ్లలో కాస్తంత ఆశ.

మందంగా గేటు తెరచిన సవ్వడి. మేడమెట్లు ఎక్కుతున్న అడుగుల పైనం. ఆయనే...అనుమానంలేదు. కళ్ళు వత్తుకుంటూ వెళ్ళి తలుపు గడియ తీసింది.

ఆమె నీల......అలంకరించుకోక పోయినా అందంగానే వుంటుంది. అపరంజి బొమ్మ...మూర్తీభవించిన యవ్వనం ఆమె. కానీ ఆమె యవ్వనం అడవికాచిన వెన్నెలవంతు.

ఆమెను విసురుగా తోసుకుంటూ, లోపలకు నడిచాడు అతను. అతని మొహం బరువుగా వుంది. కళ్లు ఎర్రగా, జ్యోతుల్లా వున్నాయి. అతను మన్మధరావు. ఆమెకు తాలికట్టిన భర్త. అతన్ని చూడగానే నీల మొహం విచ్చుకోబోయి ముడుచుకుపోయింది నిట్టూర్పు తెర వేసి, తలుపు గడియ పెట్టింది.

"భోజనం చేయరూ?" అంది, గొంతులోని దుఃఖాన్ని గుండెలోకి నెడుతూ. అందుకు అతని సమాధానం లేదు. పైగా, "లైటు ఆర్పు" ఆజ్ఞ... మరొక నిమిషంలో లైటు ఆరిపోయింది.

మరో అయిదునిమిషాలు ..ప్రళయం ...అతను ఆమెను కొట్టిన శబ్దాలు... ఆమె ఏడుపు...అరుపులు...వెక్కి వెక్కి ఏడుస్తోంది. దెబ్బలు భరించలేక ఏడుస్తోంది.

"నన్ను చంపకండి...బాబోయ్ చచ్చిపోతున్నాను." ఆమె అరుపులు ఆ నిశీధిలో ఎవరు వింటారు? విన్నా ఎవరు కల్పించుకుంటారు! వారు భార్యాభర్తలు...భార్యాభర్తల మధ్య, ప్రేమ

విషయంలో, ద్వేషం విషయంలో జోక్యం కలిగించుకోగల పెద్దమనిషీ లేడు, చట్టమూ లేదు. ఇది భారతదేశం... కర్మ శాపగ్రస్థమైన పవిత్రదేశం ఇది.

* * *

భర్త వెచ్చని కౌగిలిలో మత్తుగా పడుకున్న రజని త్రుళ్ళిపడి లేచింది. వేణు ఆమెను కదలనివ్వకుండా పట్టుకుని "పడుకుంటూ, రోజూ వుండే గొడవేగా" అన్నాడు. అన్నా, ఆమె గుండె దడ తగ్గలేదు. సాటి ఆడది, అందునా తన స్నేహితురాలు నీల అలా దెబ్బలకు తట్టుకోలేక విలవిల్లాడిపోతుంటే, తను భర్త కౌగిలిలో ఎలా సుఖించగలదు!

"ఛీ ఉండండి," అంటూ లేచింది. వేణు రజని పెదవుల్ని గట్టిగా ముద్దాడి 'హో' అన్నాడు, అలక వహించి

"పాపం, నీలను చంపేస్తాడేమోనండి, దుర్మార్గుడు" అన్నది అతని గుండెలమీద సుతారంగా వేళ్లతో నిమురుతూ.

"అందుకని మనమేం చేస్తాం?"

"మగబుద్ధి పోనిచ్చారుకారు, మీ స్వార్థమే మీది. సాటి మనిషి చచ్చినా, బతికినా పట్టదు" గారం పోయింది.

"ఏం చేద్దాం చెప్పు" అన్నాడు, ఆమెను గుండెలపైకి లాక్కుంటూ. "పోనీ పుట్టింటికైనా పోవే అంటే విని చావదు గదా" స్వగతం. ఒక రోజున అదే జరిగింది.......



"పారిపోరాదూ" అని తను సలహా యిచ్చింది....

"ఇంకా నయం, 'లేచిపోరాదూ! అన్నావు కాదు' అన్నది నీల. పైగా "మగాళ్ళంతా అంతేలే" అన్నది, ఊరడింపుగా.

"నీ బొంద...మేం, మీలాగా కొట్టుకు చస్తున్నామా" అని నిలదీసింది తను.

"నా కర్మ" అన్నది నీల.

"కాదు చేతకానితనం...అలాటి

మొగుడితో సుఖపడడం కన్న, మొగుడు లేకుండా ఉండడం హాయి" అన్నది తను

"నిజమే...'మబ్బు విడిచిన ఎండ, మొగుడు వదిలిన ముండ' అంటారు అందరి కళ్ళు అప్పుడు నా మీదే వుంటాయి...ఆ నరకంకన్నా ఇదే నయం కదూ" అన్నది నీల

"వదిలెయ్ వెధవ మొగుడ్ని...నీవు 'కో' అంటే కోటిమంది వస్తారు పువ్వుల్లో పెట్టి పూజిస్తారు. నీకేం అందం తక్కువా! చదువు తక్కువా! హాయిగా ఉద్యోగం చేసుకున్నా బ్రతగ్గలవు" అని తను సలహా యిచ్చింది.

నీల నవ్వింది.

"ఆయన తాగినప్పుడే అలా వుంటారు. కొడతారు. మిగతావేళల్లో నేనంటే ఎంతో ప్రేమ"

"సిగ్గులేకపోతే సరి."

* * *

నీలా, రజనీ క్లాస్‌మేట్స్ ఒకే వీధిలో ఉండడంతో మరీ అన్యోన్యంగా పెరిగారు. అందరూ వాళ్ళను అక్కచెల్లెళ్ళనేవారు. బి. ఎ. చదువుతుండగానే రజని పెళ్ళి అయింది. పెళ్ళి కాగానే చదువు మాని కాపురానికి వెళ్ళింది నీల డిగ్రీ తీసుకునిగానీ పెళ్ళిచేసుకోనని పట్టుబట్టింది. అన్నట్లే నీల బి. ఎ మన్మధరావును చూడగానే మనసిచ్చింది. అతని అందం, ఠీవి, ఉద్యోగం నీలను బందీ చేశాయి. మన్మధరావు ఎమ్. ఎ పాసైనాడు లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు అంతకన్నా ఏం కావాలి అనుకుంది నీల. పైగా తనంటే ఇష్టమని స్పష్టంగా చెప్పాడు. ఎంత ఫ్రాంక్, ఓపెన్ హార్టు అనుకుంది.

అనుకోకుండా నీల భర్తకు, అంటే మన్మధరావుకు, హైదరాబాదుకు బదిలీ అయింది. అప్పుడే రజని వాళ్ళ క్రింది పోర్షన్ ఖాళీ కావడమూ జరిగింది. ఇలా వస్తున్నామని నీల రాయగానే రజని తన భర్తతో చెప్పింది. మన ఇల్లు నీలవాళ్ళ కిద్దాం. నాకు తోడుగా వుంటుంది. నా బెస్ట్ ఫ్రెండ్, ఆమె అని

సరే నన్నాడు వేణు కాదనేపాటి సంస్కారం అతనికి లేదు అతను పెద్దగా చదువుకోలేదు మరి...తాము క్రింది పోర్షన్‌కు మారి, చిన్నదైన పై పోర్షన్ నీల కుటుంబానికి కేటాయించారు. అద్దె అసలు వద్దు అన్నారు గానీ, మన్మధరావు మరీ మొహమాటపెట్టి, ఓ ఏర్పాటు చేసుకున్నాడు.

ఇంటిలో చేరటోయే ముందు యిచ్చిన అడ్వాన్సు తప్ప, ఈ ఆరునెలల్లో మళ్ళీ మన్మధరావు అద్దె యిచ్చిన పాపాన పోలేదు, ఇవ్వాలన్న ప్రయత్నమూ చేయలేదు

ఒకరోజున రజని మేడపైకి వచ్చింది. అద్దె సంగతి ప్రస్తావించాలనికానీ నీలను చూచి నోరు మెదపలేక పోయింది ఆమె మెడలో వుండవలసిన మంగళసూత్రం

'తాడు' కనిపించలేదు. చేతికి ఉండవలసిన బంగారు గాజులు లేవు. చెవుల కమ్మలు లేక మరీ బోసిగా వుంది.

"అదేమిటే నీలూ, మరీ నగలన్నీ తీసేశావు" అంది రజని. నీల నవ్వింది బాధగా...కళ్ళు వొత్తుకుంది.

"కూర్చో ... కాఫీ తెస్తా" అని వంటగది వేపు నడిచింది. పెల్లుబికి వస్తోన్న దుఃఖం ఆపుకోలేక.

ఆడదాని మనస్సు గ్రహించడం ఆడవారికే సాధ్యం.

రజని విసవిస మన్మథరావున్న గదిలోకి వెళ్ళింది.

"ఏమండీ మన్మథరావుగారూ! మీ కంటే చిన్నదాన్ని, అయినా ఒక విషయం చెప్పాలని వచ్చాను" అన్నది కోపంగా చూస్తూ....

"నేను మీ సలహా అడిగినప్పుడు చెబుదురుగానీ..." వ్యంగ్యంగా అన్నాడు.

రజని కోపం నసాళానికెక్కింది.

"చదువుకున్నవారనీ, మంచి వారనీ ..."

ఇంకా అనబోతుండగా ... "నాకు సర్టిఫికేట్లు వున్నాయి చూపిస్తాను కావాలంటే" అన్నాడు.

"అవి చూసే మోసపోయింది మా నీలవేణి. మిమ్మల్ని చూసేవరకూ నీల అదృష్టవంతురాలనుకున్నాను."

"కాదని ఆవిడ చెప్పిందా?"

"ఒకరు చెప్పాలా, మీ ప్రవర్తన నాకు నచ్చలేదు."

"నష్టమేం లేదనుకుంటా "

"కానీ మా ఇంట్లో వున్నారు కనుక, నీల నా ఫ్రెండ్ గనుక నాకూ బాధ్యత వుంది."

"అయితే ఇల్లు ఖాళీచేయమంటారు."

"మీ కేం, అవసరాన్నిబట్టి ఇల్లు మార్చగలరు, ఇల్లాల్ని మార్చగలరు. కానీ మనస్సు మార్చుకోలేరు. మనస్సు మార్చుకోరు."

"ఇల్లాల్ని కూడా మార్చమంటారా! మీ కిష్టమైతే."

"యూ షటప్...స్కౌండ్రల్."

"థాంక్స్."

రజని విసవిస మేడ దిగింది... అతని మొహం చూడాలంటే అసహ్యం. అతనన్న మాటలు వేణుతో ఎలా చెబుతుంది...చదువు పెద్దగా లేకపోయినా తన వేణు ఎంత యోగ్యుడు. ఛా ... ఆడపిల్లలు డిగ్రీల్ని అందాన్ని ప్రేమిస్తారు యోగ్యతల్ని ప్రేమించరు.

నీల సంసారంతో పోల్చితే తనది స్వర్గసీమ. తన భర్త చీకటిపడే వేళకు ఇంటికి వస్తాడు. తనను రెప్పలా చూచుకుంటాడు. పాపం! నీల భర్త తప్పత్రాగి, ఏ అర్ధరాత్రికో వస్తాడు. దాన్ని చావగొడతాడు. నీల సంసారం ఒక మార్గానపడడం ఎలా? ఆలోచించింది రజని.

రోజులు గడుస్తున్నాయి.

రజని నిరీక్షిస్తోంది. కిటికీవద్ద నిలబడి, మన్మధరావు కోసం...ఇది వరకు నీల అలాగే నిరీక్షించేది.ఇప్పుడు తను.

అతను వస్తున్నాడు, ఆ టో లో తూలుతూ, అడుగులు తడబడుతూ దిగాడు.పడిపోతాడేమోననిపిస్తోంది.మేడ మెట్లు ఎక్కుతున్నాడు, మత్తుగా...పైన 'నీల'తలుపు తెరిచింది...లైటు వేసింది. అయిదు నిమిషాలకు లైటు ఆరింది.

మన్మధరావు చెయ్యెత్తాడు....నీల సిద్ధంగానే వుంది. దెబ్బ పడలేదు. కానీ పెడబొబ్బలు...అరుపులు...కేకలు ఎవరో పెడ పెడ కొడుతున్నారు... దెబ్బ మీద దెబ్బ...మన్మధరావు ఎత్తిన చెయ్యి అలాగే దిగిపోయింది. తూలుతూ కిటికీ వద్దకు పరుగుతీశాడు. క్రింది పోర్షన్ నుండి అరుపులు.

"మీ రజని కదూ" అన్నాడు నీల వైపు చూస్తూ.

"అమ్మోయ్, బాబోయ్, చచ్చాను నాయనోయ్." రజని గొంతు.

"బావుంది.ఈ గాలి క్రిందికి వీచిందన్న మాట. ఆరునెలలు సావాసం చేస్తే వారు వీరవుతారుట, నిజమే" అన్నది. మన్మధరావు మత్తు దిగింది.

"వేణుగారికి తాగే అలవాటుందా?" ఆసక్తిగా అడిగాడు.

"తెలియదు. నేర్చుకున్నాడేమో" అన్నది బాధగార.

"పాపం, రజనిగారు మంచిదికదూ" అన్నాడు మన్మధరావు.

* * *

మర్నాడు మన్మధరావు, ఇంటికి వచ్చి, మేడ ఎక్కుతుండగా మళ్ళీ రజని ఏడుపు, అరుపులు. అతను ఓ క్షణం ఆగాడు. కానీ ఏంచేయలేక నిట్టూర్చి, పైకి నడిచాడు.

ప్రతిరోజూ అది మామూలైంది. రజని పట్ల అతనికి సానుభూతి ఎక్కువ అవుతూనే వుంది.

ఇప్పుడు తాగకుండా వస్తున్నాడు. 'రజని' కోసం. నీలతో రజని సంసారం గురించి చర్చిస్తున్నాడు.

తాగుడు తగ్గింది పూర్తిగా. సరాసరి ఇంటికే వస్తున్నాడు. నీలతో సరదాగా కబుర్లు చెబుతున్నాడు. ఇద్దరూ కలిసి సినిమాలకు వెళుతున్నారు. అతని కళ్ళు రజని కోసం వెతుకుతున్నాయి, కానీ ఆమె మాత్రం కనిపించడంలేదు.

భర్త మారినందుకు సంతోషించింది నీల...కానీ రజనిని తలుచుకుంటే పుట్టెడు దుఃఖం ముంచుకువస్తోంది. రజనికి తన మొహం చూపించలేక పోతున్నది.

ఆ రోజు ఎలాగైనా, 'వేణు'కాళ్లయినా పట్టుకుని 'రజని'ని బాధించవద్దని అడగాలనుకొన్నది. అందుకు




మన్మధరావు ప్రోత్సాహం కూడా వున్నది.

రజని కేకలు వినిపిస్తుండగా మేడ దిగివచ్చింది. తలుపులు తెరిచేవున్నాయి. నెమ్మదిగా లోపలికి వెళ్ళింది. పడక గదిలోంచి శబ్దాలు...కాస్త తెరతొలగించి తొంగి చూచింది. వేణు కౌగిలిలో రజని నవ్వుతూంది.

వేణు ఆమెను ముద్దులతో ముంచెత్తుతున్నాడు.

"అబ్బ! వుండండి" అంటూనే 'బాబోయ్,' అని కేకవేసింది.

"ఊఁ చాల్లేవోయ్, నీ నాటకం, వాళ్లు నిద్రపోయి వుంటారీపాటికి...రా... తలుపులు వేసి, దీపం ఆర్పేయి" అని పిలుస్తున్నాడు. రజని, మత్తుగా, అతని పెదాల్ని ముద్దుపెట్టుకుని, 'జస్ట్ ఎ మినిట్' అన్నది.

"అమ్మ దొంగా" అనుకున్నది నీల ...కళ్లలో ఆనంద బాష్పాలు కదిలాయి. లేడిలా పరుగుదీసింది మేడపైకి....

వెళ్ళి అమాంతం మన్మధరావు చేతుల్లో వాలిపోయింది. ఎన్నడూ లేనంత ఆనందంగా, తృప్తిగా వుంది నీలకు ఆ రోజు.

# యోగం

సత్యం మందపాటి



"మనవాడిది గొప్ప యోగం అని చెప్పాడు శాస్త్రులుగారు" అన్నది వసంత, శ్రీరాంతో.

"ఆ యోగంకోసం ఒక యజ్ఞం చేయాలనీ, ఒక ఆవునో, ఏనుగునో తనకు దానం చేయాలనీ అనలేదా ?" నవ్వుతూ అన్నాడు శ్రీరాం.

"నీకు బొత్తిగా భయమూ, భక్తీ లేవురా— పెద్దవాడివి నువ్వే అలా మాట్లాడితే నీ చెల్లెలూ, తమ్ముళ్ళూ కూడా నీలాగే తయారవుతారు," అన్నది జానకమ్మ.

"అన్నయ్య సెలవులకు వచ్చింది నువ్వు పెట్టే చివాట్లు తినటానికి కాదమ్మా, సరదాగా గడపటానికి" అన్నది వసంత.

"తెలుసులేవే- మొన్నేం జరిగిందో తెలుసా నాయనా..." జానకమ్మ చెప్ప బోయింది

"నే చెబుతానుండవే అమ్మా- మరే అన్నయ్యా- మొన్న రాజాకి పెద్ద

గండం తప్పింది-" ఆనాడు జరిగిన దంతా గుర్తుకువచ్చిందేమో, వసంత ముఖంలో భయం స్పష్టంగా కనపడింది.

మూడేళ్ళ రాజాను ఒడిలోకి తీసుకుంటూ, "ఏంజరిగిందో త్వరగా చెప్పవే- నన్ను చంపక" అన్నాడు శ్రీరాం.

"మొన్న మధ్యాహ్నం నాన్నేమో పొలానికి వెళ్ళాడు. అమ్మేమో అన్నాలు తిన్న తర్వాత మధ్య గదిలో నడుం వాల్చింది. నేనూ, రాధా ముందుగదిలో కారమ్స్ ఆడుకుంటున్నాం. మధ్యాహ్నం రెండుగంటలయింది అనుకుంటాను టైమ్. రాధ మంచినీళ్ళు కావాలంటే లోపలకు వచ్చి వరండాలోకి చూసేసరికి గుండె లదిరిపోయాయి. రాజా వరండా వెనకాల వున్న సన్నజాజి పందిరి క్రింద కూర్చుని వున్నాడు. వాడి చేతిలో పొడుగాటి నల్లటి త్రాచుపాము. నవ్వుతూ దానితో ఆడుకుంటున్నాడు. అది చూడగానే నాకు భయంవేసింది. నోట మాట రాలేదు. ఇంతలో తేరుకుని గబగబా వెళ్ళి అమ్మను, రాధను పిల్చుకువచ్చాను వాళ్ళుమాత్రం ఏంచేస్తారు? చూస్తూ నుంచున్నారు. రాధ, వాళ్ళన్నయ్యను కేకేస్తానని పరుగెత్తుకు వెళ్ళింది. అప్పుడేం గమ్మత్తు జరిగిందో తెలుసా?" చక్రాల్లాటి కళ్ళను త్రిప్పుతూ చెబుతున్నది వసంత.

"నే చెబుతానుండవే వసంతా- అప్పుడు నాకూ ఏంచేయాలో తెలీలేదురా నల్లటి నాగుపాము - పడగ కూడా విప్పింది. మనవాడు దాన్ని పట్టుకుని నవ్వుతూ వున్నాడు. వెంటనే దణ్ణంపెట్టు కుని- 'సుబ్రమణ్యస్వామీ నా పిల్లవాడ్ని నువ్వే కాపాడు. నీ పుట్టలో పాలు పోశాకనే వాడు పుట్టాడు. అందులోనూ నాగులచవితినాడు పుట్టాడు కనకనే నాగరాజు అని పేరుకూడా పెట్టాము. నువ్వేవాడిని రక్షించాలి స్వామీ' అని మళ్ళీ నమస్కారం చేశాను. నా ప్రార్థన ఆల కించి, సుబ్రమణ్యస్వామి, మన రాజా చేతిలోనుంచి దిగి, మెల్లగా సన్నజాజి గుబురులోకి వెళ్ళిపోయాడు." యింకా చెబుతున్న జానకమ్మ మాటలకు అడ్డు వచ్చింది వసంత.

"ఆ రోజు సాయంత్రం నాన్న రాగానే అమ్మ నాన్నకి అంతా చెప్పింది. ఆ రోజే నాన్న సుబ్రమణ్యస్వామి ఆల యంలో పెద్ద పూజా అదీ చేయించి చలి మిడి పంచిపెట్టించాడు. పుట్టలో ఆవుపాలు పోసి అర్చన చేయించిందాకా నాన్నకీ, అమ్మకీ తృప్తి తీరలేదు! ఆ గుళ్ళో ఆచారిగారు ఆ నాగరాజే స్వయంగా మన నాగరాజుని ఆశీర్వ దించాడనీ, మన రాజుకి గొప్ప యోగం వుందనీ, ఆ రాజయోగాన్ని యిక ఎవ్వరూ ఆపలేరనీ చెప్పాడు!"

అంతా విని గాఢంగా నిట్టూర్చాడు శ్రీరాం.

"ఎంత గండం తప్పింది!" అన్నాడు రాజాను దగ్గరకు తీసుకుని, గట్టిగా ముద్దుపెట్టుకుంటూ.

"ఇది జరిగి మూడురోజులయిందిరా" అన్నాడు రాఘవయ్య, లంకపొగాకు చుట్ట చుడుతూ.

"మరి ఆ సన్నజాజి పొదలో వెతికారా ? ఆ పాము. బహుశా యింకా అక్కడే వుందేమో. దాన్ని పట్టుకుని, చంపకపోతే మళ్ళీ బయటకు వచ్చి ఎవడ్నో ఒకడ్ని కాటేస్తుంది!" అన్నాడు శ్రీరాం.

జానకమ్మ చెంపలు వాయించుకుంది. "అలాటి అపచారం మాటలు అనకు. సాక్షాత్తూ ఆ సుబ్రమణ్యేశ్వరుడే ఆ పాము. అది మామూలుపామే అయితే మనవాడిని ఆరోజే కరిచేది. నల్లత్రాచుని చంపితే కళ్ళుపోతాయి. దైవాంశగల పాములు అవి ! వాటిమీద భక్తిగా వుండి నమస్కారం చేస్తే అవి మన జోలికిరావు."

ప్రక్కనే వున్న పాలేరు అప్పన్న అన్నాడు "అది నిజమే బాబూ- మా యింటికాడ సత్తిగాడు అలాగే నల్లతాచుని చంపిన వెంటనే ఆడి రెండుకళ్ళూ పోయాయి. మా గూడెంలో వాళ్ళంతా ఆ పాము శవాన్ని ఊరేగించి, మంత్రాలతో దహనం చేశాం బాబూ— అప్పుడుగానీ సత్తిగాడి పాపం పరిష్కారం కాలే !"

"అందే అప్పుడు పాపట పరిష్కారం అయిపోయి వాడికి కళ్ళు వచ్చాయా ?" అడిగాడు శ్రీరాం.

పాలేరు అన్నాడు "పోయినకళ్ళు మళ్ళీ రాలేదు బాబూ - కానీ పాపం పరిష్కారమయిపోయింది."

"అది సరేకానీ మధ్యాహ్నం ఖాళీగా వున్నప్పు డొకసారి యిలారా- ఆ సన్నజాజి పందిరిక్రింద లోతుగా గోతులు వున్నాయి. ఆ పాము అక్కడే వుంటున్న దేమోనని నా అనుమానం. అది తవ్వి చూద్దాం. అలాటి విషకీటకాలను, పిల్లలు తిరిగే యింట్లో వుంచటం చాలా ప్రమాదం !"

"ఆ పామును మాత్రం ఏం చేయకురా నాయనా. అది మామూలు పాము కాదని చెబుతున్నానా ? ఆ పడగా అదీ- తల మీద మణి, దైవాంశవున్న పామని..." యింకా ఏదో చెబుతున్నది జానకమ్మ.

"అమ్మా పాములగురించి నాకు బాగా తెలుసు. మద్రాస్ యూనివర్సిటీలో నేను చేస్తున్న రిసెర్చి పాములగురించే- అడయార్ లోని స్నేక్ పార్క్ డైరెక్టర్ రోములస్ విటేకర్ సహాయం కూడా నాకు వుంది. పాములు దైవాంశ కలవీ కాదూ- యింకేమీ కాదు. పాము పడగ మీద మణులు వుండటం అబద్ధం అన్నది నిరూపింపబడిన నగ్నసత్యం. అంతే కాదు సినిమాల్లో చూపించినట్టు విషం తక్కిన పాములు నమస్కారం పెట్ట గానే విషం మళ్ళీ వెనక్కి లాగేసు




పోవటం అన్నది ఎక్కడా జరగదు- ఇంతవరకూ ఏ పామూ అలా చేయ లేదు. అలాగే నీ సుబ్రమణ్యస్వామి కోసం పుట్టలోపోసిన పాలు మట్టిలో యింకిపోతాయే కానీ, పాము తాగదు. సర్పయాగం చేసినంత మాత్రాన పిల్లలు పుట్టరు. ఇవన్నీ పరమ మూఢ నమ్మకాలు."

"చదవేస్తే వున్నమతి పోయిందట. వీడిని రిసెర్చికి పంపించవద్దంటే విన్నారుకారు మీరు. ఇప్పుడు చూడండి భయం భక్తీ లేకుండా ఎలా మాట్లాడు తున్నాడో." జానకమ్మ రాఘవయ్యతో నిష్ఠూరంగా అన్నది.

"మీరేమయినా అనండి, మీ మూఢ నమ్మకాలడౌ అలాటి విషకీటకాలను యింట్లో వుంచటం మంచిదికాదు. సాయంత్రంలోగా ఆ పందిరిక్రింద తవ్వదలుచుకున్నాను. పాము కనపడిందో చంపటమో, పట్టుకుపోవటమో చేస్తాను- లేదా- పాము లేదని రూఢి చేసుకుని, ఆ గుంటలు పూడ్చివేస్తాను" అంటూ లోపలికి వెళ్ళిపోయాడు శ్రీరాం.

అప్పటిదాకా ఈ కథ చదివిన రమేష్ నిట్టూర్చి తల ఎత్తాడు.

"ఓ.కె. సూర్యం- ఈ కథ యిక్కడిదాకా బాగానే వ్రాశావ్. మరి దీన్నెలా ముగిద్దామనుకుంటున్నావ్ !"

కిటికీదగ్గర రెండు జేబుల్లోను చేతులు పెట్టుకుని నుంచున్న సూర్యం వెనక్కి తిరిగాడు.

రమేష్ నువ్వుకూడా రచయితవే- నువ్వు చెప్పు ఈ కథను ఎలా ముగించ వచ్చో !"

రమేష్- ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు- "సూర్యం యిలాటి కథలను ఏ రచయిత అయినా యిక్కడిదాకా సులభంగా వ్రాసుకుపోతాడు. కానీ

యిలాటి కథలకు రచయిత యిచ్చే ముగింపు సమాజంమీద అంతో యింతో ప్రభావాన్ని కలుగచేస్తుంది. ఎంత వినోదంగా వ్రాసినా, ఉబుసుపోకకు వ్రాసినా, విజ్ఞానంకోసం వ్రాసినా, రతయిత సమాజానికి న్యాయంకానీ, అన్యాయంకానీ కథం ముగింపుల్లోనే చేస్తాడు. ఈ కథనే తీసుకుందాం. రచయిత మూఢనమ్మకాల పుట్ట అనుకుందాం, అలాటివాడు ఈ కథను ఎలా ముగింపు చేస్తాడు? ఈ కథను మూడు రకాలుగా ఆ మూఢ రచయిత ముగించటానికి అవకాశంవుంది-ఒకటి- శ్రీరాంకి పాము దొరకలేదు. 'అలాటి పాపానికి ఒడికట్టిన శ్రీరాంకి, దైవాంశగల పాము ఎలా కనపడుతుంది' అన్నది జానకమ్మ. తర్వాత రాజు పెద్దవాడై ఐ.ఎ.ఎస్. పరీక్ష పాసయ్యాడు. కలెక్టరయాడు. 'మంచియోగం వుంది రాజుకి' అన్న మాట నిరూపించాడు. ఇది ఒక ముగింపు. లేదా— శ్రీరాంకి పాము దొరికింది, కర్రతోబాది చంపేశాడు. శ్రీరాంకి కళ్ళుపోయాయి. పాలివాడు చెప్పినప్పుడు ఎగతాళిచేసిన శ్రీరాం తర్వాత పశ్చాత్తాప పడ్డాడు. సుబ్రమణ్యస్వామికి దణ్ణం పెట్టుకుని భోరుమని ఏడ్చాడు. ఇది యింకో ముగింపు.

—యిక మూడో ముగింపు.అక్కడ తవ్వేటప్పుడే పాము బుసలుకొడుతూ పైకిలేచి శ్రీరాంనే కాటువేసింది. అలా అతని పాపానికి ప్రాయశ్చిత్తం అయింది."

"అవును రమేష్ రచయిత యిలా వ్రాస్తే సమాజం ముందుకు పోకపోగా, రోజురోజుకీ వెనకపడటమే కాకుండా, యింకా వెనక్కి వెడుతూవుంటుంది! కాని అసలు జరిగినకథ ఏమిటో తెలుసా నీకు."

"ఏమిటి ఈ కథ నిజంగా జరిగిందా?" అడిగాడు రమేష్.

సూర్యం ఒక్కక్షణం ఆగి చెప్పటం ప్రారంభించాడు "అవును రమేష్! ఈ కథ నిజంగా జరిగిందే- కథలాగానే చెబుతాను విను- ఆ రోజు మధ్యాహ్నం భోజనం చేసిన తర్వాత- పందిరి దగ్గర తవ్వేదామని శ్రీరాం నిశ్చయించుకున్నాడు. స్నానంచేసి ముందుగదిలో తల దువ్వుకుంటున్న శ్రీరాంకి పెరట్లో నుంచి పెద్ద గావుకేక వినపడింది. చకచకా పెరట్లోకి వచ్చిన శ్రీరాం ఆ దృశ్యం చూసి, నిర్ఘాంతపోయాడు నోట మాటరాలేదు. సన్నజాజి పందిరి దగ్గర ఆడుకుంటున్న మూడేళ్ళ ముద్దులరాజు క్రిందపడి వున్నాడు. నోట్లోనుంచి నురుగులు వస్తున్నాయి. గిలగిలా కొట్టుకుంటున్నాడు — కొంచెం దూరంగా సరసర పాకుతూ వెడుతున్న పొడుగాటి నల్ల త్రాచుపాము కూడా కనపడింది. అన్నిటికన్నా శ్రీరాం దృష్టి నాకర్షిం




చింది- ఆ పాముకి భక్తితో నమస్కారం చేస్తూ స్థాణువులా నుంచున్న జానికమ్మ!

ఆమె ప్రక్కనే చేతిలో కర్రవున్నా, పాముమీద దెబ్బవేయటానికి భయపడి నుంచున్న పాలేరు అప్పన్న- తర్వాత వాళ్ళు చెప్పినదాన్నిబట్టి తెలిసిందేమి టంటే- రాజా అక్కడ ఆడుకుంటు న్నప్పుడు, వాడిదగ్గరకు పాము రావటం వాళ్ళు చూస్తూనేవున్నారు. రాజాని దూరంగా తీసుకుపోలేదు సరికదా, కనీసం పాముమీద ఒక దెబ్బకూడా వేయలేదు వాళ్ళు. పైగా నాగరాజస్వామీ, సుబ్రమణ్యస్వామీ అంటూ నమస్కా రాలు పెడుతూ నుంచున్నారు ఆ మూఢులు అమాయకుడైన పసిపిల్లవాడి ప్రాణాలుతీసిన హంతకులు - వాళ్లు మనుషులుకాదు- రాక్షసులు- సూపర్టిషన్ బార్బేరియన్స్-" సూర్యం కళ్లల్లో నీళ్ళు తిరిగాయి

"సూర్యం ఎందుకలా ఆవేశపడ తావ్- కామ్‌గావుండు- చెప్పు- అసలిది ఎక్కడ జరిగింది ?" రమేష్ సూర్యం భుజంమీద చేయివేస్తూ అడిగాడు.

"ఎక్కడోకాదు- మా యింట్లోనే జరిగింది. ఆ కథలో శ్రీరాం ఎవరో కాదు రమేష్, నేనే- నేనే- ఆ కథలో రాజా ఎవరో తెలుసా ? నా ముద్దుల అందాల రాజా- నేను అమితంగా ప్రేమించిన నా తమ్ముడు. మూడేళ్ళ అమాయకపు పసివాడు- వాళ్ళ మూఢ నమ్మకాలకి అన్యాయంగా ఆహుతి అయి పోయాడు రాజా— అదే రమేష్ వాడికి పట్టిన యోగం. రాజయోగం-" చేతుల్లో ముఖం దాచుకున్నాడు సూర్యం——

———

# నెగెటివ్ థాట్

పంతుల జోగారావు



మెత్తగా వున్న బస్సు సీట్లో వెనక్కి చేరబడి ఆలోచనల్లో పడిపోయాడు వెంకట్రావు.

బస్సు ఇండియన్ హైవేస్ మీద జోరుగా దూసుకుపోతోంది. 'ఈ బస్సు యింత స్పీడుగా పోతోందేవిటి ! కొంప తీసి బోల్తా కొట్టదు కదా?' అనుకున్నాడు వెంకట్రావు. పక్కకి చూసేడు. ప్రక్కనున్నాయన నిబ్బరంగా కూచుని పేపరు చదువుకుంటున్నాడు. 'ఇదిగో చూడండి ' పిలిచేడు వెంకట్రావు. అతను పలకలేదు. ఓ నిముషం ఆగి, మళ్ళీ పిలిచేడు. అతను పేపరు పేజీ తిప్పుతూ 'ఏం!' అన్నట్టుగా చూసేడు. 'బస్సు మరీ యింత స్పీడ్‌గా పోతోంది-బోల్తా కొడుతుందేమోనండీ' అన్నాడు వెంకట్రావు దిగులు దిగులుగా-అతను వెంకట్రావువేపు అదోలా చూసాడు. తన ప్రశ్నకి జవాబివ్వకుండా తనకేసి ఆయన తేరిపార చూడటంతో వెంకట్రావు మళ్ళీ అదే ప్రశ్న వేసాడు.

ఆయన విసుగ్గా చూసి 'నెవర్-ఎందుకలా అనుకుంటున్నారు?' అనడిగేడు.

వెంకట్రావు నిర్లిప్తంగా నిట్టూర్చాడు. తనన్నదాన్ని ఆయన ఎంత తేలిగ్గా తీసుకున్నాడు ! కనీసం తనలా ఎందుకన్నాడనయినా ఆలోచించవద్దూ ? ఛ ! ఛ ! తనేం చెప్పినా ఎవరికీ అర్థమైచావదు...తనన్నది అక్షరాలా జరిగితే కాని వీళ్ళకి బుద్ధిరాదు...

'నో సార్..., డే కిట్ సీరియస్...

ఇంత స్పీడ్‌లో బ్రేక్ ఫెయిలయితే ఇంకే మయినా వుందా ? అసలే ఎయిర్ బ్రేక్‌లు - అలా చూడండి - రోడ్ మీద ఎన్ని కార్లు...బస్సులు....లారీలు ... ఎంత ఎంత హడావిడిగా పోతున్నాయో ! ప్రమాదాలు చెప్పిరావు కదా, ఆలోచిం చండి' అన్నాడు అతని గొంతు సన్నగా వణుకుతోంది

'ఆర్యూ మేడ్ ?' అన్నాడాయన ఎగాదిగా చూసి

పదునైన కత్తి కసుక్కున గుండెల్లో దిగబడినట్లయింది వెంకట్రావుకి. ఎంత మాటనేసాడు తనని ? ఇడియట్-తన నలా అనడానికి వీడికి గట్స్ ఎలా వచ్చేయి ?

వెంకట్రావు ముఖం ఎర్రబడింది. రక్తం తిరగబడింది. 'వీణ్ని చంపెయ్యాలి' అనుకున్నాడు కసిగా. కోపంతోపాటు అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఉక్రోషంతో నోటివెంట మరి మాట పెగల్లేదు.

పెదవి కొరుక్కుంటూ బస్‌లోకి చూసాడు. అతని దృష్టి తన ముందు మూడో సీటుమీద పడింది. ఎవరో అమ్మాయి, ఎక్కడ ఎక్కిందో తను గుర్తించనేలేదు- అక్కడ కూర్చునివుంది. ఆమె ముఖం కనిపించటంలేదు. మెత్తటి నైలెక్స్ చీరమీద నీలం జాకెట్టు-జాకెట్ మీద విశాలమయిన మెడకనిపిస్తున్నాయి. వదులుగా వేసుకున్న వుంగరాల జుత్తు, చెదిరిన నల్లమబ్బులాగా మనోహరంగా వుంది చెవులకి పెద్ద రింగులు. జడలో ఎర్ర గులాబి

'ఆమె ఓసారి వెనక్కి తిరిగి చూస్తే బాగుణ్ణు !' అనిపించింది వెంకట్రావుకి. పొడివగ్గ దగ్గేకు ఆమె చూడలేదు.

ఆ అమ్మాయి అందంగా వుంటుందా? ఏమో ! అందమయిన చీర, జాకెట్ ధరించి,ఫాషనబుల్‌గా తయారయినంత మాత్రాన అందంగా వుంటుందనే ఎందు కనుకోవాలి ? వెంకట్రావుకి ఆమె అందంగా వుండదని బలంగా తోచింది. పై పెచ్చు అనాకారి అని కూడా అనిపిం చింది. ఆమె ముఖం మచ్చలతో ఎత్తు పళ్ళతోవున్నా ఆశ్చర్యం లేదనిపించింది. ఆమెని అనాకారిగా ఊహించుకోవటం లోనే అతనికి తృప్తి వుంది ఆమె ముఖం చూడాలని తహతహలాడసాగేడు. ఆమె వెనక్కి చూస్తేనా !

వెంకట్రావుకి విసుగ్గా అనిపించి కిటికీలోనుంచి బయటికి చూసాడు. బస్ ఏదో పూర్లోనుంచి పరుగెడుతోంది. ఏదో స్కూలు వదిలినట్లున్నారు పిల్లలంతా బిలబిల మంటూ వచ్చేస్తున్నారు. 'అరే! అలా వచ్చేస్తున్నారేమిటి ? బస్ కింద పడరు కదా – డ్రయివర్ ! కాస్త నింపాదిగా నడుపు...చిన్న చిన్న బాటసారులుంటారు జాగ్రత్త' పూల్... స్పీడ్ లిమిట్ పాటించాలని తెలీదూ ?– ఆ పిల్లల్ని మర్దించేస్తావేమిటి ? అబ్బ !

బస్సు కింద, రైళ్ళ కింద పడిన మనుష లెంత దారుణంగా ఛస్తారు?... రక్త సిక్తమయిపోయిన మొండెం... వేలా డేసిన తల...తెగిన కాళ్ళు...నగ్గు నుగ్గు అయిపోయిన వొళ్లు.. గుర్తుపట్ట లేనంతగా చితికిపోయిన ముఖం... వెంకట్రావు ఆలోచనలు అతనిలోనే మిగిలిపోయాయి.

బయటికి చెప్తే అంతా తననే దుమ్మెత్తిపోస్తారు...వెధవలు...నా మాట ఒక్కరికీ తలకెక్కి చావదు... 'నోట్లో శని పెట్టుకుని మాట్లాడతావేంరా నువ్వు' అని అంతా తనని తిట్టేవాళ్లే... అదేం ఖర్మో కాని ఎందులోనయినా తనకి ముందు కీడే స్ఫురిస్తుంది...

బస్సు స్లో అవుతోంది. వెంకట్రావు ముందు సీటువేపు చూసాడు.సున్నితమైన వేళ్ళతో జుత్తుసవరించుకుంటోందామె - ఒక్కసారి వెనక్కి తిరిగి చూడకూడదూ?ఆ అందవికారమైనముఖం చూడాలనిపిస్తోంది పదే పదే...బస్సు ఆగింది. జనాన్ని ఎక్కించుకుని మళ్ళీ బయలుదేరింది. వెంకట్రావు తన ఆలోచనల్ని కంటిన్యూ చేసాడు.

చిన్నత్త కూతురు అరుణ పెళ్లప్పు డేమయింది? పెళ్ళి రేపనగా జల్లులు జల్లులుగా వర్షం మొదలయింది.'ఈ గాలి పెనుగాలిగా మారి తుఫానయిపోతే పెళ్ళి జరిగేదెలా' అని తన గుండె గుబగుబ లాడింది. కుమార్‌ని పిలిచి వాడితో అదే అన్నాడు. వాడు తనమీదకు ఇంతెత్తుకి ఎగిరాడు. 'బుద్ధి లేదురా బావా నీకు— శుభమా అని పెళ్ళి జరగబోతూ వుండే. నీ కిలాంటి వెధవాలోచనలు వస్తాయేం ఖర్మ...ఏ తుఫానూ రాదు...పెళ్ళివాళ్ల తరలి వచ్చేసరికి చూడు ఎండ ఎలా మండిపోతుందో' — అని కసిరికొట్టేడు. తను చిన్నబుచ్చుకున్నాడు. కాని ఏం జరిగిందప్పుడు?

చిలికి చిలికి గాలివానగా మారింది. అది గొప్ప తుఫానుగా మారింది. వూరూ వాడా ఏకంచేసేసినట్లుగా వర్షం... అంతా బీభత్సంగా తయారయింది. ఆంధ్రదేశంలో అంత పెద్ద తుఫాను పుట్టి బుద్ధెరిగిన దగ్గరనుంచీ లేదన్నా రంటా. ఎన్ని గ్రామాలో వరదల్లోమునిగి పోయాయి.జరిగిన జననష్టం, పశు నష్టం గురించి రేడియోలో చెబుతున్నపుడు జనం భయంతో వణికిపోయారు. తను భయపడినంతా జరిగింది... పెళ్ళి పందిరి ఫెళ ఫెళ మంటూ కూలిపోయింది. బంధువులంతా గొల్లుమన్నారు...పెళ్ళి వాళ్ళు రావాల్సిన రైలు రాలేదు. తుఫానులో ఎక్కడో చిక్కుకుపోయింది. లగ్నం వేళకి ఎంత ప్రయత్నించినా వాళ్ళు రాలేకపోయారు...పెళ్ళి చెడిపోయింది.

అందరూ తనని దుమ్మెత్తిపోసారు ...కుమార్ తనమీద విరుచుకుపడి పోయాడు. ఎన్ని దుర్భాషలు ఆడేదని!

ఎవరికీ తనమీద సానుభూతి లేకపోయింది. అన్నీ తను వూహించినట్లే అవుతాయని కాదు...కాని తన మనసు ఎప్పుడూ కీడే ఎంచుతుంది...అదేం దౌర్బల్యమో తెలీదు...అమ్మ మాత్రం ఆ రోజు రాత్రి ఎవరూ లేకుండా చూసి, 'ఎందుకురా వెంకూ--అనవసరంగా యిలా నిందలు పడతావు' అని కళ్ల నీళ్లు కుక్కుకుంటూ తల మొత్తుకుంది... అమ్మకి ఏం జవాబివ్వగలడు తను ?

ప్రపంచంలో గాలీ వెలుతురూ వున్నాయి...పారే నీరూ ఎగిరే పిట్టలూ వున్నాయి-అందం వుంది-ఆనందం వుంది-సుఖం వుంది...సంతోషం వుంది అనురాగం వుంది-ఆత్మీయతలూ వున్నాయి...కానీ తను చూడగలిగే దెప్పుడూ రెండోవేపు నుంచే...చీకటంటే భయం తనకి కన్నీళ్లంటే వెరపు. వేదనలంటే జుగుప్స-ఒంటరితనం అన్నా గగుర్పాటే-కాని...కాని...తన ఆలోచన లెప్పుడూ చీకటి గురించే. కన్నీళ్ళ గురించే-అవమానాల గురించే. ఎవరితోనూ ఫ్రీగా మూవ్ కాలేడు. ఒంటరితనం బిక్కు బిక్కు మంటూ దిగులుతో ముంచెత్తుతూ వుంటుంది. ఈ మనో జాడ్యాన్ని తనెలా వదిలించుకో గలడు ?

అశాంతిగా నిట్టూర్చి కదిలాడు వెంకట్రావు. బస్సు ప్రయాణం కడుపులో తిప్పేస్తోంది. తల దిమ్ముగా వుంది. ఆమెని చూడాలని మళ్ళీ ప్రయత్నించాడు వెంకట్రావు...ఎవరో అడ్డం వచ్చేరు. ఆమె కొంచెం పక్కకి వంగి ఎవరితోనో మాట్లాడుతూ వుంటే-కనిపించబోయే వేళకి అడ్డగాడిదలా అడొచ్చాడతను-రాస్కెల్..వెంకట్రావు కెందుచేతో అందరిమీదా కసిగా వుంది. జేబులు తడిమి చూసుకున్నాడు. అగ్గిపెట్టె వుంది. కానీ సిగరెట్లు లేవు-తన బ్రతుకంతే...ఒకటుంటే వొకటుండదు-తన బతుకులో చీకటి తప్ప వెలుతురు లేదు-ఖేదం తప్ప మోదం వుండదు ఆరాటం కలిగించే అసందర్భపు ఆలోచనలు తప్ప తియ్యటి అనుభూతుల జ్ఞాపకాలు లేవు-వుండవ్. వెంకట్రావు కింది పెదవి కొరుక్కుని వదిలేడు.

నాన్న గర్తొచ్చేడతనికి...నాన్న బతికివుంటే ఎంత ధైర్యంగా వుండేది, తన బతుక్కి--ఆ రోజు నాన్నకి గుండె నొప్పి వచ్చినరోజు తన ఆలోచన లిలాగే పెడదారి పట్టేయి...అలా ఆ నొప్పి ఎన్నిసార్లు రాలేదు ? మాత్రలు, ఇంజక్షన్లూ పడ్డాక సర్దుకునేది-మళ్ళీ లేచి కులాసాగా తిరిగేవారు-కాని, ఆ రోజు-ఆ రోజు మాత్రం నాన్న మరి దక్కరేమో ననిపించింది. ఆ నొప్పి అతన్ని తమనుంచి నిర్దాక్షిణ్యంగా లాక్కుపోతుందేమో ననిపించింది...ఆ ఆలోచన రాగానే భయంతో కంపించిపోయేడు తను. ఆ రాత్రి తలగడలో తల దూర్చి

కుమిలి కుమిలి రహస్యంగా ఏడ్చాడు తను-తెల్లవారుతూ వుండగా ఇల్లంతా ఏడుపులతో దద్దరిల్లిపోయింది. 'నాన్నా' అంటూ గుండెలు పగిలేలా విలపించాడు తను...ఏ పైశాచిక శక్తి తనకి అమంగళాన్ని ముందుగానే తెలియజేసింది? తనమీద్ర తనకే అసహ్యం వేసింది. రోత కలిగింది. తన కలాంటి దుర్భరమయిన ఆలోచన రాకపోయినా నాన్న బతికివుండేవారేమో! ప్చ్...తన వెర్రి కాని, కాకతాళీయంగానే యిలా జరిగిందని ఎందుకనుకోకూడదు? ఏమైనా తనకి చెడ్డ ఊహలు మాత్రం రావటం ఒక శాపంగా పరిణమించింది... నాన్న పోయాక వెంటనే యీ విషయం ఎవరితోనూ అనలేదు. కాని-పెద్దకర్మ జరిగిన రోజున ఆలోచనల రంపపు కోతవుతున్న మనసుని—ఆ రాటాన్ని అదుపులో వుంచుకోలేక-'నాన్న పోతారని నా కెందుకో ఆవేళే అనిపించిందమ్మా-'అన్నాడు తను, జీరపోయిన గొంతుతో-

ఇన్ని రోజులుగా ఏడ్చి ఏడ్చి-అలసిపోయి-పీక్కుపోయిన అమ్మ కళ్లలో ఏడుపంతా యింకిపోయిందనుకున్నాడు తను! కాని...కాని...తన మాటలు వింటూనే అమ్మ వణవణా కంపించిపోతూ పెద్దగా ఏడ్చింది. ఆమెని ఆపగలిగే శక్తి ఎవరికీ లేకపోయింది... విరుచుకు పడిపోయి, తల ద్వారానికేసి బాదుకుంటూ ఏడ్చింది.

ఆ కన్నీటి సముద్రంలో తనారోజు ఎందుకని కొట్టుకుపోలేదు? ఊపిరాడక ఎందుకని చచ్చిపోలేదు! భగవాన్... తానింకా బతికే వున్నాడు-ఎందర్ని ఏడిపించడానికో-ఎన్ని అశుభాలు, అవాచ్యాలు మాట్లాడటానికో! అమ్మ ఏడుపు చూసి కూడా...ద్వారానికేసి కొట్టుకోగా చిట్లిన ఆ నుదుటి రక్తం చూసి కూడా-కీ దరిద్రగొట్టు ప్రాణం మిగిలేవుంది.

బస్సు కుదుపుకి వెంకట్రావు మళ్ళీ స్పృహలోని కొచ్చినవాడిలా తుళ్ళి పడ్డాడు. సర్దుకుని కూచున్నాడు. బాధగా కణతలు నొక్కుకున్నాడు.

ఈసారి అనాసక్తంగా చూసేడు—వుంగరాల జుత్తు అమ్మాయి మొహం కనిపిస్తుందేమోనని-ఆమె వెనక్కి తిరిగితే కదూ! రాయిలా కదలకుండా కూచుని వుంది...ఎంత టెక్కు!

లక్ష్మి...లక్ష్మి కూడా ఇంత టెక్కుగానే వుండేది నల్లగా వున్నా చలాకీగా నవ్వుతూ యిల్లంతా కలియతిరిగేది-దానికి ఎవరన్నా భయం వుండేదికాదు-దేన్నీ ఖాతరుచేసేదికాదు - ఎంత ఫాషనబుల్‌గా తయారయినా దాని ముఖంలోకి లేని అందం ఎలా వొచ్చి పడుతుంది? 'బావా' అంటూ తనతో ఇష్టమయితే కబుర్లు చెప్పేది. ఇష్టం లేనప్పుడు పలకరించినా పలికేదికాదు—దాని కెంత గర్వమని! తనకి నచ్చిన




విధంగా బట్టలు కట్టుకునేది-నుదుటి మీద పడేటట్లు జుత్తుని పుంగరాలు తిప్పుకునేది-అలాంటి కృత్రిమ అలంకరణలంటే తనకి తలనొప్పి. నల్లని ముఖానికి దట్టంగా పౌడరు రాసుకునేది. పెదాలకి అప్పుడప్పుడు రంగు కూడా పూసుకునేది...

దానికి తనలో ఏం చూసుకుని అంత మిడిసిపాటు? దాని పూసు పట్టనట్టుగానే వుండేవాడు తను. కాని-కాని-ఆ రోజు మధ్యాహ్నం-ఇంట్లో ఎవరూ లేనప్పుడు లక్ష్మిని చూసి తనలో ఏదో సంచలనం చెలరేగింది. ఆ సమయంలో దాని అనాకారితనమంతా రెక్కలు కట్టుకుని ఎక్కడికో ఎగిరిపోయినట్లయింది...

'లక్ష్మి' అని పిలిచేడు. వచ్చింది. ఆ ముఖంలో ఎప్పుడూ చూడని కొత్త అందం-ఆ కళ్లలో ఎన్నడూ లేని మిలమిలలు-తనలోని, కోరిక లక్ష్మిలో లేని అందాన్ని రప్పించాయేమో!

దగ్గరకి రానిచ్చి, చప్పున చెయ్యి పుచ్చుకుని వొళ్లోకి లాక్కున్నాడు. వాటేసుకుని ముద్దులతో ముంచెత్తాడు.

లక్ష్మి బిత్తరపోయింది.

వెంటనే తేరుకుని ఒక్క వుదుటున తనని వెనక్కి తోసేసింది. భద్రకాళిలా కోపంతో రెచ్చిపోయి 'ఛండాలుడా! నీకిదేం పాడుబుద్ధి' అని అరిచింది

తనకి అవమానంతో గుండె మండిపోయింది. దాని అందానికి తను తగడు కాబోలు? తిట్టి తిట్టి వెళ్ళిపోయింది లక్ష్మి. నాలుగురోజులుందామని వొచ్చిన లక్ష్మి, అమ్మ ఎంత చెప్తున్నా వినకుండా

వెంటనే ప్రయాణం కట్టేసింది. బాధతో కుమిలిపోయేడు తను.

చివరికి అందవికారి అయిన లక్ష్మికి కూడా తనలో ఆకర్షణ లేదా? తనీ లోకంలో ఎందుకూ పనికిరానివాడా? గతం గుర్తొచ్చి, వెంకట్రావు ముఖం జేవురించింది. బిగించిన పిడికిలి చెమటతో ముద్దగా తడిసిపోయింది నిస్పృహతో నిట్టూర్చి కళ్లు మూసుకున్నాడు.

* * *

బసు ఆగింది వెంకట్రావు కళ్లు విప్పి చూసాడు. తను దిగాల్సిన వూరు వచ్చింది. వొళ్ళు విరుచుకుని చుట్టూ చూసేడు. ముందు కూర్చున్న ఆ వుంగరాల జుత్తు అమ్మాయి లేచి నించుంది. సూట్ కేస్ తీసుకుంటూ వెనక్కి తిరిగి చూసింది.

షాక్ తిన్నట్లు ఫీలయాడు వెంకట్రావు.

ఆమె-తను ఊహించుకున్నట్లుగా అనాకారి కాదు! ఆమె అందం భువన మోహనంగా వుంది...విశాలమైన ఆమె కళ్ళు తళతళ మంటూ మెరుస్తున్నాయి. తెల్లని పలువరుస తళుకు లీనుతోంది... నునుపైన చెక్కిళ్ళతో ఆమె ముఖం అందంగా కళకళ లాడుతోంది. కిటకీలో నుంచి సూట్ కేస్ ఎవరికో అందించి నవ్వుతూ పలకరిస్తోంది. సూట్ కేస్ అందిందాక సుతారంగా బస్సు దిగింది. వెంకట్రావు ముఖం లిప్తకాలం పాలిపోయింది. ఆమె అందంగా వున్నా తనకొచ్చిన యిబ్బందేమీ లేదు.కాని తన అంచనా తలకిందులు కావటంతో తను దారుణంగా ఆలోచించేడన్న సంగతి గుర్తొచ్చి సిగ్గుతో కుంచించుకు పోయాడు!

'నేను సినిక్‌నా!' అనిపించిం దతనికి.'అవును-సినిక్‌నే'అనుకున్నాడు నిశ్చయంగా. అతనికి తన మీదా, తన ఆలోచనలమీదా, జీవితంమీదా వెగటు పుట్టింది.

కిటికీలోనుంచి చూసేడు. తన కోసం బస్‌కి ఎవరూ రాలేదు-ఎవరూ-కనీసం వొక్కరు కూడా!

పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని పెదవుల మధ్య బంధించాడతను.

చేతి కర్రలు రెండూ అందుకుని, చంకల క్రింద పెట్టుకుని, కండక్టరు సాయంతో-టకటక మని కర్రలు శబ్దం చేస్తూ వుండే నిర్లిప్తంగా బస్సు దిగేడు వెంకట్రావు.



# అమ్మకాని అమ్మ

ఎలక్ట్రాన్



"సీతాపతి రత్నావతిని ఉంచుకున్నాడు, తెలుసా ?!" బస్‌స్టాండ్ వదలి, యిల్లు చేరేలోపున కనీసం పదిమందైనా పనికట్టుకొని నన్నాపి, ఈ విషయం అడిగినట్లే అడిగి తెలియజేశారు. వాళ్ళంత ఉబలాటంగా తహతహలాడుతూ నాకు చెప్పటానికి కారణం సీతాపతీ, నేనూ చిన్నతనంనుంచీ స్నేహితులవటమే. సామాన్లు ముందుగా మోసుకుపోయిన వెంకటస్వామి ద్వారా నా రాక సంగతి తెలిసిన శ్రీమతి, నేను యింట్లో అడుగుపెట్టేసరికి, ముందు వరండాలో కాలు కాలిన పిల్లిలా పచార్లు చేస్తోంది. నన్ను చూస్తోనే కళ్ళింతగా చేసుకొని, "ఏమండీ, ఈ మాట విన్నారూ...?" అని మొదలుపెట్టింది.

"విన్నాను కానీ, ముందు స్నానానికి ఏర్పాట్లు చెయ్యి!" అన్నాను, మా ఆవిడ పురాణాన్ని మరి ముందుకు సాగదీయకుండా. ఉత్సాహమంతా బుడగలా

పేలిపోయి, బేలగా నిల్చున్న శ్రీమతిని చూసి నాకు జాలివేసింది.

భోజనం చేస్తున్నప్పుడు, ప్లేటు ఫిరాయించి నా చేత విపరీతంగా బతిమాలించుకొని, శ్రీమతి చెప్పిన వివరాలేమీ ఎక్కువ లేవు. వారం రోజుల క్రితమే సీతాపతి ఈ పని చేశాడట. నాకు వెంటనే ఉత్తరం రాయాలనుకొందిట గాని నేను త్వరలోనే వచ్చేస్తాను కదా అని, ఆ ప్రయత్నం విరమించుకొందట. రెండు రోజుల క్రితం, సీతాపతి మా యింటికి వచ్చి, నేనెప్పుడొచ్చేదీ కనుక్కొని వెళ్ళాడట.

భోజనం ముగించి, పడక కుర్చీలో నడుం వాల్చి, మగతగా కళ్ళు మూశాను. ఏవో ఆలోచనలు, గతించిన స్మృతులూ, మనసును ముసురుకోసాగాయి.

ముండల్ని ఉంచుకోవడం మా ఊళ్ళో కొత్తేమీ కాదు. ఇంట్లో రంభల్లాంటి పెళ్ళాలున్నా, ఎవర్నో తమ ప్రాపకంలో ఉంచుకోకపోతే తమకి నామర్దా అనుకొనేవాళ్ళూ—'మా తాత ముత్తాతల దగ్గర్నించీ మా వంశంలో ముండ నుంచుకోని వాడు లేడు తెలుసా!' అని గర్వంగా చెప్పుకొనే వాళ్ళూ—మా ఊళ్ళో చాలా మంది ఉన్నారు. ఆస్తులమ్ముకొని సన్యాసులైన వాళ్ళూ, రోగాలతో వళ్ళు కుళ్ళిపోయి ఆత్మహత్యలు చేసుకొన్న వాళ్ళూ, ఈ వ్యవహారాల్లో తగాదాల్లు వచ్చి హత్యలు చేసిన వాళ్ళూ-మా ఊరి చరిత్రలో చాలామంది ఉన్నారు

అయితే పెళ్ళాం చచ్చిపోయిన పాతిక సంవత్సరాలకీ, కూతురు కాపరానికి వెళ్ళిన రెండేళ్ళ తర్వాత—సీతాపతి యిటువంటి పని చేశాడంటే, అది నాకాశ్చర్యకరమైన విషయంగానే తోచింది!

వీధిబడిలో ఒకటోతరగతి నుంచి, కాలేజీలో బి. ఏ. వరకూ సీతాపతీ, నేనూ కలిసి చదువుకున్నాం. క్లాసులు ఎగ్గొట్టి సినిమాలు చూసినా, రహస్యంగా మా తోటలో సిగరెట్లు కాల్చినా, ఏలేరులో ఈతలు కొట్టినా, ఇద్దరమూ కలిసే చేసేవాళ్ళం. అయితే సీతాపతిలో చొరవ కాస్త ఎక్కువేనని చెప్పుకోవాలి. అతనికున్నంత తెగింపు నాలో ఉండేది కాదు.

పెద్దలు సంపాదించిన భూములు అంతో యింతో ఉండడంవల్ల, మేం యిద్దరంకూడా, మరి పై చదువులకి వెళ్ళకుండా, వ్యవసాయంలో దిగిపోయాం. సీతాపతి జీవితంలోకి కొన్ని సమస్యలు తొంగిచూశాయి. ఆ సమస్యల మీద బుట్ట బోర్లిస్తే, సీతాపతి జీవితం చాలా హాయిగానే గడిచిపోయి ఉండేది. అయితే సీతాపతి ఆ సమస్యల్ని మరింత కఠినతరం చేసుకొని, పరిష్కారం కావించాడు. మా బి. ఏ. పరీక్షా ఫలితాలు వచ్చిన రోజుల్లోనే, సీతాపతి చెల్లెలు రాధ పెళ్ళయింది. పెళ్ళయిన పది

రోజులకే రాధ భర్త గుండె ఆగి చనిపోవడం, వాళ్ళ కుటుంబానికి పెద్ద గొడ్డలిపెట్టే అయింది. ఓ నెల రోజుల పాటు సీతాపతి పిచ్చివాడై పోయాడు.

ఓ రోజు సాయంత్రం నేను పొలంలో ఉండగా, సీతాపతి హుషారుగా నా దగ్గర కొచ్చాడు. సీతాపతి కళ్ళు,కొత్త కాంతిని పుంజుకొన్నాయి. నా పక్కనే ఎండుగడ్డిమీద కూలబడి, సిగరెట్ ముట్టించి అన్నాడు. "ఒరేయ్, ఇవ్వాళ ఇంట్లో చాలా పెద్దగొడవే జరిగిందనుకో. అయినా అంతిమ విజయం నాదే!" సీతాపతి ఏ విషయం గురించి రాద్ధాంతం చేశాడో, ఊహించుకోగల్గాను. అయితే సీతాపతి నోటమ్మటే విందామని, మౌనంగా ఉండిపోయి, చెప్పమన్నట్లుగా చూశాను. ఆదినుంచీ సమాజంలో దానికి జరుగుతున్న అన్యాయాల్ని గురించి అరగంటసేపు ఉపన్యాసం దంచి, చివరకు, రాధకి మళ్ళీ పెళ్ళి చెయ్యడానికి తను కంకణం కట్టుకొన్నట్లు చెప్పాడు. సీతాపతిని పరీక్షగా చూస్తూ అడిగాను "సరే నీ తల్లి దండ్రుల్ని ఒప్పించకలిగావు కాని లోకానికి సమర్థించి చెప్పగల ధైర్యం ఉందా నీకు?"

"ఇంట గెలిచాను కదా, బయట గెలవడానికి నీలాంటి స్నేహితుల అండదండలు కావాలి నువ్వుంటున్న లోకంలో ముందరగా మనం కలుసుకోవలసింది, రాధ అత్త మామల్ని. రేపు నేను కాకినాడ వెడ్తున్నాను. నువ్వు కూడా నాతో రావాలి!"

నేను కొంచెం యిబ్బందిగా చూస్తూ అన్నాను. నేను మీ అంతరంగిక విషయాల్లో కలగజేసుకొంటే అంత బావుండదనుకొంటాను."

సీతాపతి గట్టిగా నవ్వసాగాడు. నేను తెల్లబోతూ చూశాను. "ఒరేయ్, అందరూ నీలాగే ఉంటే, నువ్వనే ఈ లోకం ఉండేదికాదు. రాధకి రెండో పెళ్ళి మా అంతరంగిక విషయమైతే, లోకం మమ్మల్ని వేలెత్తి ఎందుకు చూపాలి? ఒకరి విషయాల్లో జోక్యం కలగజేసుకోవడానికి సమాజానికి హక్కు ఉన్నపుడు వాళ్ళు కష్టాల్లో ఉన్నప్పుడు సహాయం చేసే యిది కూడా సమాజానికుండాలి. లేనినాడు ఆ సమాజం కుళ్ళిపోయిందనే చెప్పుకోవాలి. కబుర్లు కట్టిపెట్టి, రేపు నాతో రావడానికి సిద్ధంగా ఉండు!" సీతాపతి మాటలకు జవాబులేదు నేనన్న మాటలతోటే, నా నోరు మూయించాడు.

"ఆ పద్ధతిలో, నేనొక్కణ్ణే మీ రాధ అత్తారింటికి వెళ్ళి, మీ ఉద్దేశ్యాన్ని వాళ్ళ చెవిని వేస్తే బావుంటుందేమో? తర్వాత మీరు వివరంగా మాట్లాడుకోవచ్చు." నా అంగీకారాన్ని పరోక్షం తెలియజేశాను.

సీతాపతి ఒక్క క్షణం మౌనంగా ఉండితర్వాత అన్నాడు. "నువ్వు చాలా మెతక మనిషివి వాళ్ళేమైనా మాటలంటే

అనవసరంగా మధ్య నువ్వు పడవలసి వస్తుంది. మనిద్దరం వెళ్దాం. నువ్వేమీ మాట్లాడ నక్కర్లేదు. ఊరికే నా పక్క నుండు నాకంతే చాలు."

ఇద్దరమూ, లేచి పొలం గట్లమ్మట బయలుదేరాం. దారిలో అన్నాను ఒరేయ్, రాధకి మళ్ళీ పెళ్ళిచేద్దామనుకొంటున్నారు కదా. పెళ్ళికొడుకులు దొరకడం చాలా కష్టమవుతుందనుకొంటాను."

చేతిలో ఉన్న సిగరెట్ పొలంలోకి విసిరేస్తూ, "మీ మామయ్య కూతురు శ్యామలతో నీ పెళ్ళి కనక నిశ్చయం అవకపోతే నాకా కష్ట ముండేదికాదు !" అన్నాడు నేను ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాను. నా అంతరాంతరాల్లో నా అసహాయత వల్లా, పిరికితనంవల్లా అణగారిపోయిన భావన—అప్రయత్నంగా మాటల రూపంలో బయటకు వచ్చేసింది "శ్యామల పుట్టి ఉండకపోతే, ఇప్పుడేం ఖర్మ ! మీ రాధ మెళ్లో మొదట్లోనే, నేను తాళి కట్టేవాణ్ణేమో !" సీతాపతి ఆగాడు. జబ్బ పట్టుకొని నన్ను తన వైపు తిప్పుకొని అన్నాడు. "అప్పన్నా, రాధ నిజంగా దురదృష్టవంతురాలు. దానిక్కారణం, నీ తాళ్ళకు బంధం వేసిన మేనరికమూ—ఆ బంధాన్ని తెంచుకోలేని నీ అసహాయతానూ. అయినా, ఛ ! ఛ! యివి నేననవలసిన మాటలు కావు. శ్యామల అదృష్టానికి నేను సంతో షిస్తున్నాను." సీతాపతి గొంతు పూడుకుపోయింది.

ఆ మర్నాడుదయం, నేనూ, సీతాపతీ కాకినాడ వెళ్ళాం. మేం వెళ్ళేసరికి రాఘవయ్యగారింట్లోనే ఉన్నాడు. పలకరింపులూ అవీ అయిన తర్వాత, సీతాపతి అసలు విషయాన్ని నెమ్మదిగా కదలేశాడు. "మావగారూ, మా రాధకి మళ్ళీ పెళ్ళి చేద్దామనుకొంటున్నాము."

నడవ గుమ్మం దగ్గర నిల్చున్న శారదాంబగారు విరుచుకుపడింది. "సిగ్గు లేకపోతేసరి ! యింట్లో అడుగు పెడ్తూనే నిండు ప్రాణాన్ని తీసింది. తగుదునమ్మా అని మళ్ళీ పెళ్ళికి తయారవుతోంది. ఇలా ఎంతమంది ప్రాణాల్ని తీస్తారు మీరు ? అయినవాళ్ళందరిలోనూ మాకు తలవంపులు తీసుకురావాలనా ?"

ఆవిడ వాలకం చూసి నాకు నిజంగానే భయమేసింది. సీతాపతి అన్నట్లు, నేనైతే తిరిగి సమాధానం చెప్పలేకపోయేవాణ్ణి. సీతాపతి మొహం కోపంతో ఎర్రగా కందిపోయింది. శారదాంబగారితో కాకుండా, రాఘవయ్యగారితో అన్నాడు. "చూడండి రాఘవయ్యగారూ, మారాధని ఆడిపోసుకోవడం ఏమంత సమంజసమైన మాట కాదు. గుండెజబ్బు ఉన్న మీ కొడుక్కి అసలు పెళ్ళిమాట తలపెట్ట కుండా ఉండవల్సింది పోయి, ఆ విషయాన్ని దాచిపెట్టి, దారుణంగా ఓ స్త్రీ జీవితాన్ని నాశనంచేశారు మీరు !

అయినకాడికి పదివేలూ కట్నం పుచ్చుకొని, మీరు మా రాధకిచ్చిందేమిటి? మూడు రోజుల జీవితమూ—పదికాలాల పాటు వైధవ్యమూను! మనమందరమూ బలహీనతలున్న మామూలు మానవులం. ఆ బలహీనతలవల్ల వయసులో ఉన్న మా రాధ దారితప్పి, మీకూ, మాకూ తలవంపులు తెచ్చేకన్నా, ఆ అవకాశం రాకుండా రాధకి మళ్ళీ పెళ్ళిచేస్తే, అన్ని విధాలా వుంటుంది." సీతాపతి చాలా బలంగా అన్న మాటలకి శారదాంబగారు నోరెత్తలేకపోయింది. రాఘవయ్యగారు తేరుకొని అన్నాడు, పేలవంగా. "కొడుకులు పెళ్ళిళ్ళు చేసుకొని సుఖంగా ఉండాలని ఏ తల్లిదండ్రులకుండదు?"

"మీరన్నమాట నిజమే. అదే మాట ఆడపిల్లని కన్నవాళ్ళకూ వర్తించదా మరి? అయినా ఏ క్షణాన్నైనా ఆరిపోయే దీపాన్ని, జీవితాంతం మరొకరికి ఆసరాగా యివ్వజూనడం చాలా అన్యాయమంటాను. ఎవరికీ ఏ విధమైన యిబ్బందీ కలగకుండా, తాత్కాలికమైన అవసరాలు తీర్చుకోడానికీ, లోకాన్ని ఖాతరుచెయ్యకుండా నెట్టుకుపోవడానికీ, మగవాళ్ళకి చాలా సదుపాయాలూ, మార్గాలూ ఉన్నప్పుడు—గుండె జబ్బుకల మీ కొడుక్కి పెళ్ళి అనవసరమే అంటాను. అన్నీ తెలిసి మీరు మరొకరి గొంతుక కోశారు!" సుందబద్దలుకొట్టినట్లుగా సీతాపతి అన్నమాటలకు, నేనే ఆచేతను పోయాను. రాఘవయ్యగారు మాట్లాడ లేదు.

"రెండో పెళ్ళి చేసుకోవడానికి ఎవరు వస్తారయ్యా ముందుకు?!" శారదాంబగారు అక్కసుగా అంది. సీతాపతి చివరి బాణం విసిరాడు. "రాధ అన్నివిధాలా సర్వస్వతంత్రురాలు. తన జీవితాన్ని తన యిష్టానిష్టాలకనుగుణంగా గడుపుకోవడానికి ఏ విధమైన లోటూ ఉండదనుకొంటాను. ఎందుకంటే, మీ పిత్రార్జితమైన ఆస్తిలో రాధ భర్త వాటా పాతిక ఎకరాల వరకూ వస్తుందనుకొంటాను. పదివేలకి గుండెజబ్బు మనిషి దొరకగా లేంది, పాతిక ఎకరాలకు కనీసం కుంటివాడైనా దొరక్కపోడా!" శారదాంబగారు తెల్లబోయింది. అక్కడ ఉండలేక లోపలికి వెళ్ళిపోయింది. రాఘవయ్యగారు యిబ్బందిగా మొహం పెట్టాడు. మళ్ళీ సీతాపతే అన్నాడు— "మావగారూ, మిమ్మల్ని బెదిరించాలని నా ఉద్దేశ్యం కాదు. మీ ఆస్తిమీద మమకారం మాకసలే లేదు. మాక్కావల్సిందల్లా, మీ అంగీకారం మాత్రమే. మీ అంగీకారం ఉందని తెలిస్తే, మన రెండు కుటుంబాలకీ చాలా గౌరవంగా ఉంటుంది."

డబ్బు పేరు ఎత్తేసరికి, మనుషుల్లో వచ్చే మార్పుని మొదటిసారిగా ఆ రోజు గుర్తించగలిగాను. "సరే మీ యిష్టప్రకారమే కానీయండి. రాధకి ఎంత

కట్నం యివ్వవలసి వస్తుందో నాకు తెలియజేయండి ఆ డబ్బు నేనే యిచ్చు కొంటాను," అని రాఘవయ్యగారు లోపలికి వెళ్ళిపోయారు. ఆ హఠాత్పరి ణామానికి మేమిద్దరమూ కూడా తట్టుకో లేకపోయాం !

అయితే రాధకి వరుణ్ణి వెదకడంలో, సీతాపతీ, వాడితోపాటు నేనూ చాలా కష్టపడవలసి వచ్చింది. ఓ ఏడాది శ్రమ పడ్డ తర్వాత, అభ్యుదయ భావాలుగల ఓ డాక్టరుతో రాధ వివాహం జరిగి పోయింది. రాఘవయ్య దగ్గరుండి వివాహం చేయించి,నలుగురిచేతా 'ఓహో' అనిపించుకొన్నాడు. తన భూమిని పైకి పోకుండా కాపాడుకొన్నాడు. సీతాపతి శ్రమని ఎవరూ గుర్తించలేదు. అందుకు తను బాధపడలేదు. రాధ జీవితం బాగుపడింది. దానికే సీతాపతి చాలా సంతోషించాడు.

మరో ఏడాదిలో మేం కూడా జీవితాల్లో సర్దుకొన్నాం. సీతాపతి అదృష్టం ఎందుకనో వక్రగతిని పట్టింది. రెండేళ్ళ పిల్లని ఇంట్లో ఉంచి, పేరం టానికి వెళ్ళి తిరిగి వస్తూన్న సీతాపతి భార్య, ప్రమాదవశాత్తూ లారీకింద పడి ఈ లోకం విడిచిపెట్టడంతో, సీతాపతి నిజంగా కృంగిపోయాడు. ఓ ఆర్నెల్ల పాటు సీతాపతి బయటకు రాలేదు. తర్వాత తర్వాత నెమ్మదిగా నిలదొక్కు కొని, మామూలు మనిషిగా తయారయినా, చాలా నిర్లిప్తంగా కాలం గడిపేయసాగాడు. కొంతకాలం వ్యవధి యిచ్చి, మేం అందరం సీతాపతిని మళ్ళీ పెళ్ళిచేసుకోమని, ఎంతగానో బలవంతం చేశాం. సీతాపతి మొండికెత్తి కూర్చున్నాడు. "నా జీవితంలో అదృష్ట మనేది లేదు. నా కూతురికి సవతితల్లిని తీసుకురాలేను. అటు అమ్మమ్మా, యిటు నాయనమ్మా ఉన్నంతకాలం, గౌరికి ఆడదిక్కూ, పాలనా ఉండవన్న బెంగ నాకు లేదు ఇంక నా జీవితమంటారా? నాకు లభించిన అనుభవం చాలు!" అప్పటికీ మధ్య మధ్యలో సీతాపతిని విసిగించడం మానుకోలేదు. కొంతమంది కావలసినవాళ్ళు.

ఉన్నట్టుండి ఓ రోజు సీతాపతి ఎవరి తోనూ చెప్పకుండా,ఆపరేషన్ చేయించు కొన్నాడు నాకు కబురందింది చూడ్డానికి వెళ్ళాను సీతాపతి నవ్వుతూ అన్నాడు— "ఈ విధమైన పిచ్చితుగ్లక్ పని ఎందుకు చేశానో అని నువ్వు ఆశ్చర్యపడవచ్చును. ప్రతిరోజూ మీరందరూ బలవంత పెడ్తూంటే, నా నిర్ణయం సడలిపోతుం దేమోనన్న భయం వేసింది. ఇప్పుడు నా జీవితంలో ఏ స్త్రీ ప్రవేశించినా గొడ్రాలి గానే ఉండిపోవలసి వస్తుంది! ఇంకె వర్రా నన్ను పెళ్ళిచేసుకొనేది ! ?" సీతాపతి మా అందరి ప్రయత్నాల్ని ఒక్క గొడ్డలిపెట్టుతో నరికి పారేశాడు. సీతాపతి జీవితాన్ని మా సారథ్యంతో

మలుపు తిప్పలేమని ఆరోజున తెలిసి రావడంతో, మేమెవ్వరమూ మరి సీతాపతి పెళ్ళిప్రసక్తి తీసుకురాలేదు.

కాలగర్భంలో మృత్యువుకి దగ్గరగా ఎన్నో మెట్లు ఎక్కిన తర్వాత, సీతాపతి అనుకోని విధంగా ఈ పని ఎందుకు చేశాడో ఊహించలేకపోయాను. గౌరికి పెళ్ళయి అప్పుడే రెండేళ్లయింది. ఒక కుర్రాడు కూడాను.

నా ఆలోచనలకి భంగం కలిగిస్తూ శ్యామల తట్టి లేపింది. శ్యామల వెనకనే ఉన్న గౌరినీ, ఆమె భర్త శ్రీనివాసునీ చూడ్డంతో, సీతాపతి చేసిన ఘనకార్యం పెద్ద అలజడే కలిగించిందని ఊహించుకో గలిగాను. నవ్వు తెచ్చుకొంటూ, "రావోయ్, అల్లుడూ రా. ఏమమ్మా గౌరీ ఎప్పుడు వచ్చావు? పిల్లవాడేడీ?" అన్నాను.

"మీరు వచ్చారని తెలిసి ఇప్పుడే వచ్చాం బాబాయ్. పిల్లవాణ్ణి తీసుకు రాలేదు. చూశారా, మీ స్నేహితుడెంత పనిచేశాడో ?" గౌరి ఆగింది శ్రీనివాసు మొదలుపెట్టాడు. "మావగారు చేసిన పనికి అభ్యంతరం చెప్పడానికి మాకేం హక్కుందని కనక ? కాని, మీ మావగారు గోపాలకృష్ణుడయ్యాడట! ఇన్నేళ్లూ ఊరుకొని ఇప్పుడిదేం బుద్ధి ?' అని, అయిన వాళ్ళూ కానివాళ్ళూ దెప్పిపొడుస్తూంటే చాలా సిగ్గుగానూ, అవమానంగానూ ఉంటోంది. ఇటు ఇంట్లో చూస్తే,, మా అమ్మ అస్తమానూ గౌరిని దెప్పి పొడుస్తోంది గౌరి బాధని నేను చూడ లేకపోతున్నాను" గౌరియెడల శ్రీనివాసు కున్న ప్రేమని గుర్తించి, నేను మనసులో సంతోషించాను

"అవును బాబాయ్, నాన్న ఈ ఘన కార్యం చేసిన మరుసటిరోజునే, కొన్ని కాకులు పనికట్టుకొని మా ఊరు వచ్చి చెప్పివెళ్ళిన మరుక్షణం నుంచీ, అత్తయ్య ధోరణి మారిపోయింది. నాన్న తన సుఖం చూసుకొన్నాడే కాని, నా సంగతి ఆలోచించలేదు." గౌరి అన్న మాటలకు నాకు ఒక్కసారిగా కోపం వచ్చింది కాస్త కటువుగానే అన్నాను. "చూడమ్మా గౌరీ, నువ్వనవలసిన మాటలేనా యివి! నీకోసం మీ నాన్న ఎంత త్యాగం చేశాడో నీకు తెలుసుండే, యిలా అనడం భావ్యంకాదు. ఏమోయ్ శ్రీనివాసూ, ఎవరో ఏవో మాటలన్నారనే, ఈ కాలపు యువకుడవైయుండీ బాధపడడం చేతకా తనమే అవుతుంది. ఓ నవ్వు నవ్వేసి 'ఆ ఊరివాళ్ళ కది అనవాయితీ' అంటే వదిలిపోతుంది విషయాన్ని మనసుకి పట్టించుకొని ఏం ప్రయోజనం? మీ అమ్మగారికి నచ్చజెప్పవలసిన బాధ్యత నీదే".

సీతాపతిని ఈ విధంగా సమర్థిస్తానని వాళ్లనుకోలేదు. బిక్కమొహం వేసిన గౌరిని చూసి జాలివేసింది. వాళ్ళిద్దరూ మౌనంగా ఉండిపోయారు. నిశ్శబ్దాన్ని

భంగపరుస్తూ నేనే అడిగాను. "మీ నాన్న యింట్లో ఉన్నాడా?"

"తోటలో ఇంట్లో, ఆవిడగారితో పాటు ఉంటున్నాడు. నిన్న సాయంకాలం మేం వచ్చిన తర్వాత, కబురంపినా రాలేదు!" అన్నది గౌరి. ఆ మాటల్లో ఉడుకుబోతుతనం కొట్టవచ్చినట్లు కనబడింది. పుట్టింటి తరపున, తనకు నా అన్నవాళ్ళెవరూ లేరన్న బాధ గోచరించింది.

"సరే మిమ్మల్ని నిరుత్సాహపరచడ మెందుకు? వెంకటస్వామిని బండి తీసుకురమ్మని చెప్తాను. మనందరం, అక్కడికే వెళ్దాం." మీ నాన్న ఏమంటాడో చూద్దాం?" అన్నాను, కుర్చీ లోంచి లేస్తూ.

దారిలో నా ఆలోచన రత్నావతి మీదకు మళ్ళింది. ఓ పదిహేనేళ్లపాటు మా చుట్టుపక్కల ఉన్న అన్ని నాటకాల కంపెనీలకీ రత్నావతే హీరోయిన్ అనీ, వయసులో ఉన్నప్పుడు రత్నావతి కోసం కనీసం యిరవై మందైనా బుర్రలు బద్దలుకొట్టు కొన్నారనీ చెప్తే, ఆమె అందాన్ని వేరే వర్ణించ నవసరం లేదనుకొంటాను.

మమ్మల్ని చూస్తూనే, మామిడిచెట్టు కింద పడక్కుర్చీలో విశ్రాంతి తీసుకొంటూన్న సీతాపతి ఒక్కసారిగా కంగారుపడిపోయాడు. పక్కనే తుంగ చాపమీద కూర్చున్న రత్నావతి లేచి నిల్చుని, బెదురు బెదురుగా చూడసాగింది. పసుపు రాసుకొని స్నానం చేసిన ఛాయలు, నుదుట రూపాయకాసంత కుంకంబొట్టు, కంజీవరం పట్టుచీర – అపర లక్ష్మీదేవిలా ఉన్న రత్నావతిని చూడగానే, నా కళ్లను నేను నమ్మలేక పోయాను. ఆమె కళ్లలో ఓ రకమైన ఆవేదన కొట్టవచ్చినట్లు కనబడ్తోంది.

సీతాపతి తేరుకొని నవ్వుతూ అన్నాడు– "ఏరా, వీళ్ళిద్దర్నీ తీసుకొని దండయాత్రకి వచ్చినట్లున్నావ్? ఏమోయ్ శ్రీనివాసూ, మీ యింట్లో అందరూ కులాసానా? ఏం గౌరీ అలా చూస్తున్నావ్? యిదుగో నేను ఉంచుకున్న మీ అమ్మ!" యిబ్బంది కలిగించే ఆ సమయంలో కూడా, సీతాపతి నవ్వుతూ మాట్లాడ్డం చూసి, నేను కొంత విస్మయం పొందాను.

"రామ్మా గౌరీ, యిలా కూర్చో. పేరుకు తగ్గట్టు, గౌరీదేవిలాగే ఉన్నా వమ్మా! మనవణ్ణి తీసుకరాలేదేం?" రత్నావతి చొరవ తీసుకొని, మంత్ర ముగ్ధలా నిల్చున్న గౌరి చెయ్యి పట్టుకొని చాపమీద కూర్చోబెట్టింది. నేనూ, శ్రీనివాసూ పక్కనే ఉన్న కుర్చీల్లో కూర్చున్నాం. 'ఇదంతా ఏమిట్రా?' అన్నట్లుగా సీతాపతికేసి చూశాను. నా చూపులో అర్థాన్ని సీతాపతి యిట్టే గ్రహించాడు. బుర్ర వంచుకొని నేలకేసి చూస్తూ అన్నాడు. "నేనిటువంటి పని



మీ కెవరికీ ఇష్టం లేదని
గా చేశాను అన్న
గా చిన్నది గౌరి

పెళ్ళయి అత్తింటికి వెళ్ళిపోయిన తర్వాత
నా జీవితం అంతా శూన్యమనిపించింది.
ఆత్మహత్య చేసుకోబోతున్న రత్నావతిని

రక్షించడం. నా వంటరితనాన్ని పంచు కోడానికి సిద్ధపడిన ఆమె మెళ్లో నేను పసుపుకొమ్ము కట్టడం—అనుకోకుండా, దైవికంగా జరిగిపోయాయి రత్నావతి నా ఇల్లాలు.కాని లోకందృష్టిలో ఉంపుడు కత్తె! మీరు, నేను రత్నావతిని ఉంచు కొన్నానని భావిస్తే, నేను చెయ్యగలిగింది ఏమీలేదు!"

"అంతా బాగానే ఉంది. కాని నీ వియ్యాలవారి పరువు ప్రతిష్టలూ, అన్నింటికి మించి అత్తింటిలో గౌరి అలుసైపోతుందన్న సంగతి, నీ దృష్టిలో పెట్టుకొంటే బావుండేదనుకొంటాను!" నేను కొంచెం నిష్టూరంగానే అన్నాను.

నేనన్న మాటలకు సీతాపతి తల ఎత్తి చూశాడు. శ్రీనివాసుతో అన్నాడు. "విధవా వివాహం చేసిన ఘనత పేరుకే కాని, చాలా సంవత్సరాల తర్వాత,గౌరి పెళ్ళి విషయంలో అది ఎంత ప్రతి బంధకమైందో దేముడికే తెలుసు. చివరకు నువ్వు గౌరి అందాన్ని చూసి మోజు పడ్డావు నీ వాళ్ళు ఆశించింది మరొకటి ఇప్పుడు ఈ గొడవలోపడి, మీ చేతి కందవలసింది మరొకరి పరమైపోతుం దన్న భయం మీ కుండగం సహజం అయితే మీకా బెంగ అక్కర్లేదు.మీ ఊరికి దగ్గరగా ఉన్న ఇరవై ఎకరాల భూమిని గౌరి పేర రిజిష్టరు చేయించాను. ఇక నుంచీ ఆ వ్యవహారాలన్నీ మీరే చూసు కోండి. ఇదిగో ఈ ఎకరం తోటా, దీని కానుకొని ఉన్న నాలుగెకరాల భూమీ. నా అనంతరం రాధకు చెందుతాయి." శ్రీనివాసు కళ్ళలో ఓ చిన్న మెరుపు నేను గమనించకపోలేదు. అయితే సీతాపతి మాటలకు, శ్రీనివాసు సిగ్గుపడి మాట్లాడలేకపోయాడు

అంతవరకూ మౌనంగా కూర్చున్న గౌరి విజృంభించింది. నువ్వు డబ్బుతో కొనిపెడ్తున్న గౌరవం నా కక్కర్లేదు! వంటరితనం భరించలేక ఇప్పుడీ పని చేశానంటున్నావ్. అలాగే మగ దిక్కు లేదని, ప్రతి ఆడదీ ఎవణ్ణో ఒకణ్ణి పట్టుకొంటే!"

"అవి వ్యక్తిగతమైన సమస్యలు దానివల్ల కలిగే పరిణామాలకి నిలదొక్కుకో కలిగితే, ఇంకా కళ్ళు జోక్యం కలుగ చేసుకోవలసిన అవసరంలేదు." సీతాపతి నెమ్మదిగా అన్నాడు.

"మరి రాధత్తయ్య అటువంటి పనేదైనా చేస్తుందని భయపడేగా నువ్వు మళ్ళీ పెళ్ళి చేసింది! అమ్మ పోయిన తర్వాత నువ్వే మళ్ళీ పెళ్ళిచేసుకొని ఉంటే, నాకీ రోజున ఇంత అవమానం జరిగేదికాదు!" ఈ మాటని గౌరి, సీతాపతిని నిరుత్తరుణ్ణి చేసింది. నా కేసి జాలిగా చూశాడు ఆ చూపుల్లో ఓ రకమైన నిస్సహాయత ఎందుచేతనో. సీతాపతి ఆడదాని పొందు కోసం చేశాడన్న నమ్మకం రిగ్గాతో అన్నాన




మీ నాన్నని అపార్థంచేసుకొంటున్నావ్. ఇంతకాలం మరో స్త్రీ మాట ఎత్తకుండా ఉన్నాడంటే, అది నీ జీవితం కోసం మీ నాన్న చేసిన త్యాగం. ఇప్పుడు నువ్వు హాయిగా నీ సంసారం చేసుకొంటున్నప్పుడు, మీ నాన్న ఈ పనిచేసినందుకు నువ్వు విచారించనవసరంలేదు. ప్రాణాలు తీసుకోబోతున్న ఓ పతితని ఆ ప్రయత్నంనుంచి విరమించుకొనేటట్లు చెయ్యడం కోసం, మీ నాన్నలోని శివర్షి ఈ పని చేయించిదనుకొంటాను. మీ నాన్న కళ్లలోకి ఒక్కసారి చూడు. ఈమె సహచర్యంలో అతనెంత శాంతి పొందుతున్నదీ తెలుస్తుంది. చివరిదశలో మీ నాన్నకి లభించిన ఈ ఆనందాన్ని దూరం చెయ్యకమ్మా."

రత్నావతి కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి. గౌరిని తన వైపు తిప్పుకొంటూ గాద్గదికంగా, "సుఖంగా పెళ్ళిళ్లు చేసుకొని, పిల్లా జెల్లాతో హాయిగా సంసారాలు చేసుకొనే అదృష్టం నాలాంటి అభాగినులకు లేదు. జీవితంమీద రోత పుట్టి, ప్రాణాలు తీసుకొనే సమయంలో ఈయన అడ్డుకొన్నారు. చీకటిలో పోతున్న నాకు ఓ వెలుగు రేఖను చూపారు. వళ్లమ్ముకొని సంపాదించిన వేలకొలదీ రూపాయల్ని అనాధాశ్రమానికి దానం చేయించి, నా చేత ఓ మంచిపని చేయించారు. జీవితాంతమూ పతితగానే ఉండవలసిన నాకు, చివరిదశలో ఓ గృహిణిగా స్థానం కలగజేశారు. మీ నాన్న నాకు వాగ్దానం చేసింది, మెళ్లో ఈ తాడు, నేను పోయిన తర్వాత నా కోసం

ఓ రెండు కన్నీటి బిందువులు. ఒకరి ఆశ్రయంలో మరొకరం ఓ రకమైన శాంతితో, బతుకుతున్నాం. నా గురించి కాకపోయినా, మీ నాన్న గురించైనా ఈ ఉంచుకొన్న అమ్మని క్షమించలేవూ?" రత్నావతి ఒక్క-క్షణం ఆగింది. గౌరి కళ్లలో నీళ్లు నిండాయి. రత్నావతికేసి చూస్తూ ఉండిపోయింది. రత్నావతి తన మెళ్లోని చంద్రహారాన్ని, చేతినున్న బంగారపు గాజుల్ని, చెవినున్న రవ్వల దుద్దుల్ని తీసి గౌరి ముందు ఉంచుతూ అంది-"మీ నాన్నగారు నాకు గృహిణిగా స్థానమిచ్చారు. తల్లిగా కూడా స్థానం సంపాదించాలనుకొంటున్నాను. అదొక్క-టే నాకు మిగిలిపోయిన కోరిక. అది నీ చేతుల్లో ఉందమ్మా. ఈ నగలన్నీ నేను నాటకాలు వేసి, నాట్యాలు చేసి న్యాయంగా సంపాదించుకొన్న సొమ్ము. ఈ రోజున నా కూతురిలాగా ఇక్క-డకు వచ్చావు ఈ తల్లి యిస్తున్న కానుక లందుకొంటే, నా జీవితం ధన్యమై పోతుంది. అంతకుమించిన అదృష్టం నాకీ జన్మలో ఉండదు. నువ్వు నిరాకరిస్తే, నాయంత నిర్భాగ్యురాలీ లోకంలో లేదనుకొని, మీ అందరి జీవితాలనుంచీ శాశ్వతంగా, మీ కెవరికీ కష్టం కలుగని విధంగా దూరంగా వెళ్ళిపోతాను..."

రత్నావతి మరి మాట్లాడలేకపోయింది. గౌరి హృదయం కరిగిపోయిందని వేరే చెప్పనక్ఖర్లేదు. తండ్రికేసి చూసింది. ఆ కళ్లలో ఏదో అభ్యర్థన. నాకేసి చూసింది. ఉత్సాహంగా చిరునవ్వు నవ్వాను. మొగుడికేసి చూస్తూ ఉండిపోయింది. అతని కళ్ళలో-సుమారు పదిహేనువేల రూపాయలు చేసే బంగారాన్ని గౌరి కాదంటుందేమోనన్న భయం, ఒక వేశ్య దగ్గర తన భార్య, కూతురు లాంఛనాలుగా నగలు పుచ్చుకొందని నలుగురూ హేళనచేస్తారేమోనన్న భయం – నాకు గోచరించాయి.

సీతాపతి ఎంత నాకు ఆప్తుడైనా, ఆ క్షణంలో వాళ్లందరికీ నేను పైవాడినే అన్నభావం నాలో కలిగింది. వెంటనే మౌనంగా అక్క-డ్డించి లేచి యింటిదారి పట్టాను.

మీరే కనక శ్రీనివాసు పరిస్థితిలో ఉంటే ఏం చేస్తారు? ఈ కథకి ముగింపు మీ చేతిలోనే ఉంది.





# మళ్ళీ గులాబీ

ఇచ్ఛాపురపు
జగన్నాథరావు

"హేపీ బర్త్‌డే!"

గాఢమైన నిద్రలో ఉన్న రేఖకి ఆ మాటలు ఏదో కలలోలాగ వినిపించాయి.

"హేపీ బర్త్‌డే, రేఖా!"

కొంచెం సంగీతం పాడుతోన్నట్టు మళ్ళీ ఆ మాటలు వినిపించాక రేఖ కళ్ళు తెరిచింది.

ఎదురుగా నిలబడి చేతిలో పుష్పగుచ్ఛంతో స్వచ్ఛంగా చిరునవ్వుతో గోపాల్ కనిపించేడు.

రేఖ లేచి కూర్చుని కళ్ళు నులుముకుని బెడ్ పక్క గడియారం చూసింది. ఏడు దగ్గరపడుతోంది.

"అరే! అలారమ్ కొట్టలేదా?" అంది దిగుతూ.

"కొట్టలేదు...ఎందుచేతనో తెలుసా?" అన్నాడు గోపాల్.

"ఏం?"

"ఆపేశాను."

"ఎందుకని?"

"చెప్పేనుగా! హేపీ బర్త్‌డే హేపీగా ఉండాలంటే ఉదయమే అలారమ్ కొట్టకూడదని రూలు...నీకు తెలీదులే...కాని, ఈ పువ్వులు తీసుకుని ఒక చిరునవ్వు వొదిలేస్తే నేను మిగిలినపని చూసుకుంటాను" అన్నాడు గోపాల్.

రేఖ అతని మాటలకి చిరునవ్వుతో జవాబిచ్చింది...త్వరత్వరగా ఆమె క్రిందటి ఏడెనిమిది నెలలలోనూ అతనితో పరిచయాన్ని నెమరు వేసింది... తానెప్పుడూ తన జన్మదినాన్ని గురించి అతనితో మాట్లాడలేదు...అతని కెలాగ తెలిసిందో!

నిజానికి తానే మరిచిపోయిన వివరం అది...

"ఈ బుకే కూడా తీసుకుంటే..."

రేఖ అతన్నలాగే నిలబడమని సంజ్ఞచేసి టూత్ బ్రష్‌తో బాత్‌రూమ్‌కి పరిగెట్టింది. ఆమె ముఖం కడుక్కుని బొట్టు పెట్టుకుని వొచ్చేదాకా అతనలాగే నిలబడి ఉన్నాడు.

"సారీ..."

"నాటెటాల్!" అంటూ ఆమె చేతిలో బుకే పెట్టేడు. ఆమె వాటిని వాసన చూస్తూ 'థేంక్స్' అంటూంటే గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు

"నాటీ" అంది రేఖ.

"నా డ్యూటీ" అన్నాడు గోపాల్. ఆ ఒక్క క్షణమూ ఆమె కావాలనో, తెలియకో అతని కౌగిలిలో కుంచించుకు పోకపోవడం అతనికి సంతోషం కలిగించింది.

బుకే డ్రెస్సింగ్ టేబిల్ మీద పెట్టి రేఖ కిచెన్‌లోకి వెడుతూ, "నా డ్యూటీ–మీకు టీ ఇవ్వడం...గంట ఆలస్యం అయింది..." అంది.

గోపాల్ ఏమీ అనలేదు.

కిచెన్‌లో ట్రేలో టీ సిద్ధంగా ఉంది. తీసి తెస్తూ, "మీరు టైముకి నన్ను లేపితే చాలుగదా! ఎందుకు మీకి శ్రమ?" అంది రేఖ. టీ కలిపి అతని కిచ్చింది.

"టీ లవ్‌లీగా ఉంది..." అన్నాడు, సిప్ చేస్తూ గోపాల్.

"మీరు చేసిన టీ...కనక!" అంది రేఖ.

"థేంక్స్! ఆ కాంప్లిమెంటు కోసమే అన్నాను" అన్నాడు గోపాల్. టీ తాగేసరికి పూర్తిగా తెలివి వొచ్చింది రేఖకి.

"అరే! మీ రింత తీరుబాటుగా ఉన్నారేం?" అంది, కంగారుగా.

"ఏం?..." అన్నాడు మరో కప్ టీ చేసుకుంటూ గోపాల్.

"ఫేక్టరీకి వెళ్ళరా?"

"వెళ్ళను."

"ఏం?"

"ఇవేళ–సెలవు డిక్లేర్ చేశాం. అంటే...భార్యల పుట్టినరోజులు ఉన్న భర్తలకి...అంటే, సంవత్సరం దాటకుండా పెళ్ళి అయిన వాళ్ళల్లో..."

"అలాగా!" అంది రేఖ. అతని ఫేక్టరీలో వెయ్యిమంది పైగా ఉన్నారు. అంచేత ఈ రోజు కనీసం ముగ్గురు భార్యల పుట్టినరోజులై ఉంటాయి.

"అవును" అన్నాడు గోపాల్..." ఇవేళ మనం చిన్న పండగలాగ చెయ్యాలి. సెలబ్రేషన్. ఏం?" అన్నాడు అదే ధోరణిలో.

"ఏమిటా సెలబ్రేషన్?" అంది రేఖ.

"లంచీ, డిన్నరూ...బయటికి పోదాం...డిన్నరుకి మన గెస్టులందరూ తాజ్ ఎన్నికచేశారు..."

"ఏం...ఏదైనా లాటరీ కొట్టేరా?" అంది రేఖ కొంచెం ఆశ్చర్యంగా.

"లేదు–కాని అంతా బడ్జెట్‌లో సరిపోతుంది. భయపడకు–ఈ ఇల్లు అమ్మే ప్రయత్నం అక్కరలేదు...కనీసం, ప్రస్తుతానికి" అన్నాడు గోపాల్.

"ఈ ఇల్లు కొనేవారెవరు లెండి–కనీసం, మీరు అమ్మితే!" అంది, లేస్తూ, రేఖ.




"కూర్చో...కూర్చో..."

"నాకు టైమవుతోంది..."

"దేనికి ?"

"ఆఫీసుకి–మా వాళ్ళు సెలవు డిక్లేర్ చెయ్యలేదుగా !" అంది రేఖ.

"పొరపాటు...నాది. నీకూ ఇవేళ సెలవు."

"ఆదేమిటి ?"

"మీ బాస్‌తో మాట్లాడేను "

"ఎప్పుడు ?"

"ఉదయం ఆరుగంటలకి నేను లేచి చేసిన పనుల్లో అదొకటి. అతను ఆరుం పావుకి లేవడని అనుకోలేదు...గుడ్ మార్నింగ్ చెప్పేనులే. నేనని తెలిసేసరికి మానవుడు మానవుడిలాగే మాట్లాడేడు !...నీకు శుభాకాంక్షలు చెప్తానన్నాడు."

రేఖ ముఖంలో వాస్తోన్న విచిత్రమైన మార్పులు గమనిస్తూనే ఉన్నాడు గోపాల్. నవ్వి, "భయపడకు...అతనికి నువ్వంటే చాలా అభిమానం... ఒక్కరోజు నువ్వు వెళ్ళకపోతే ఏమీ అనుకోడు !" అన్నాడు గోపాల్ సిగరెట్ వెలిగిస్తూ.

నిలబడి ఉన్న రేఖ నీరసంగా కూర్చుంది. సిగరెట్ పొగ ఆమెకు గిట్టదు. గాని, ఆ క్షణంలో అక్కడినించి లేచి వెళ్లే ఓపిక లేకపోయింది.

బాస్ !

జీవన్‌కుమార్...

అతనికి తానంటే చాలా అభిమానం అని చెప్తున్నాడు గోపాల్ ! నవ్వుతూ చెప్తున్నాడు.

"ఏం రేఖా ! అలా ఉన్నావేం ?"

రేఖ మాట్లాడలేదు. శక్తి పుంజుకునేసరికి గోపాల్ లేచి ఆమెని బెడ్‌రూమ్ లోకి తీసుకెళ్ళాడు.

"నాలుగురోజులనించి మరీ నీరసంగా ఉన్నావు నువ్వు-కొంచెంసేపు నిద్ర పోయి లే..." అన్నాడు.

"అక్కర్లేదు..." అంది రేఖ లేవడానికి ప్రయత్నిస్తూ.

"పోనీ అలాగ కూర్చో...ఏదో ఒక టైము చూసుకుని ఈ రోజే డాక్టర్ దగ్గరికి వెడదాం" అన్నాడు గోపాల్. ఆమె ముఖం రక్తవిహీనంగా ఉంది. ఎప్పుడూ చాలా ఉత్సాహంగా, జీవనరాగం ఉట్టిపడుతూ ఉండే మనిషి కాదు రేఖ. కాని ఇవేళ మరికొంచెం కళారహితంగా ఉంది ఆమె.

దిండుకి జేరబడి కూర్చుని అతన్ని పట్టి పట్టి చూసింది. ఎనిమిదినెలల కిందట ఈ మనిషి ఎవరో ! తానెవరో ! ఈనాడు ఈ గదిలో తన పక్కన కూర్చుని చెంపలమీద చేతులు వేసి ఒళ్ళు వేడిగా ఉందేమోనని చూస్తున్న ఇతనికీ తనకీ ఎలాగ విధాత కలిపేదో !"

"టైగర్ ఇంకో గంటకి కాని రాడు—కొంచెం టిఫిన్ తెచ్చేదా ?" అన్నాడు గోపాల్.

"వొద్దు వొద్దు...మీ కాకలిగా ఉంటే నేను చేసిఇస్తాను" అంది మళ్ళీ లేవబోతూ, రేఖ.

"అదేంలేదు—ఒక గంట పడుకో. కాస్త విశ్రాంతి తీసుకో ! ఆరునెలలనించి వరుసగా వారం రోజులు కాకపోతే నాలుగురోజులైనా రెస్టు లేదు నీకు !"

వాదించి లాభం లేదని, వెనక్కి జారబడి, కళ్ళు మూసుకుంది రేఖ. చిందర వందరగా వొస్తున్నాయి ఆలోచనలు...గోపాల్ ఇదంతా చెయ్యడం ఆమెకి తృప్తినీ అసంతృప్తినీ కూడా కలిగించింది. తన పుట్టినరోజు మాట తనకి జ్ఞాపకం ఉన్నా ఆ విషయంలో గోపాల్ సందడి ఏదీ చెయ్యాలని ఆమెకి లేదు.

వొచ్చే ఆలోచనల్ని అదుపులో పెట్టకుండా వెంటనే తనకి అనిపించిన విధంగా చేసే పద్ధతి అతనిది...కాని...కాని...ఉదయంనించీ అతని ఆత్రతా, చేసిన ప్రయత్నాలూ రేఖకి కొంత చిత్రంగా ఉన్నాయి.

ఆలోచనలలోనే నిద్ర పట్టేసింది రేఖకి.

లేచేసరికి తొమ్మిది దాటింది. ఉత్సాహంగా ఉంది ఆమెకి. బహుశా ఈ విశ్రాంతి చాలా ఉపయోగకరంగా ఉందన్నమాట!

గోపాల్ టెలిఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతూ ఆమె రావడం చూసి, "రేఖ ఇక్కడ ఉంది...ఆమెతోనే మాటలాడండి" అంటూ రిసీవరు ఆమె కిచ్చేడు. ఎవరని కళ్ళతోనే అడిగి, రెండు చేతులూ గాలిలోకి ఎగరవేసిన గోపాల్ ఉద్దేశం అర్థంకాక, రిసీవరు తీసుకుని, "హల్లో" అంది నెమ్మదిగా.

"మెనీ హేపీ రిటర్న్స్" అన్నాడు జీవన్.

రేఖ తనకి తెలియకుండానే జీవన్ శుభాకాంక్షల కోసం ఎదురుచూసినా, ఆ మాటలు ఆమెని కదలించాయి. ఏదో ఒక టైముకి జీవన్ తప్పక తనకి శుభాకాంక్షలు చెప్తాడని ఆమెకి తెలుసును...కాని, ఎంత నిశ్చయం ఉన్నా, అది జరగడంలోనే నిజమైన సంతృప్తి.

"థేంక్యూ" అంది రేఖ.

ఎంత చిన్నమాట! కాని అందులో ఎంత బరువు ఉందో, ఎంత కృతజ్ఞత ఉందో అతనికే బోధపడుతుంది. ఎంత బాధ ఉందో అతనికి తెలుస్తుందా?

"మీ వారిని ఒక కోరిక కోరాను" అన్నాడు జీవన్.

గోపాల్ అని అనలేదు జీవన్ 'మీ వారు....'

"ఏమిటి?"

"రాత్రి డిన్నరు...నేనివ్వాలని ఉంది..."

"ఆయన...ఏదో ఏర్పాటు చేశారు" అంది రేఖ. అతని గొంతుక వినిపిస్తే ఆమెకి వొచ్చే థ్రిల్‌తో నీరసం కూడా వొస్తుంది. టెలిఫోన్‌లో, ప్రత్యేకంగా... అలాగ.

"అవును. నన్నూ పిలిచేరు."

"రండి."

"నీకు తెలుసును... రావడమూ... మానడమూ—రెండూ నాకు కష్టమైనవే నని...కాని, రావాలని ఉంది."

"తప్పకుండా రండి. గోపాల్ చాలా సంతోషిస్తారు."

ఆదిమానవులు




"వాస్తాన్లే...కాని, అది నా డిన్నర్..." అన్నాడు దృఢంగా, జీవన్.

"ఆయన...ఏదో ఏర్పాటుచేశారు."

"నాకు తెలుసును. అందుకే ఈ రిక్వెస్టు..."

"ఆయనని అడగండి."

"అడిగేను...నిన్నడగమన్నాడు."

గోపాల్ జాగ్రత్తగా వింటున్నాడు.

"మీ ఇద్దరికీ ఎలా ఇష్టమైతే అదే నా యిష్టం..." అంది రేఖ ఇంక అనేదేమీ లేక.

"అయితే...సెటిల్డ్...తాజ్‌లో ఏడున్నరకి...మరీ ఆలస్యం అయితే బాగుండదు."

అతను ఫోన్ పెట్టేశాడు.

"ఏమంటాడు?" అన్నాడు గోపాల్.

"తాజ్‌లో-ఏడున్నర..."

"గెస్టుల పేర్లన్నీ అడిగాడు."

"అతను..."

"కానీ...కాదన్నా ఒప్పుకోలేదు...టిఫిన్ తెచ్చేను. తిందామా ?" అన్నాడు గోపాల్ మాట మారుస్తూ.

"స్నానంచేసి వొస్తాను" అని, వెళ్ళింది రేఖ.

అతను పేపరు చూస్తూ కూర్చుని ఆమె రాగానే ఆమెతో బాటు టిఫిన్ తిన్నాడు.

"ఇడ్లీ—బాగుంది...ఎక్కడినించి ?" అంది రేఖ. చెప్పేడు.

"అంత దూరం వెళ్లేరా ?"

"ఏముంది ? కారులోనే కదా !" అన్నాడు గోపాల్.

రేఖ ఇంకేమీ అనలేదు.

టెలిఫోన్ బెల్ మళ్ళీ మోగింది.

"మనం ఇంట్లో ఉన్నట్టు ఎవరికి తెలుసును ?" అంటూ లేచాడు గోపాల్.

"వింటే తెలుస్తుంది" అంది రేఖ.

నవ్వుతూ రిసీవర్ తీసేడు గోపాల్.

"నేను...మూర్తిని."

"ఎక్కడినించి ?"

"ఫేక్టరీనించి."

"ఏమిటి సంగతి ?"

"చిన్న సహాయం కావాలి."

"ఏమిటి ?"

"నా వైఫ్‌ని హాస్పిటల్‌కి తీసికెళ్ళాలి."

"ఏం ? ఏమైంది ?"

"మామూలే...మళ్ళీ తీవ్రమైన నెప్పి...నువ్వు కూడా లేవు—ఫేక్టరీ వొదిలి రాలేను నేను..."

"తప్పకుండాను...వెంటనే వెడతాను."

"డాక్టర్ స్వామి...తెలుసునా ?"

"తెలీదు. కాని, కనుక్కుంటాన్లే..."

"థేంక్స్...ఏం ఇవేళ సెలవు పెట్టేవు ?" అన్నాడు మూర్తి.

"మా రేఖ—" అని, ఆగిపోయి మాట మార్చి. "రేఖ ఎక్కడికో వెళ్ళాలని అంది" అన్నాడు గోపాల్. అంతకు ముందు మూర్తినీ పార్టీకి పిలుద్దామనుకున్నాడు. కాని అతన్ని పిలవడం రేఖకి ఇష్టం ఉండదని ఆ పని మానేశాడు.

"ఓ!...ఇద్దరూ సెలవుపెట్టి ఇంట్లో ఉండిపోయారన్నమాట" అన్నాడు మూర్తి. ఏదో దొంగతనం పట్టుకున్నట్టు అన్నాడు. గోపాల్ చిన్నగా నవ్వుకున్నాడు...అతనికి మూర్తి అంటే ఇష్టం. కాని, రేఖకి అతనంటే పడదు.

"అలాటిదేమీ లేదురే...నేను వెంటనే వెడతాను." ఫోన్ పెట్టేసి రేఖకి చెప్పేడు.

"ఆమెని డ్రాప్‌చేసి వొస్తాను" అన్నాడు.

"సరే" అంది రేఖ.

అతను రమ్మంటే వెడదామని అనుకుంది. శకుంతలని ఒకటి రెండుసార్లు రేఖ కలిసింది. పెద్ద పరిచయం లేకపోయినా, ఇలాటి సమయాలలో ఆదుకునే పాటి ఉంది.

గోపాల్ ఆమెని అడుగుదామనుకుంటూనే, కాదంటుందని అనుమానించి ఊరుకున్నాడు. అమెకై ఆమే ఈ మాట సజెస్ట్ చేసి ఉంటే అతను సంతోషించి ఉండేవాడు. కాని, రేఖ ఏమీ అనకపోవడంతో అతను బయలుదేరి వెళ్ళేడు

వెళ్లేసరికి శకుంతల తన కోసం ఎదురుచూస్తోన్నట్లు డ్రాయింగ్ రూములో కూర్చుంది. తల్లి ఆమెని ఓదారుస్తూంది. శకుంతల రెండుచేతులూ పెట్టి కడుపు మీద నొక్కుకుంటోంది.

అతన్ని చూసి, "మీకు శ్రమ...టాక్సీలో వెళ్ళి ఉండేదాన్ని" అంది శకుంతల.

"ఫరవాలేదు...బయల్దేరదామా ?" అన్నాడు గోపాల్.

"కొంచెం కాఫీ తాగండి" అంది శకుంతల.

"వొద్దు లెండి...ఇప్పుడే తాగాను" అన్నాడు నిలబడే, గోపాల్.

శకుంతల లేచి నిలబడి అడుగులు వేసే ప్రయత్నంలో జోగిపోవడం చూసి తల్లీ, గోపాల్, చెరో వేపూ పట్టుకున్నారు. ఆమెని అంత దగ్గరగా తాకడం అతనికి ఇబ్బందిగా ఉంది. కాని, ముసిలితల్లి మీద ఎక్కువ బరువు లేకుండా శకుంతల తన మీదికి ఒరిగి నడిచి కారులో కూర్చుంది.

"అయితే నేనిక్కడ ఉంటానే !" అంది తల్లి.

సరేనంది శకుంతల. గోపాల్ వేపు తిరిగి, "మా మోహన్ పదకొండుకి బడినించి వచ్చేస్తాడు..." అంది, అతను ఏదో ప్రశ్న వేసినట్టు.

"ఎక్కడికి ?" అన్నాడు గోపాల్ కారుస్టార్టు చేసి.

"డాక్టర్ స్వామి...అడయార్‌లో" అంది శకుంతల.

చాలా దూరం. కాని, ఏమీ ఆలోచన పెట్టుకోకుండానే గోపాల్ డ్రైవ్ చెయ్యసాగాడు. కొంచెం దూరం వెళ్ళేక "కొద్దిగా...స్లో చేస్తే నాకు కుదుపు తగ్గుతుంది" అంది శకుంతల.

ఆమెకి బాధ ఎక్కువౌతోన్నట్టు ఉంది. పాపం, మరీ చుట్టుకుపోతోంది...

స్లో చేశాడు. శకుంతల ముఖం చేతుల్లో దాచుకుంది. ఆమె ఏడుస్తోందేమోనని భయపడ్డాడు గోపాల్. దైహికమైన బాధలు తనవైతే ఎలాగో భరిస్తాడు గాని, ఇతరుల్లో వాటిని చూసే శక్తి తక్కువ అతనికి.

అడయార్ పొలిమేరలకి వొచ్చేక థియసాఫికల్ సొసైటీ పక్కన కారు ఆపి, "కొంచెం ఆగేదా. వెళ్దామా?" అన్నాడు గోపాల్, రెండు నిమిషాల ఉపశమనం ఆమెకి మంచిదేమోనని.

శకుంతల చేతులు ముఖం మీదనించి తీసింది. ముఖమంతా చెమట. కళ్ళు ఎర్రబడ్డాయి.

"పదండి...పాపం మీకు శ్రమ...." అంది.

మళ్ళీ స్టార్టు అయి వెళ్ళసాగాడు గోపాల్.

"ఇదంతా ఆయన చూసుకోవాల్సింది."

"ఫేక్టరీ దూరంగా!" అన్నాడు గోపాల్.

"అంతకన్నా దూరంగా ఉన్నవి ఇంకా చాలా ఉన్నాయి" అంది, అర్థం లేకుండా శకుంతల.

మరో పదినిమిషాలలో ఆమెని తీసికెళ్ళి హాస్పిటల్లో దింపేడు గోపాల్. ఈసారి ఆమె పూర్తిగా తనమీద ఆనుకుంది. కాని, ఆ విషయం గమనించినందుకు తనని తానే అసహ్యించుకున్నాడు గోపాల్. బాధలో ఉన్న మనిషి.

డాక్టర్ ఆమెని పిలిచేసరికి అరగంట పట్టింది.

"వొచ్చేదాకా ఉండగలరా?" అంది.

"అలాగే" అన్నాడు గోపాల్.

అరగంట దాటినా రాలేదు శకుంతల.

గోపాల్ ఒక నర్స్‌ని పిలిచి అడిగేడు.

ఆమె వెళ్ళి మరో ఇరవైనిమిషాల తరవాత వొచ్చి "ఆమెని ఎక్స్‌రేకి తీసికెళ్ళేరు" అంది.

"ఎంతసేపవుతుంది?"

"కొంచెంసేపట్లో వొచ్చేస్తుంది" అని, వెళ్ళిపోయింది నర్స్. ఆత్రతగా

ఆదిమానవులు




---

చూస్తూ చూస్తూ ఒంటిగంటకి కూడా ఆమె రాకపోతే టెలిఫోన్ చేసే ప్రయత్నం చేశాడు గోపాల్. కాని, ఉన్న ఒక్క ఫోనూ ఎంతకీ ఫ్రీ కాకపోవడంతో చివరికి శకుంతల వొచ్చేక రెండున్నరకి బయలుదేరేడు. ఈసారి నర్స్ సాయంతో ఆమెని కార్లో కూర్చోబెట్టేడు

ఆమెని వొదిలి వొచ్చేసి ఉండవలసింది...కాని, ఆమె ప్రత్యేకంగా కోరేక ఎలాగ వెళ్ళిపోతాడు ? కాకపోయినా...

ఆతనికి మూర్తిమీద కోపం వొచ్చింది.

చివరికి తన మీదా కోపం వొచ్చింది.

ఎందుకని, ఇలాటి పరిస్థితుల్లో ఇరుక్కోవడం ?

రేఖ ఏమనుకుంటుంది ?

తియ్య తియ్యగా ఆమెతో గడపాలనుకున్న క్షణాలు...ఇలాగ ఖర్చు అయిపోయాయి !

ఆమె కేమి సంజాయిషీ ఇవ్వడం?

"మీకు బాగా ఆలస్యం అయిపోయింది" అంది శకుంతల.

"ఫరవాలేదు."

ఆమెని ఇంట్లో వొదిలి వెళ్ళబోతోంటే తల్లితో పాటు శకుంతల కూడా అతన్ని భోజనంచేసి వెళ్ళమని బలవంత పెట్టేరు. కాదన్నా, వినలేదు.

"రేఖ...నా కోసం ఎదురుచూస్తూ ఉంటుంది" అన్నాడు చివరికి.

"ఇంతవరకూనా ?..." అంది శకుంతల.

"అవును" అని, జవాబుకి ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు గోపాల్. ఇంటికి దగ్గర అవుతూన్నకొద్దీ అతనికి బెరుకు ఎక్కువకాసాగింది. ఏమిటి ఇలాగ అయింది ? రేఖకి చాలా కోపం వొచ్చి ఉంటుంది...ప్రత్యేకం ఈ రోజు...అన్ని ప్రయత్నాలు చేశాక ఇలాగ, శకుంతల మూలంగా అన్నీ పాడయ్యాయి.

మూర్తి దీని కంతటికీ కారకుడు.

అతను మాత్రం ఏంచేస్తాడు ? ఇలాగ అవుతుందని కలగన్నాడా ?

అతను ఇంట్లో అడుగుపెట్టేసరికి రేఖ పుస్తకం ఏదో చదువుతోంది...

అతన్ని చూసి పుస్తకం వొదిలి, నిలబడింది.

"సారీ రేఖా ! అనుకోకుండా ఆలస్యం అయిపోయింది" అన్నాడు గోపాల్. ఆ మాటల తేలికతనం మరీ స్పష్టంగా తెలిసివొస్తోంది అతనికే.

రేఖ ఏమీ అనలేదు. ఆమె ఆలోచనలు ఆమెకే అస్పష్టంగా ఉన్నాయి. అతను వెళ్ళాక ఆమెకి మొదట కొంచెం కోపం వొచ్చింది—మూర్తి అనగానే అతనంత తొందరగా ఎందుకు వెళ్ళిపోవాలో ఆమెకి అర్థంకాలేదు. ఊరిలో టాక్సీలు ఉన్నాయి-శకుంతల హాస్పిటలుకి వెళ్ళి రాలేదా ? ఈయన హడావుడిగా వెళ్ళి ఇన్ని గంటలు ఉండిపోవలసిన అవసరం ఏమిటి ? కనీసం టెలిఫోన్ చెయ్యొచ్చును గదా ! అదీ లేదు...పన్నెండుదాకా చూసి చూసి చివరికి వంట మొదలుపెట్టి, అప్పటికీ అతను రాకపోతే పుస్తకం చదువుతూ కూర్చుంది... ఇప్పుడు గోపాల్ అనేమాట...సారీ...అంతే !

"భోజనానికి లేవండి" అంది తానూ కదులుతూ.

"వొండేవా ?" అన్నాడు గోపాల్, ఆశ్చర్యంగా.

"అవును" అంది రేఖ వెడుతూ.

రేఖ వివరాలడిగినా బాగుండును—అడగకుండానే తనమీద విరుచుకుపడినా బాగుండును అనిపించింది గోపాల్‌కి. కాని ఆమె ప్రయత్నం చెయ్యకుండానే ప్రదర్శిస్తోన్న ఈ నిర్లిప్తత అతనికి చాలా బాధ కలగజేసింది.

రేఖమీద అతనికి చూచాయగా కోపం వొచ్చింది.

కాని, మరుక్షణం అతని కా కోపం పోయి దానికి బదులు జాలి కలిగింది. తన జన్మదినం గురించి రేఖ ఏమీ అడగలేదు. తానే అన్నీ చేసి, మళ్ళీ ఈ ఆశా

భంగం కలిగించేడు. మరొకటీ మరొకటీ కాదు-రేఖకి అసలే ఇష్టంలేని మూర్తి భార్య కోసం ఆమెని బాధపెట్టేడు.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు.

సింపుల్‌గా ఉంది భోజనం.

అయిందనిపించారు. ఎదురుచూస్తోన్న ప్రమోషన్ రాగానే ఇంట్లో వంటమనిషిని పెట్టుకోవాలనుకున్నాడు గోపాల్. ఆమె కూడా తనలాగే ఉద్యోగం చేస్తోంది. రోజంతా పనిచేసి రాత్రి మళ్ళీ వంట అంటే కష్టంగానే ఉంటుందామెకి.

ఆ మాట ఇప్పుడు చెప్పేదికాదు.

గోపాల్ పడకకుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించి ఆలోచనలో పడ్డాడు.

తనకి దూర దూరంగా ఉండిపోయి,తన సంసారానికింకా ఒక రూపు రానివ్వని రేఖని ఇవేళ సంతోషపెడదామనుకున్నాడు. ఏదో ఒకరోజుకి ఆమె అన్ని విధాలా తనది కాకపోదనీ, దానికి తాను కొంచెం ప్రయత్నించాల్సి ఉంటుందనీ నిశ్చయించుకున్న గోపాల్ ఈ రోజు ఆ ప్రయత్నానికి నాందిగా పెట్టిన తొలి అడుగు తడబడ్డది.

దాన్ని దిద్దుకునే ప్రయత్నం చెయ్యాలి...

తాను తెచ్చిన బనారస్ చీర అలాగే ఉంది.

ఉదయం ఇద్దామని అనుకుని అలాగే మరిచిపోయాడు.

ఇది సమయం కాదు.

"టైగర్ ! టైగర్ !"

రేఖ పిలుస్తోంది. పన్నెండేళ్ళ టైగర్ ఎక్కడినించో పరిగెట్టుకొస్తున్నాడు.

వాడి పేరు ఏమిటో ఎవరికీ సరిగా తెలీదు. ఒకనాడు వొచ్చాడు-పని ఇమ్మని.

రేఖ అన్నం పెడతానంది.

వొద్దన్నాడు. వాడి కళ్ళలో ఆకలి ఉంది: కాని, ముఖంలో అభిమానం ఉంది.

తాను వెనక నిలబడి చూస్తున్నాడు.

"డబ్బిచ్చేదా ?" అంది రేఖ. "ఎంత కావాలి ?"

"పని చెప్పండి...చేస్తే ఇవ్వండి."

నిటారుగా నిలబడి మాట్లాడుతున్నాడు వాడు. కొంచెం చిరిగిన బట్టలే వేసుకున్నా, హుందాగా ఉన్నాడు.

"సరేలే-అలాగ ఉన్నావు. ఏం పనిచేస్తావు ? ముందు తిను-తరవాత పని చేద్దువుగాని" అంది రేఖ.

వాడు కదల్లేదు.

"ఏం పని ?" అన్నాడు.

"మొక్కల్లో కలుపు తీసి గొప్పులు తవ్వి నీళ్ళు పొయ్యి" అంది రేఖ.

వాడు కడుపునిండా తిన్నాడు. తింటూనే మొక్కల్లోకి చొరబడ్డాడు.

"కాస్సేపు నీడలో కూర్చో-తరవాత అదంతా చెయ్యొచ్చు" అన్నాడు గోపాల్. ఆదివారం రోజున నిద్ర అంటే తన కెంతో ప్రీతి అయినా, వాడి హుషారు చూస్తోంటే జాలి కూడా వేసింది.

"ముగించి కూర్చుంటాను" అన్నాడు.

రెండు గంటలు గొప్పులు తవ్వి నీరు పట్టి కుళాయి దగ్గర ముఖం, కాళ్లు చేతులు కడుక్కుని వొచ్చేసరికి గోపాల్ నిద్రలేచి వాడికీ రేఖకీ జరుగుతున్న సంభాషణ వింటున్నాడు.

"పనంతా చేసేసేనమ్మా !" అన్నాడు టైగర్.

"సరి...ఎంత కావాలి ?"

"భోజనం పెట్టేరు కదా ! ఏభై పైసలివ్వండి."

"చాలా ?" రేఖ కొంచెం వెక్కిరింపుగా అంది, అనిపించింది వింటోన్న గోపాల్‌కి.

"పోనీ ఇరవై అయిదు..."

రేఖ నవ్వుతోంది.

"పోనీండమ్మా మీ ఇష్టం—అన్నట్టు గులాబికి గొప్పు తవ్వుతూంటే ఇది దొరికింది."

ఏమిటో చూద్దామని గోపాలం వెళ్ళేడు.

గాజు.

వర్షాల ముందునించీ కనిపించని రేఖ బంగారుగాజు.

"ఇత్తడిదా అమ్మా ?" అన్నాడు.

"కాదు బంగారం."

"మరలా ఉందేం ?"

"మన్నులో ఉండి నీలాగే ఉండిలే" అంది రేఖ. ఆమె త్వర త్వరగా గాజు శుభ్రంచేసి గోపాల్‌కి చూ పెట్టింది.

నేరం చేసిన మనుషులు...

గోపాల్, రేఖ




ఆ గాజు కనిపించకపోతే పున్నమ్మమీద అనుమానపడ్డారు—నేను తియ్యలేదు అన్నమాట పున్నమ్మ అనలేదు. నువ్వు తీసేవని రేఖగాని గోపాల్‌గాని అనలేదు.

అతని మాటల్లో ఉన్న హింస ఆనేమాటల్లో ఉండదు.

వారం రోజుల తరవాత పున్నమ్మ పని వొదిలి వెళ్ళిపోయింది-చెప్పకుండానే.

ఆ నిష్క్రమణం అనుమానాలని మరికొంత ధృవపరిచింది.

పోలీసులకి రిపోర్టు ఇద్దామనిపించింది.

ఇద్దామంది రేఖ.

వొద్దన్నాడు గోపాలం.

దానిమీద చర్చ చాలా జరిగాక ఇవ్వొద్దంది రేఖ.

ఇయ్యాలని అన్నాడు గోపాలం.

అలాగే చివరికి ఇవ్వలేదు.

గాజు...గులాబీల పొదలల్లో. ఎలాగ పడింది ?

జారి ఉంటుంది.

రేఖ గోపాలం వైపు చూసింది.

గోపాలం రేఖ వైపు చూశాడు.

నువ్వూ దోషివి; నేనూ దోషిని; ఇద్దరం దోషులం అన్నట్టు ఉంది.

కాని, మనం కూడా దోషులం కామేమోనన్న అనుమానం ఉంది ఆ చూపుల్లో. ఆశ ఉంది

"ఏమిటమ్మా అలాగ చూస్తున్నారు ?" అన్నాడు టైగర్.

" పేరేమిటి ?" అంది రేఖ.

"టైగర్" అన్నాడు.

"నిజం పేరు" అంది రేఖ.

"అదే నిజం పేరు" అన్నాడు వాడు.

పదిరూపాయిలనోటు తీసి వాడి కిచ్చి, "ఇదిగో ! పట్టికెళ్ళు" అంది.

"పదిరూపాయలు దేనికమ్మా ! ఏభై పైసలివ్వండి" అన్నాడు.

"నీకు బుర్ర లేదులే. ఈ గాజు ఖరీదెంతో తెలుసా ?" అంది రేఖ.

"ఎంతైతే నాకేమమ్మా !...ఏభై పైసలు ఇవ్వండి, నా పనికి—గాజు మీది..." అంటాడు వాడు.

రేఖకి నవ్వొస్తూంది. ఈ యుగంలో ఈ శకంలో ఇంకా ఈ మాత్రం అమాయకత్వం ఉందంటే ఆమెకి ఆనందంగా ఉంది. వీడు మామూలు జులాయి పిల్లవాడు కాదు-ఆ మాట చూస్తేనే తెలుస్తోంది.

"సరే పో" అంది.

"సరే" అన్నాడు వాడు. రెండడుగులు మెల్లగా వేసి తరవాత త్వరగా వెళ్ళ సాగేడు. గేటు దగ్గరికి వెళ్లేసరికి వాడు వెనుదిరిగి చూడకుండా వెడుతున్నాడు.

"టైగర్ !" అని కేకవేసింది రేఖ, నవ్వాపుకుని.

వాడు వెనుదిరిగి చూడలేదు. గోపాలం గమనిస్తూనే ఉన్నాడు. ఈసారి కొంచెం కంగారుగా, "టైగర్ ! టైగర్ !" అని రెండుసార్లు అరిచింది రేఖ. రెండోసారి భయంగా వినిపించింది పిలుపు కాని వాడు వెనుదిరిగి చూడలేదు.

గోపాలం ఒక్క ఊపున గేటుదాటి వడిగా సాగిపోతోన్న టైగర్‌ని ఇరవై అంగల్లో కలుసుకుని జబ్బ పట్టుకుని ఆపి, "అమ్మగారు పిలుస్తూంటే వినపడ లేదూ ?" అన్నాడు.

"నాకేం వొద్దు" అన్నాడు పట్టు వదిలించే ప్రయత్నంచేస్తూ.

"వొద్దులే-ఒకసారి రా" అన్నాడు గోపాలం.

నిశ్చలంగా నిలబడ్డాడు టైగర్.

"రా."

లాలనగా అన్నాడు గోపాలం

అనిష్టంగానే అడుగులు వేశాడు టైగర్.

రేఖ గేటువైపు ఆత్రతతో చూస్తూ నిలబడింది.

వాడి భుజంమీద చెయ్యి వేసి, "పని కావాలా ?" అంది.

"అవును..."

"మా యింట్లో ఉండు" అంది రేఖ.

వాడు క్షణం ఆలోచించి, "ఉంటాను గాని, గిన్నెలూ అవీ తోమను...ఇల్లు తుడవను" అన్నాడు.

"నీ ఇష్టం వొచ్చిన పన్లు చేస్తావా ?" అంది రేఖ.

"అవును, అన్నాడు టైగర్. రేఖ మాటలాడకపోతే, "మగపన్లు" అన్నాడు వాడు.

ఈసారి ఇద్దరికీ నవ్వొచ్చింది.

"సరే-అలాగే" అంది రేఖ

ఆ నాటి నించీ వాడక్కడే భోజనం. రాత్రి వెళ్ళి ఉదయం ఎనిమిది దాటేక వొస్తాడు...అన్ని పన్లూ చేస్తాడు. వాడి జీతం ఇంత అని రేఖ చెప్పలేదు. వాడడగలేదు. కాని, నెల నెలా వాడి పేరున ఏభై రూపాయిలు బేంక్‌లో వేస్తూంది రేఖ. నెలకి ఒక జత చొప్పున ఈ మూడునెలలూ బట్టలూ కుట్టించింది.

విచిత్రంగా ఇంట్లో ఒక మనిషి అయిపోయాడు టైగర్. రేఖకి వాడిమీద ఎంతో అభిమానం.ఈ మధ్య వాడికి చదువు నేర్పే ప్రయత్నం కూడా చేస్తోంది.

రేఖ వాడితో ఏం చెప్పిందో తెలీదు. గోపాల్ అది తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు.

అతను చేస్తోన్న ప్రయత్నం రేఖని ప్రసన్నం చేసుకునేందుకు. కావాలని తాను పొరపాటు చెయ్యకపోయినా, ఆమె దృష్టిలో తాను నేరం చేసినమాట నిజం.

లేచి వెళ్ళి రేఖకోసం చూశాడు.

ఆమె ఏదో పుస్తకం చదువుకుంటోంది.

వెళ్ళి ఆమె పక్కన కూర్చుని, 'నీకు చాలా కోపంగా ఉంది కదూ ?"

అన్నాడు గోపాలం, జరిగినదంతా పూర్తిగా తెలిస్తే ఆమెకి కోపం ఎక్కువౌతుందో తగ్గుతుందో ఆలోచిస్తూ.

రేఖ "కోపం ఏమీ లేదు" అంది.

"థేంక్స్...అనుకున్నదానికి అంతా విరుద్ధంగా జరిగింది-ఈ రోజు నీతో నవ్వుతూ గడపాలనుకున్నాను...కాని..." అన్నాడు-ఏమనాలో తెలియక.

రేఖ సహాయం చెయ్యలేదు. ఆమె నిశ్శబ్దంగానే ఉండిపోయింది.

"అంచేత నిన్ను...క్షమించమని అడగడానికి వొచ్చేను."

రేఖ ఆశ్చర్యంగా చూసింది.

తానంటే ఎంత అభిమానంగా చూసినా, గోపాల్ ఎప్పుడూ ఇలాగ మాట లాడలేదు. ఉదయం జరిగినదానికి పాపం, అతను పూర్తిగా బాధ్యత తీసుకుంటున్నాడు!

"ఈ రోజంతా నువ్విలాగే నిర్లిప్తంగా కూర్చోడానికి వీల్లేదు-ప్లీజ్!"

రేఖ తల ఊపుతూ," మీరు క్షమాపణ చెప్పాల్సిన అవసరంలేదు" అంది.

"పొరపాటు చేసేక తప్పక అవసరం ఉంది" అన్నాడు రెండు చేతులూ ఆమె భుజాలమీద వేసి రేఖని తనవంక తిప్పుకుంటూ.

అతని కళ్ళలో ఉన్న వేదన ఆమెకి స్పష్టంగా కనిపించింది.

వందలలో రోజులు సహచర్యంలో గడిపినా, గోపాల్ ఇంతగా బాధపడటే దెప్పుడూ.

అతని ప్రవర్తన సామాన్యపరిస్థితుల్లో అనాలోచితంగా కనిపిస్తుంది. ఆ క్షణాని కేదితోస్తే అది చేసెయ్యడం అతనికి అలవాటు...ఆ విషయం రేఖకీ తెలుసును. చేసినదాన్ని గురించి ఎక్కువ ఆలోచించడం, బాధపడడం, అతని పద్ధతి కాదు.

తన విషయంలో...తానతని భార్యగా వొచ్చాక-అతని ప్రవర్తన వేరు. ఏది చేసినా, ఏమన్నా, తరుచు ఆలోచించి చేసే అలవాటు ఆమె గ్రహించింది.

"మీరు పొరపాటు చేసేరని అనుకోను...క్షమించాల్సింది ఏదీ ఉందని నేననుకోను..." అని, ఆగలేక, అతని కళ్ళలోకి చూస్తూ, "నేను ఏమీ బాధ పడడంలేదు...మీరా ఆలోచన మానెయ్యండి" అంది. ఆమె నిర్లిప్తతపోయి ఆ క్షణాలలో కొంత ఆర్ద్రత అనుకోకుండానే రేఖ గొంతుకలోకి వొచ్చింది.

"నిజంగా?" అన్నాడు గోపాల్.

"నిజంగా" అంది రేఖ.

అతని చేతులు మరి కొంచెం బిగుసుకుని, విడిపోయాయి. ఆ సమయాలలో దైహికస్పర్శ ఆమెకంతగా నచ్చదని తెలుసును గనక కాని, గోపాలం ఆమెని తప్పక ముద్దు పెట్టుకుని ఉండేవాడు. అంత రిలీఫ్ వొచ్చింది.

"థేంక్స్..."

"కాస్సేపు నిద్రపొండి."

"అలాగే !"

అతను వెళ్ళిపోయాడు.

రేఖ కొంచెం బాధపడింది. గోపాలం చాలా మధనపడ్డాడని తెలిసినా, అతని అంతరాంతరాలలోకి తన నిర్లిప్తత చొచ్చుకుని వెళ్ళి గాయపరచిందని ఆమె అనుకోలేదు.

ఇందాకటి కొద్ది క్షణాలూ తియ్యగా ఉన్నాయి.

అతనితో గడిపిన క్షణాలకన్నా.

ఏవో పాత పాత క్షణాలు జ్ఞాపకం వొస్తున్నాయి.

ఎందుకో. ఆ జ్ఞాపకాలు ఆవేళ రావాలనిలేదు.

పదినిమిషాలు పుస్తకంమీద మనసు నిలుపుదామని ప్రయత్నించింది రేఖ. కాని, కుదరలేదు.

అతను నిద్రస్తోన్న గదిలోకి వెళ్ళింది. పసివాడిలాగ నిద్రపోతున్నాడు గోపాల్.

కిటికీల తెరలు వేసి, ఫేన్ వేగం తగ్గించి. అశాంతితో వెళ్ళి మళ్ళీ పుస్తకం తీసింది రేఖ

ఆమె మనస తా చిందరవందరగా ఉంది.

అతను నిద్రపోతోన్నందుకు ఆమె సంతోషించింది.

లేకపోతే...అతను మళ్ళీ బాధపడేవాడు.

అందుకే బాగా ఆలస్యంగా అతను లేచేదాకా ఆమె ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంచింది.

టైగర్ తన పనులు ముగించి చదువులో పడ్డాడు.

అదృష్టవంతుడు ! వాడి సమస్యలు తీరనివి కాదు !

వాడినీ శబ్దం చెయ్యనివ్వలేదు రేఖ. తాను ఎలాగో, రావొద్దన్న ఆలోచనలు మళ్ళీ మళ్ళీ వొస్తూంటే, పుస్తకంమీద మనస్సు లగ్నంచేసి వాడిని అదుపులో పెట్టింది.

* * *

రాత్రి డిన్నర్‌కి గోపాలం ఇచ్చిన నీలి సిల్కుచీర కట్టుకుంది. ఆమెకి నగలంటే అంత ఇష్టంలేదు. సింపుల్‌గా అలంకరించుకుని గోపాల్‌తో బయలు దేరుతోంటే నిమిషంపాటు అతను తనవేపు చూస్తూ నిలబడిపోయాడు.

"యు ఆర్ వెరీ బ్యూటిఫుల్."

అన్నాడు గోపాలం...కష్టంగా కదులుతూ. రేఖ చిరునవ్వు సమాధానంగా ఇచ్చి ఏమీ అనకపోయినా, ఆమెకి విచిత్రమైన సంతృప్తి కలిగింది. ఆ క్షణాలలో అతనూ ఎంతో ఆకర్షణీయంగా కనిపించేడు.

డిన్నర్ చాలా చక్కగా జరిగింది.

అందరూ కలిసి పదిమందికన్నా లేరు.

జీవన్ భార్య రాలేదు.

"ఆమెకి సాయంత్రంనించీ తలనొప్పి" అన్నాడు జీవన్. అందరూ అనుగుణంగా సానుభూతి చెప్పేరు.

అతను నిజం చెప్పి ఉంటే, ఎలాటి రియాక్షన్ ఉండేదో!

"నీ దగ్గిర పనిచేస్తోన్న మనిషికి నువ్వు బర్త్‌డే పార్టీ ఇవ్వడం ఏమిటి, మూర్ఖత్వం!" అంది సవిత-అతని భార్య.

"వాళ్ళిద్దరూ నాకు తెలుసును" అన్నాడు జీవన్.

"తెలిస్తే?...దానికి పెద్ద డిన్నర్ ఇవ్వాలా?" అంది సవిత.

"పార్టీలు నాకు కొత్త కాదు" అన్నాడు జీవన్.

"తెలుసును...కాని, అందరూ నవ్వే పనులు చెయ్యడమూ కొత్త కాదు-రేపు మీ ఆఫీసులో తల ఎత్తి ఎలాగ తిరుగుతావు!" అంది సవిత.

"నవ్వే చూద్దువుగాని! నేనంత సిగ్గుమాలిన పని ఏమీ చెయ్యడంలేదు" అన్నాడు జీవన్ కొంచెం ఘాటుగా.

"అదేదో నువ్వే చెయ్యి...నేను రాను" అంది సవిత.

"అందరినీ పిలిచి నువ్వు రాకుంటే బాగుండదు" అన్నాడు, ఓర్పుగా, జీవన్ నూరుకిలోల ఆమె శరీరంలో నూరుకిలోల ద్వేషం ఉంది...ఏమీలేని తనకి పట్టిన ఐశ్వర్యం తాను తెచ్చాననే గర్వం ఉంది ఆమెలో.

"ఇంకా చాలా ఉన్నాయి బాగుండనివి...నేను రాను" అంది, దృఢంగా సవిత. ఒక విధంగా ఇదీ మంచిదేనని అనిపించింది జీవన్‌కి...ఆమె అక్కడికి వొచ్చి రభస చెయ్యొచ్చును. రేఖని గురించి ఆమెకి మంచి అభిప్రాయం లేదు. ఏ సాక్ష్యంగాని ఋజువుగాన్ని ఆమె దగ్గర ఉందో తెలీదుగాని, సవిత ఉండీ ఉండీ రేఖమీద ఒక విసుకు విసురుతూనే ఉంటుంది.

తొమ్మిదికి భోజనాలయి అందరూ వెళ్ళిపోయారు.

చివరి నిమిషాలలో జీవన్ ఒక్క క్షణం రేఖతో ఏకాంతంగా ఉండగలిగాడు...అతిథులందరూ ముందు వెడుతోంటే రేఖతో అడుగులు వేసి, "సుఖంగా ఉన్నావా రేఖా ?" అన్నాడు చిన్నగా.

"మీకు తెలుసు" అంది రేఖ.

"అవును...కాని...నేను చెప్పినది మరిచిపోక...గోపాల్ చాలా ఉత్తముడు...నా ప్రెజెంట్..."

అతను కోటు జేబులోనించి ఎర్రటి టిస్యూ కాగితంలో కట్టిన పొట్లం తీసి త్వరగా ఆమె బేగ్‌లో పడేశాడు.

"ఏమిటది !"

"చిన్న గొలుసు..."

"వొద్దు..." అంది రేఖ

"ఉంచుకో...నా సంతృప్తి కోసం."

"ప్లీజ్ !" అంది రేఖ. ఎందుకో ఆ గిఫ్ట్ తీసుకోడం ఆమెకి సుతరామూ నచ్చలేదు.

"నా కోసం..." అన్నాడు.

మిగిలినవాళ్ళు దగ్గర అయారు.

"త్వరలో-కలుసుకుందాం" అని, జీవన్ వడిగా వాళ్ళతో కలిసిపోయాడు.

అందరూ వెళ్ళారు. రేఖ, గోపాల్ కారులో కూర్చుని హోటల్ బయటికి రాగానే, హటాత్తుగా రేఖ. "అలా బీచ్ వైపునించి పోదామా ?" అంది.

గోపాల్ ముఖంలో ఆనందం స్పష్టంగా చూడగలిగింది రేఖ-ఆమె కేవలం తన కల్లోలమైన ఆలోచనలని అదుపులో పెట్టుకోగలిగేందుకు మాత్రమే అది సూచించినా, అతనికా కోరిక ఆనందప్రదమై ఉండడం ఆమెకి సంతృప్తి కలిగించింది.

అరగంట బీచ్‌లో కూర్చున్నారిద్దరూ-

కెరటాలని చూస్తూ.

ఒకొక్కరి మనసులో కెరటాలు-ఆలోచనల కెరటాలు.

మీది నక్షత్రాలు చూస్తూ.

ఆశల్లాటి నక్షత్రాలు.

జ్ఞాపకాలలాటి నక్షత్రాలు.

చీర ఒంటికి బాగా దగ్గరగా తీసుకుంది రేఖ, చెదురుతోన్న ఆలోచనల్ని మూటకడుతోన్నట్టు.

"చలిగా ఉందా ?" అన్నాడు గోపాలం—దూర దూరాలనించి వొస్తూ.

"అవును" అంది రేఖ.

చెయ్యి పట్టుకుని లేవదీసి కారు దగ్గిరకి నడిచాడు...అక్కడిదాకా ఆమె చెయ్యి అతని చేతిలో ఉండిపోయింది.

"హేపీ బర్త్‌డే" అనుకున్నాడు గోపాల్.

హేపీ.

## 2

రెండు నెలలు మామూలుగా గడిచిపోయాయి వాళ్ళ జీవితంలో.

ఆ రోజు వొచ్చిన మధురక్షణాలు మళ్ళీ రాలేదు...అంత స్పష్టంగా, అంతసేపు.

అంతకు ముందు వాళ్ళిద్దరి మధ్యా ఉన్న దూరం మాత్రం కొంత తగ్గింది—అలా అనిపించింది గోపాల్‌కి. ఆమె కొంచెం తక్కువ నిర్లిప్తత కనబరుస్తోంది. రోజూ ఒక్కసారి అయినా ఆమె చిరునవ్వు నవ్వుతోంది. ఎప్పుడైనా తానే సంభాషణ ప్రారంభిస్తోంది. ఇంట్లో తమ మధ్య తరుచు వొచ్చే నిశ్శబ్దాల సంఖ్యా, పరిమితీ క్రమంగా తగ్గుతోంది.

ఆమె అంటే తనకి ప్రాణం...అని చెప్పాలనిపిస్తుంది ఎన్నోసార్లు. కాని, ఇలాటి మాటలు చెప్పడంలో ఏమీ ప్రయోజనంలేదు. హృదయంనించి హృదయానికి నిశ్శబ్దతరంగాల్లాగ ఆ భావన స్పందిస్తేనే దాని ప్రయోజనం. అరవై వాద్యాల సంగీత ఘోషతో పాడినా ప్రయోజనంలేని మాటలవి.

ఎప్పుడో, ఎలాగో ఆ స్పందన వొస్తుంది.

రేఖకి తాను అర్థమౌతాడు.

రేఖ కేవలం దైహికంగా, సాంఘికంగానే కాకుండా తనదైపోతుంది. ఆ రోజు కోసమే, ఆ ముహూర్తం కోసమే తను ఎదురుచూడడం.

అలా అనుకుంటూ ఆ సాయంత్రం ఇంటికి వొచ్చాడు గోపాలం. ఇంట్లో టైగర్ ఒక్కడే ఉన్నాడు.

"అమ్మగా రెక్కడ ?" అన్నాడు.

"తెలీదు..." అన్నాడు టైగర్.

"ఎప్పుడు వెళ్లేరు ?"

"అయిదు గంటలకి ఇంటికి వొచ్చి...వెంటనే వెళ్ళిపోయారు."

"కార్లోనా ?"

"కాదు...టేక్సీ పిలవమన్నారు.""

కొంచెం ఆశ్చర్యపడ్డాడు గోపాలం. ఎక్కడికి వెళ్ళి ఉంటుంది, రేఖ ? ఇలాగ బయలుదేరి వెళ్ళిపోవడం కొత్త అని కాదు...ఈ పదినెలలు చిల్లర రోజుల్లో ఏడెనిమిదిసార్లిలాగే...

కారు ఎందుకు తీసికెళ్ళలేదు ?

ఇలాగ వెళ్ళినప్పుడల్లా రేఖ కారు తీసికెళ్ళదు.

ఎక్కడికి వెళ్ళి ఉంటుంది ?

డ్రైగర్ టీ తెచ్చేడు.

ఈ మధ్య టీ రేఖ స్వయంగా తెచ్చి ఇస్తోంది. అంతకు ముందు ఇంట్లో ఉన్న సర్వెంటు, ఆ తరవాత డ్రైగర్...

వీడు తెస్తే ఆమె తెచ్చినట్టుండదు టీ.

ట్రే నేలమీద కొట్టి, రేఖ ఎక్కడికి వెళ్ళిందని అరవాలని ఉంది గోపాలంకి. కాని, ఇది తన ఇల్లు...తమ ఇల్లు-తనదీ, రేఖదీని. ఆమె ఇలాటి ఉద్రేకాలని భరించదు...

టీ తాగి గార్డెన్‌లో పచార్లు మొదలుపెట్టేడు గోపాలం.

అతనిలో అశాంతి పెరిగిపోతోంది.

తనకి చెప్పకుండా ఎక్కడికి వెళ్ళింది ?

చీకటిపడుతోంది.

ఆడది. తన భార్య. ఒంటరిగా, ఎక్కడ ఉంది ?

ఒక్కసారి లోపలికి వెళ్ళి రేఖ ఆఫీసుకి టెలిఫోన్ చేశాడు. రేఖ మామూలుగా సాయంత్రమే వెళ్ళిపోయిందని చెప్పేరు.

మళ్ళీ గార్డెన్‌లోకి వొచ్చి కూర్చున్నాడు.

అశాంతి ఎక్కువౌతోంది.

బాగా చీకటిపడిపోయింది.

ఎక్కడికి వెళ్ళేవని రేఖని అడగాలని అతను ఇంతకుపూర్వం కూడా అనుకున్నాడు. కాని, ఆమెకి ఎదురుగా నిలబడి ఆ మాట అడగలేకపోయాడు. వ్యక్తిత్వం ఉన్న మనిషి రేఖ...ఉద్యోగం చేసుకొంటోంది-కావాలని, ఆమెని కష్టపడి వొప్పించి, తాను పెళ్ళిచేసుకున్నాడు. కొంతమంది మిత్రులూ, పరిచ




యస్తులూ, సూటిగా కాకుండా, తిరుగుడు పద్ధతిలో ఆమెని గురించి ఏమేమో సూచించేరు. కాని, రేఖని చూస్తే ఆమె దాచుకోవలసినవీ, రహస్యమైనవీ పనులేవీ చెయ్యదని గోపాల్‌కి చాలా నమ్మిక. అదీకాక అందమైన ఆడదాన్ని చూస్తే అపవాదు వెయ్యడం చాలామందికి అలవాటు

తన చెల్లెలు-స్వంత చెల్లెలు కాకపోయినా, పినతల్లిగారి అమ్మాయి శారద-మీద ఎన్ని అపవాదులు రాలేదు ?

శారద కూడా ఎంతో అందంగా ఉండేది.

ఆమె మనస్సు ఎంతో స్వచ్ఛంగా ఉండేది

తనకి తెలుసును...చెల్లెళ్ళు లేక శారదని తన ప్రాణంకన్నా హెచ్చుగా చూసుకునేవాడు.

పసితనంనించీ శారద తనకోసం ప్రాణం పెట్టడానికైనా సరే సిద్ధంగా ఉండేది.

తనకి బాగా జ్ఞాపకం-చిన్న చిన్న దొంగతనాలు చేసినాసరే, తనకి చెప్పి మొట్టికాయలు తినేదిగాని, ఏ విషయమూ దాచేదికాదు. ఆమెకి వయస్సు వొచ్చినకొద్దీ తనమీద అభిమానం, నమ్మిక, ఎక్కువ అయాయి గాని తగ్గలేదు.

కాలేజీలో అబ్బాయిలంతా ఆమెని ఎలాగైనా పరిచయం చేసుకోవాలనీ, నోట్సు మిషతోనో, మరే కారణంతోనో, ఆమెతో మాటలాడాలనీ చూసేవారు. ఆ విషయాలన్నీ "అన్నయ్యా! ఏమయిందో తెలుసా!" అంటూ, నవ్వుతూ తనతో చెప్పేది. వాళ్ళు ఏడిపించినా తనతోనే చెప్పుకుని ఏడిచేది.

ఆమెలో మలినంలేదు.

తనకి తెలుసును.

ఆ శారదమీద ఎన్ని అభాండాలు వేశారు!

ఆమె పేరూ-మరొకడి పేరూ-గోడలమీదికి ఎక్కించేరు.

ఆమె కనిపించినప్పుడల్లా అరవడం-కుక్కలలాగ.

ఆమెతో గోడల కెక్కిన పేరు మరెవరిదో కాదు-దానికంతకీ కారణం అయినవాడిదే!...వాడు శారద దగ్గర అమర్యాదగా ప్రవర్తిస్తే ఆమె గట్టిగా బుద్ధి చెప్పిందని ఉక్రోషంతో వాడే ఇదంతా చేయించాడు. తనకి అది తెలిశాక వాడికి నమ్మకంగా దేహశుద్ధి చేశాడు గాని, పాపం! శారద ఎంత బాధపడింది! ఆమె బంగారు బొమ్మ అయినా, వొచ్చిన సంబంధాలన్నీ తప్పుతూ వొచ్చాయి. ఏ సంబంధం కుదురుతుందని ఆశపడినా, ఒక ఆకాశరామన్న ఉత్తరం ఆ ఆశని ధ్వంసంచేసేది

ఇప్పుడు అమెరికాలో ఉంది గనక శారద సుఖపడుతోంది గాని, తన దేశంలోనే ఉంటే ఆమె ఆత్మహత్య చేసుకోవలసివచ్చి ఉండేది!

రేఖమీద తనకి ఏ విధమైన అనుమానమూలేదు గాని, చింత ఉంది... అమెకి ఆమే తనకి వివరాలు ఎందుకు చెప్పదు?

అలిసిపోయి కుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చున్నాడు

ఎంతసేపో!

రేఖ అలాగ మాయం అయిపోయింది, తనతో ఏమీ చెప్పకుండానని ఒకబాధ.

రేఖ లేని ఇల్లు వెలవెలబోతుంటే చూసి ఒక బాధ.

ఈ మధ్య కొంతకాలంపాటు రేఖ ఇలాగ వెళ్ళిపోవడంలేదు...అంతకు ముందూ ఆమె లేని ఇల్లు తనని వెక్కిరిస్తూ ఉంది. కాని ఈ మధ్య...రేఖ తనకి ఆ మాత్రం దగ్గరగా వొచ్చిన తరవాత ఈ ఒంటరితనం భరించలేనిదిగా ఉంది.

బయట టేక్సీ ఆగింది.

వీధి దీపపు వెలుగులో రేఖ దిగింది.

యాంత్రికంగా గోపాలం టైము చూశాడు.

గడియారం తొమ్మిదిదాటిన సమయ సూచన చేస్తోంది.

రేఖ గేటు తీసుకుని వడిగా లోపలికి వెళ్ళింది.

గోపాలం అలాగే కూర్చున్నాడు. లోపలికి వెంటనే వెళ్ళాలని లేదతనికి. వెళ్ళి ఆమెతో ఏమి మాటలాడాలో తెలీదు...అసలేమీ మాటలాడాలనిలేదు.

ఇంతగా ప్రేమిస్తోన్న తన నామె ఇలాటి పరిస్థితిలో ఎందుకు పెట్టాలి ?

ఎక్కడికి వెళ్ళి వొచ్చింది ?

వీధి దీపం వేపు చూస్తూ చాలాసేపు అలాగే కూర్చున్నాడు గోపాల్. రేఖ వొస్తుందనీ, సందేహిస్తూ, భయపడుతూ, పిలుస్తుందనీ అతననుకున్నాడు. కాని ఎంతో ఆలస్యం తరవాత టైగర్ వొచ్చి తనని అమ్మగారు భోజనానికి పిలుస్తున్నారని చెప్పడం అతనికి ఆశాభంగం కలిగించింది. గెటవుట్ ! అందామని ఒక్కసారిగా అనిపించినా, ఆ ఉద్రేకాన్ని అణిచిపెట్టుకున్నాడు.

"సరే...నువ్వెళ్ళు" అన్నాడు.

వాడు అలాగే నిలబడ్డాడు.

"వెళ్ళు" అన్నాడు కోపంగా.

వాడు కదల్లేదు...రేఖ చెప్పింది కాబోలు.

అణుచుకోలేని కోపంతో లేచి టైగర్‌ని లెంపకాయ కొట్టాడు గోపాల్. లోలోపల రేఖమీదా, ఆమెని ప్రశ్నించలేని అశక్తతకి తనమీదా రగులుతోన్న కోపం ఆ ఒక్కక్షణ శకలంలో ప్రజ్వలించింది. రెండు చేతుల్లోనూ చెంపలు దాచుకుని, అడుగు మాత్రం వెనక్కి వెయ్యని టైగర్ ముఖం చూడగానే కోపం అలాగే మళ్ళీ తగ్గిపోయింది.

వాడిని లాలించాలనీ, నొప్పిగా ఉందా అని అడగాలనీ, క్షమాపణ చెప్పి పరిహారం ఏమైనా ఇవ్వాలనీ అతనికి అనిపించింది. కాని, అస్పష్టమైన భావన అతన్ని అదేదీ చెయ్యనివ్వలేదు.

త్వరగా లోపలికి వెళ్ళాడు.

డైనింగ్‌టేబిల్ దగ్గర రెండుచేతులూ కట్టుకుని నిలబడి రేఖ తోటలోకి చూస్తోంది.

గోపాల్ చేతులూ, ముఖం కడుక్కుని వొచ్చాడు.

ఆమె వడ్డిస్తోంది.

"నువ్వూ తిను" అన్నాడు.

"తరవాత తింటాను" అంది రేఖ. ఆ కంఠస్వరంలో మాధుర్యమూ లేదు, కర్కశత్వమూ లేదు.

విచిత్రంగా, తనకి ఆకలిగా ఉంది.

ఆమె నిలబడి అడగకుండానే వొడ్డిస్తోంది.

భోజనం ముగించి లేచి వెళ్ళి మరో పదినిమిషాలలో పడుకుని జర్నల్ ఏదో చదవసాగేడు గోపాల్...జరిగినదంతా చెరిపెయ్యాలని ఉంది. రేఖని క్షమించాలని ఉంది. ఆమెనితనదగ్గరగా ఇంకా దగ్గరగా తెచ్చుకోవాలనీ ఉంది.కాని...

బలవంతంగా చదువుతున్నాడు.

ఆలోచనల్ని ఆపుకుని.

ఎంత సేపో.

పది దాటింది. రేఖ రాలేదు. రెండు నిమిషాలు ఆలోచించి లేచి బయటికి వెళ్ళేడు

రేఖ కిచెన్ పక్కన అరుగుమీద కూర్చుంది.

ఆమె వొడిలో టైగర్.

వాడి బుగ్గలు నిమురుతోంది.

సడి అయింది కాబోలు. వెనుదిరిగి చూసింది...గోపాల్‌ని చూసి తానూ పిల్లవాణ్ని లేవదీసి లేచింది.

ఆమె కళ్ళలో కారుణ్యం.

ముఖంలో ఓర్పు.

"గట్టిగా తగిలిందా?" అన్నాడు గోపాల్-మరేమీ అనేదిలేక.

చిన్నగా తల ఊపింది రేఖ.

"రక్తం వొచ్చిందా?"

"కొంచెం...మీ ఉంగరం గీసుకుంది కాబోలు."

"సారీ...ఒక్కక్షణం ఒళ్ళు తెలియలేదు...వాడు...పాపం!"

రేఖ అర్థమైనట్టు తల ఊపి చేతులు కడుక్కుని తుడుచుకుంటూ అతని వేపు తిరిగి, "వాడివేళ ఇక్కడే పడుకుంటే బాగుంటుంది" అంది.

"అవును" అన్నాడు కొంత రిలీఫ్‌తో గోపాల్. ఆమె కొంతయినా తనని క్షమించినట్టు అది సూచనగా తీసుకున్నాడు.

టైగర్ ముఖం ఎర్రగా కంది ఉంది. కాని, పరికించి చూసినా వాడి కళ్లలో ద్వేషం కనిపించలేదు గోపాల్‌కి. బయట అయితేనే పడుకుంటానన్నాడు వాడు. లోపల నిద్రపట్టదట. కేంప్ కాట్, దుప్పటి ఇచ్చి తలుపులు వేసి బెడ్‌రూమ్‌లోకి వొచ్చి పడుకుంది రేఖ.

"నిన్ను చాలా బాధపెట్టేను."

రేఖ ఫాన్‌ని పట్టి పట్టి చూస్తూ ఉండిపోయింది.

"సారీ..."

రేఖ పక్కకి తిరిగి కళ్ళు మూసుకుంది.

ఆమె మనసు నిండా ఆలోచనలు తుఫానల్లాగ సాగుతున్నాయి. కానీ ఏదీ బయటపెట్టేది కాదు.

ఈ రోజు...

టైగర్‌ని గట్టిగా కొట్టేడు గోపాల్.

వాడి బుగ్గమీద రక్తం వొచ్చింది...తన మనస్సు చివుక్కుమన్నది. ముందర ఆ మనిషిమీద చాలా కోపం వొచ్చింది.

కాని...తన కున్నంత అభిమానం లేకపోయినా గోపాల్‌కీ వాడంటే చాలా ఇష్టం. చిన్న చిన్న పువ్వుల పెద్ద దండ అల్లినట్టు ఆ సంఘటన వెనక ఉన్న చిన్న చిన్న విషయాలన్నిటినీ చేర్చి అతని హృదయంలో ఆ క్షణాలలో వొచ్చిన ఆలోచనా శకలాలకి తన కళ్ళల్లో నించే ఒకరూపు ఇవ్వగలిగింది రేఖ. మనసారా టైగర్‌కి పరిచర్యలు చేసినా, ఆమెకి, చిత్రంగా, గోపాల్ మీద కోపం రాలేదు. ఆ మాట అతనికి చెప్పాలని మాత్రం అనిపించలేదు.

నిద్ర వొస్తే బాగుండును...గోపాల్ దీపం తీసేస్తే బాగుండును.

ఆమె లోలోపలి మాటలు వినిపించినట్టు, గోపాల్ దీపం తీసేశాడు. అనుకోకుండా అతనికి ఆమెని ఒక్కసారి తాకాలి అనిపించింది-ఎలాగో.ఆస్పర్శ, ఈ రోజు తామిద్దరి మధ్యా వొచ్చిన చాలా దూరాన్ని కొంత తగ్గిస్తుందని అతని అస్పష్టమైన ఆశ.

లాలనగా అతని చెయ్యి ఆమె చెంప నిమిరింది.

రేఖ చలించలేదు...ఆస్పర్శ ఆమెకి కొంత ఉపశమనం ఇచ్చింది. కాని, ఆమె చలించవలసినంతగా కాదు.

అతను అటు తిరిగి నిద్రకి ఉపక్రమించాడు. ఒకసారి కళ్ళు మూసుకుంటే త్వరగానే అతను గాఢమైన నిద్రలోకి జారుకుంటాడని ఆమెకి తెలుసును. రేఖ మనసులోనే అతనికి ధన్యవాదాలు చెప్పుకుంది. ఎప్పుడు తన జోలికి రాకూడదో అతనికి బాగా తెలుసును.

రేఖ కూడా నిద్రపోడానికి ప్రయత్నించింది.

అంత సుఖవుగా నిద్రరాదు.

పదిగంటలలాగ అనిపించిన పదినిమిషాల తరవాత ఆమె చాలా నెమ్మదిగా లేచి కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుంది.

బయట వెన్నెల నిండుగా కాస్తోంది. నేడో రేపో పౌర్ణిమ అయి ఉండాలి...

గార్డెన్‌లో మొక్కలన్నీ అందంగా నిద్రపోతున్నాయి. వేసవికాలపు వెన్నెల రాత్రిలో ఊరంతా మాటు మణిగి విశ్రాంతి తీసుకొంటోంది. దూరంగా కార్లు అప్పుడప్పుడూ రొద చేస్తున్నాయి.

ఉండీ ఉండీ నైట్‌క్వీన్ పరిమళం ఆహ్లాదకరంగా గదిలోకి వొస్తోంది. కాని ఆమెకి అవన్నీ ఆట్టేసేపు ఆనందం ఇవ్వలేదు.

వెనుదిరిగి మంచంమీద చూసింది.

గోపాల్ నిశ్చలంగా నిద్రపోతున్నాడు. పాపం! అతని మనసు కూడా తనదిలాగానే, గాయపడి ఉంటుంది. కాని దైవానిక్కూడా మంచివాళ్ళ మీద అభిమానం ఉంటుంది. అందుకే అతనలాగ నిద్రపోగలుగుతున్నాడు

తన గాయం వేరు. అతని చిన్న చిన్న గాయాలకన్నా ఎక్కువ లోతైనది సంవత్సరాలనించి ఉంది...ఇంకా ఉంటుంది. ఎప్పటిదాకానో!

ఈరోజు అవన్నీ జ్ఞాపకం చేసుకోవాలనిలేదు. ఈ సుడిగాలిలోనించి తనకి ముక్తి ఉందా లేదా అని మరొకసారి ఆలోచించాలనిలేదు.

కాని, బయట వెన్నెల కాస్తోంది.

నైట్‌క్వీన్ పరిమళాలు ఏవేవో జ్ఞాపకాలు తెస్తున్నాయి.

వాటిని ఆపే శక్తి ఆమెలో లేదు.

ఆ రోజు వెన్నెల నిండు పౌర్ణిమ వెన్నెల. సువాసన నైట్‌క్వీన్ ఒక్కటే కాదు...దానితో గులాబులు కూడా ఉన్నాయి.

ఎందుకో ఆ రోజు మనసంతా కలవరంగా ఉంది.

"ఏమిటయింది నీ కివేళ ?" అంది మాలతి రెండు మూడుసార్లు-ఏమీ లేదంటే ఎందుకో నవ్వి నవ్వి చూసింది మాలతి. తన రూమ్మేట్. తన కంపెనీలోనే ఆమెకీ ఉద్యోగం. తానూ ఆమే కలిసి ఆ చిన్న, రెండు గదుల ఇంట్లో ఉండేవారు.

పట్నానికి ఉద్యోగం చెయ్యడంకోసం రాగానే, పెద్ద దిగులు...అసలు రాగలనా అనే. తనకి ఎంతో భయం.

మరి ప్రకాశం మామ పట్టు పట్టి కూర్చున్నాడు—తాను ఎక్కడా ఉద్యోగం చెయ్యడానికి వీల్లేదని.




అప్పటికి అమ్మ చచ్చిపోయి ఆరునెలలయింది...చచ్చిపోతూ తనని ప్రకాశం మామయ్యకి ఒప్పగించి వెళ్ళింది. "దీని మాట నువ్వే చూసుకోవాలిరా...నీ కూతురితో దీన్ని ఒక ఇంటిదాన్ని చెయ్యరా" అంది, తాలినాడు.

ఆమెకి వేరే దారిలేదు.

ఉన్న ఆస్తి ప్రకాశం చేతిలోనే ఉంది. నాన్న పోయాక వొచ్చే చిన్న పెన్సన్‌కి భూమి మీద వొచ్చే గింజలూ, కొంత డబ్బు జమచేసి తన బి. ఏ. దాకా చదువు సాగించింది అమ్మ. భూముల గొడవలు ఆమెకి తెలీవు. ఏ గొడవలూ ఆమెకి తెలీవు, నిజానికి. అలా అని అమాయకురాలూ కాదు; ఆమె అంటే చాలా మందికి భయం ఉండేది. చాలా కచ్చితమైన మనిషి...ఉన్నది నిష్కర్షగా అనేయడమేగాని, వేరే ఆలోచనలేదు ఆమెకి.

"అలాగే అక్కా! నువ్వు చెప్పాలా?" అన్నాడు సానునయంగా, ప్రకాశం మామయ్య.

"చెప్పాలిరా! నీ గుణాలు నీకు ఉన్నాయి...కాని, నువ్వొక్కడివే నాకు దిక్కయ్యావు" అంది అమ్మ.

అప్పటికి దాని అర్థం తనకి తెలియలేదు.

నెలలోపు నే తెలిసింది.

తన సొంత చెల్లెలి కూతురి మీదే మామయ్యకి కన్ను పడింది-చదువు కున్నది; తల్లి లేనిది అని గౌరవమూలేదు; మమతాలేదు.

అతని పెద్ద ఇంట్లో తన ఉనికి ఇరవై నాలుగ్గంటలూ రక్షణా మార్గాలు వెదకడంతోనే సరిపోయింది. ఇంటి దొంగ...ఆ పైన అతనూ చండశాసనుడు. లోకువగా ఉన్న తన జీవితం.

ఇంట్లో ఊరికే కూర్చోవడమే కష్టం. దానికి తోడు అమ్మమీద బెంగ. వీటన్నిటితోనూ మామయ్య...పులిలాగ కాచి కూర్చుని....

ఎలాగైనా వెళ్ళిపోవాలని అనిపించింది.

అక్కడే ఉంటే ఆత్మహత్య చేసుకోవడం తప్ప శరణ్యంలేదు.

"ఎమ్మే చదువుతాను మామయ్యా" అంది చివరికి ఒకనాడు-అత్తయ్యా, పిల్లలూ అందరూ కూర్చుని ఉండగా.

"నీ కింక చదువెందుకు రేఖా!...మనలో పెద్ద చదువులు అంతగా అలవాటు లేదు...బి. ఏ. అయావుగా! చాల్లే" అన్నాడు మామయ్య.

"కాదు-నాకు ఎమ్మే చదువుకోవాలని ఉంది" అంది రేఖ. కొంచెం కోపంగా అంది

"కోరికలుంటాయి...తీరే విధానం ఉండొద్దూ!" అన్నాడు ప్రకాశం మామయ్య తనని వికృతంగా చూస్తూ.

"అంటే ?" అంది.

అత్తయ్య పిల్లలకి వెళ్ళిపొమ్మని సంజ్ఞ చెయ్యడం చూసింది. వాళ్ళు వెళ్ళి పోయేదాకా మామయ్య మాట్లాడలేదు.

వెళ్ళిపోయాక, "రేఖా! ఏమి పెద్దచదువులు చదివినా, లోకజ్ఞానం లేని మనిషివి నువ్వు" అన్నాడు.

అత్తయ్య తల ఎత్తకుండా పత్తిలోనించి గింజలు తీసి వొత్తులు తయారు చేస్తోంది, దైవం ముందు దీపాలకి.

"ఏమిటి మామయ్యా ?" అంది.

"మీ అమ్మ నా అక్క గనక దానికి కావలసింది నా చేతనైనంతవరకూ సర్దుబాటు చేస్తూ వొచ్చాను...నా డబ్బు అంటే ముట్టదు కనక తనదేనని మభ్య పెడుతూ వొచ్చాను. గాని, మీ నాన్న చేసిన అప్పులు తీరడానికే చాల్లేదు మీ భూములు...మీ అమ్మ నీకు చెప్పడం మరిచిపోయిందేమో...ఏడేళ్ళ కిందటే వాటిని తనఖాలో పెట్టేం-మీ నాన్నకి డబ్బు ఖర్చు ఎక్కువ మరి" అన్నాడు.

"నిజంగా ?" అంది ఆదేమిటో ఏమీ బోధపడక.

"నీ దగ్గర అబద్ధం చెప్తానా ?..." అన్నాడు మామయ్య. ఏడెనిమిది ఎకరాల భూమి ఒక్క మాటతో మాయం చేస్తూ.

"అయితే...నా పేరన..."

"మీ పాత ఇల్లు తప్పితే ఏమీలేదు రేఖా !...అయినా, నువ్వు విచారపడకు. నేనుండగా నీకేలోటూ రానివ్వను-మీ అమ్మకి మాట ఇచ్చేను. అదీకాక నువ్వేం పరాయిదానివి కాదు" అన్నాడు.

తెల్లబోయి చూసింది.

"ఒకటోరకమైన సంబంధం చూస్తున్నాను...మొన్న నాటకం మెచ్చుకున్నావే అందులో హీరో !...ప్రయత్నం కుదిరితే వచ్చే మాఘంలో పెళ్ళి" అన్నాడు మామయ్య.

ఆ 'హీరో' తెలుసును.

వాణ్ని గురించి అరుణ...ప్రకాశం మామయ్య పెద్దమ్మాయి చెప్పింది. ఉండాల్సిన గుణాలన్నీ ఉన్నాయి...నిరక్షర కుక్షి.

"చదువు లేకపోతేనేం ?...లక్షల్లో ఉంది ఆస్తి...అదీకాక నా చెప్పు చేతల్లో ఉంటాడు. చాలా బుద్ధిమంతుడు...మనిషిని చూడనే చూశావుగా !...నువ్వే బెంగ పెట్టుకోకు రేఖా ! అన్నీ నేను చూసుకుంటానుగా !" అన్నాడు.

తన మెడ చుట్టూ పన్నిన ఉచ్చులు ఒకటీ ఒకటీ తెలిసి వొస్తున్నాయి రేఖకి.

ఎంత అజ్ఞానంలో పెరిగినా, ప్రకాశం మాటలకి అర్థం తెలియకపోనంత మూర్ఖత్వం ఆమెలో లేదు.

"నా కింకా పెళ్ళి వొద్దులే..." అంది, మాట బయటికి తెచ్చి.

"మరి ?"

"ఏదో ఉద్యోగం చేస్తాను."

"నేను బ్రతికి ఉండగానా ? అక్క చచ్చిపోయింది; దీనికి పట్టెడన్నం పెట్టలేదని నా పరువు తీసెయ్యరూ, ఊరివాళ్ళు ?" అన్నాడు ప్రకాశం.

"మామయ్యగారి నలాగ బాధపెట్టకమ్మా ! నువ్వు నాకు బరువా, ఆయనకి బరువా ?" అంది అత్తయ్య మెడలో కాసులపేరు సర్దుకుంటూ.

తన కింక అక్కడ మంచి భవిష్యత్తేమీలేదని తెలిసి వొచ్చింది-అంతకు ముందు అనుమానం ఉందని కాదు-ఇంక నిశ్చయం అయిపోయింది.

ఇక్కడ వొదిలి వెళ్ళిపోవాలి.

ఎలాగ ?

ఆ ఊరిలో తా నెరిగినది ఒక్కరే...సుబ్బరామయ్యగారు. ఆయన నాన్నకి చిన్నప్పటినించీ స్నేహితులు...మామయ్య ఊరిలోలేని రోజున వాళ్లమ్మాయిని చూసే మిషమీద అక్కడికి వెళ్ళింది.

ఏమీ దాచకుండా ఆయనకంతా చెప్పింది.

చివరికి ఆపుకోలేని దుఃఖం వొచ్చేసింది.

ఆయన ఓదార్చాడు. ప్రకాశం అంటే ఆయనకి కొంత భయం ఉన్నా,ఆమె అక్కడినించి వెళ్ళిపోడానికి ఏర్పాట్లన్నీ చేశాడు. తన మేనకోడలు మద్రాసులో ఉంది. ఆమె దగ్గరకి వెళ్ళమన్నాడు. ఆ అడ్రసూ, ఆయన ఇచ్చిన కొంత డబ్బు తీసుకుని ఒక సాయంత్రం రేఖ ఇల్లు వొదిలి వెళ్ళిపోయింది. వెళ్ళిన మూడో రోజుకి ఒక ఉత్తరం హైదరాబాదునించి పోస్టు చేయించి పెట్టేరు సుబ్బరామయ్యగారు...తన కోసం వెతకడం వృధా అనీ, ప్రకాశం చేస్తోన్నదీ చెయ్యదలుచుకున్నదీ అమానుషంగా ఉంది కనక తాను ఇల్లు వొదిలి వెళ్ళి పోతున్నాననీ ఉత్తరం సారాంశం. సుబ్బరామయ్య స్వయంగా ఆ ఉత్తరం హైదరాబాద్‌లో పోస్ట్ చేస్తానన్నారు. తరవాత వార్తా పత్రికలలో కూడా తన 'తప్పి పోవడం' గురించి మామయ్య ప్రకటనలు వేశాడుట. ఆయనే రాశారు.

తిన్నగా మాలతి ఇంటికి వొచ్చేసింది రేఖ.

కౌగలించుకుని మరీ స్వాగతం ఇచ్చింది మాలతి. అప్పటికి మాంబళంలో ఒక చిన్న ఇంట్లో అవుట్ హవుస్‌లో ఉండేది. రేఖ మద్రాసు ఇంతకు ముందు వొచ్చి ఉండడాన్న ఇల్లు కొంతలో కొంత సుళువుగానే దొరికింది

మూడో రోజునించి ఉద్యోగ ప్రయత్నాలు సాగించింది రేఖ-మాలతి ఎంతగా తనని ప్రేమించినా, ఆమె మీద ఆధారపడి ఉండడం ఆమెకి ఏమీ ఇష్టంలేదు.

డిగ్రీ ఉన్నంత మాత్రాన ఉద్యోగం దొరకదని ఆమెకి త్వరగానే తెలిసి వొచ్చింది. ఎక్కడికి వెళ్ళినా ఒకటే జవాబు...కొందరు మర్యాదగానూ, కొందరు అమర్యాదగాను చెప్పేరు-ఖాళీలేదు అంతే.

జీవన్ ట్రేడింగ్ కంపెనీకి అలాగే వెళ్ళింది.

వాళ్ళానాడే అడ్వర్టయిజ్ చేశారని ఆమెకి తెలీదు.

అది చూసి వొచ్చిందని వాళ్ళనుకున్నారు

అనాడే జీవన్‌ని చూడడం-

తన గురించిన ప్రశ్నలన్నీ అడిగి అనుకోకుండానే తన జీవిత చరిత్ర అంతా

తెలుసుకున్నాడు జీవన్. "న్యాయంగా మీకు క్వాలిఫికేషన్‌లేదని పంపెయ్యాలి... కాని, ఎందుకో మనసొప్పడంలేదు" అన్నాడు.

మాట్లాడకుండా అలాగే కూర్చుంది.

"పని-చాలా ఉండదు. ప్రస్తుతం మూడు వందల కన్న ఇవ్వలేము..." అన్నాడు జీవన్.

"సరే" నంది రేఖ.

"రేపొచ్చి చేరండి-మా మేనేజరు ఆర్డరిస్తాడు" అన్నాడు జీవన్

నమస్కారంచేసి బయటపడింది రేఖ. ఆనాటితో తన ఆత్మగౌరవం మళ్ళీ దొరికింది...తన కాళ్ళ మీద తాను నిలబడగలదు !

రెండు మూడు మాసాలు ఉద్యోగం చేసేసరికి కొత్త జీవితానికి అలవాటు పడిపోయింది రేఖ. జీవితంలో మాలతి తప్ప ఇంకెవరూలేరు తనకి...ఆమె ఆదరాభిమానాలు, తేలిగ్గా ఆఫీసు పనీ ఆమెకి కొత్త జీవితంలో కొంత సుఖ శాంతులను ఇచ్చేయి.

ఆ పరిస్థితుల్లో ఒక ఆదివారం సాయంత్రం దిగాలుగా కూర్చుంది తాను. ఏమిటో తనకే తెలీని కొత్త అసంతృప్తి, మనసులో.

"ఏమిటయింది నీ కీవేళ ?" అంటూ నవ్వుతుంది మాలతి.

ఏమీలేదు. ఏమీలేదు మాటల్లో పెట్టలేని అసంతృప్తిని ఏమని, ఎలాగ చెప్తుంది ?

"సినిమాకి పోదామా ?" అంది, మాలతి.

"నా కోసం అరుణ్ వొస్తున్నాడు...నువ్వొళ్ళు" అంది మాలతి. అరుణ్ ఆమెకి బంధువూ, స్నేహితుడూను. బేంక్‌లో మాలతితో ఉద్యోగం చేస్తున్నాడు. వాళ్ళిద్దరికీ పెళ్ళి కావడానికి ఎ.తో వ్యవధి ఉండేలాగలేదు. ఆ తరవాత తన మాట ఏమిటని రేఖకి అప్పుడప్పుడు బెంగగా ఉంటుంది.

"నేనొక్కతెనీనా ?" అని అనబోయి ఆగిపోయింది. క్రిందటిసారి అరుణ్ వొచ్చినప్పుడు మూడో మనిషిగా రేఖ చాలా ఇబ్బందిపడింది-సాయంత్రం వాళ్ళిద్దరూ పార్కుకి వెళ్ళినప్పుడు తానే వెళ్ళి ఉండాల్సింది అనుకుని విచారించింది.

"గుడ్..." అని, పిక్చరూ, థియేటరూ పేపర్లో చూసి నిర్ణయించుకుని బయలుదేరింది రేఖ. హిందీ పిక్చరైతే టికెట్ దొరకొచ్చునని ఒక హిందీ పిక్చరు సెలెక్టు చేసుకుంది.

అరున్నరకి పిక్చరు.

ఎంతకీ రానిబస్సులూ, వొచ్చీరాని భాషలో తెలియని దారి అడిగేక్రమా- అన్నీ కలిసి ఆమె థియేటర్‌కి చేసేసరికి ఏడవబోతోంది. బుకింగ్ క్లోజ్... హౌస్‌ఫుల్ బోర్డులు చూసి, ఒక్కసారి నీరసపడి అక్కడున్న బల్లమీద కూర్చుంది రేఖ.

ఎక్కడికి వెళ్ళడం ?

రాత్రి తొమ్మిదిన్నరలోపున ఇంటికి వెడితే బాగుండదు...

ఇవేళ సినిమాకి వెళ్ళాలనీ ఉంది...

ఎండలో వొచ్చిందేమో, అలిసి కళ్ళు మూసుకుంది రేఖ–మళ్ళీ తెరవాలని లేదు. అంత అలసట.

"హల్లో, మిస్ రేఖా !"

ఎక్కడో విన్న గొంతుక. కళ్ళు తెరిచి చూసేసరికి, జీవన్.

లేచి నిలబడి నమస్కరించింది. రోజూ నాలుగైదుసార్లు కాగితాలతో అతని దగ్గరకి వెళ్ళినా, అతను మిస్ రేఖా అనే పిలుస్తాడు.

"సినిమాకి వొచ్చారా ?" అన్నాడు జీవన్.

"అవునండీ" అంది రేఖ, వివరాలు చెప్పడం ఇష్టంలేక.

"మరి? ఇక్కడే ఉన్నారేం?"

"—టికెట్ దొరకలేదు."

"ఒక్కరే వొచ్చారా?"

"అవును..."

వాచీ చూసుకున్నాడు జీవన్.

"రండి నా దగ్గర టికెట్స్ ఉన్నాయి."

"మరి...మీ ఫ్రెండు..."

"ఫ్రెండు కాదు. నా భార్య వొస్తానంది. ఇంక రాదన్నమాట - ఆవిడకి అలవాటేలెండి...రండి."

వెళ్ళి కూర్చున్నారు. పిక్చరప్పుడే ప్రారంభిస్తున్నారు. లోపల చల్లగా ఉంది. ప్రాణం లేచి వొస్తోంది.

"హిందీ తెలుసునా?"

"కొంచెం...కొంచెం."

"తెలియనిచోట అడగండి."

అతి మర్యాదగా చెప్పేడు. పొరపాటున కూడా అతను రేఖకి తగలకుండా కూర్చుని సినిమా చూశాడు.

ఆదిమానవులు




ఇంటర్వెల్‌లో బయటికి తీసికెళ్ళి కూల్‌డ్రింక్, చాక్‌లెట్స్ కొని ఇచ్చాడు. ఆమె మనసారా వద్దంటున్నా, ఒప్పుకోలేదు.

సినిమా ముగిశాక "మీ ఇల్లెక్కడ?" అన్నాడు.

చెప్పింది.

"పదండి-డ్రాప్ చేస్తాను" అన్నాడు జీవన్-కారు తలుపు తీస్తూ.

"వద్దండీ. బస్‌లో వెళ్ళిపోతాను" అంది రేఖ.

"ఫరవాలేదు-టి నగర్ ఏ మాత్రం దూరం?...రండి, దయచేసి" అన్నాడు. రేఖ ఇంక వాదనమాని కూర్చుంది.

"మీరు...ఒంటరిగా ఉంటున్నారా?" అన్నాడు జీవన్ దారిలో.

"లేదు-మరో అమ్మాయితో..."

"అలాగా!-సౌకర్యంగా ఉందా?"

"ఉంది."

ఆమె వొద్దంటున్నా, మెయిన్ రోడ్డు వొదిలి రేఖ ఇంటిదాకా వెళ్ళి మరీ వొదిలి వెళ్లేడు.

అరుణ్ అప్పుడే వెళ్ళడానికి సిద్ధమౌతున్నాడు.

అతను వెళ్లగానే, మాలతి రేఖ దగ్గరికొచ్చి, "సినిమా ఎలాగ ఉంది?" అంది.

"బాగానే ఉంది "

మళ్ళీ నవ్వుతోంది మాలతి.

"చాలా బాగున్నట్టుంది" అంది.

"ఏం ?"

"ఈ మూడు నెలల్లో ముఖం ఇంత ఆనందంగా ఎప్పుడూ వెలగలేదు ... అందుకు" అంది.

"నిజంగా?" అంది రేఖ. ఈ సాయంత్రం తానెందుకో చాలా ఉల్లాసంగా ఉన్న సంగతి ఆమె నిజంగానే గమనించలేదు.

"నిజం!" అంది మాలతి.

రాత్రి నిద్రపోయే ముందు రేఖ ఆలోచనల నిండా జీవన్ ... ఏదో తెలీని సంతోషం.

మర్నాడుగాని, మరెప్పుడుగాని, జీవన్ నిన్న జరిగినది తెలిసినట్టే ప్రవర్తించలేదు.

ఆ నెలాఖరుకి ఆమె ప్రొబేషన్ ముగిసింది.

ఐదు వొందల రూపాయిలయింది జీతం.

"థాంక్స్" అంది ఆర్డరు చూసి.

"యూ డిజర్వ్ ఇట్" అన్నాడు జీవన్.

అప్పటి కతనంటే గౌరవం, కొంత అభిమానంకన్న ఏ భావాలూ లేవు- కాని, అతన్ని గురించి తరుచూ ఆలోచించేది. ఇలాగే వెన్నెలలోకి చూస్తూ, గులాబుల వాసనా, నైట్‌క్వీన్ వాసనా కలిసిన గాలి పీల్చేటప్పుడు వేడివేడి అసంతృప్తి మధ్యన అతను జ్ఞాపకం వొచ్చేవాడు. మరి, ఆ సినిమాకి వెళ్ళిన ఆదివారం ఆ వాసనల చెలిమితోనే నిద్రపోయింది.

"ఇంకా నిద్రపోలేదా, రేఖా?"

గోపాల్ ఎప్పుడు లేచాడో తెలీదు.

కష్టంగా ప్రస్తుతానికి వొచ్చి, "నిద్ర రాలేదు" అంది.

"రా...ఇంక నిద్రపో ... అలిసిపోయావు" అన్నాడు గోపాల్. ఆమెని లేవదీసి మంచం దగ్గరికి తీసికెళ్ళాడు.

రాత్రి బాగా చల్లబడింది.

భుజాలదాకా దుప్పటి కప్పి, అతను మళ్లాని ద్రపోయాడు. కొంతసేపటి తరువాత రేఖ కూడా నిద్రపోయింది.

### 3

మర్నాడు ఆదివారం.

ఆ ఇంట్లో ఆదివారం ఒక పద్ధతీ, మిగిలిన రోజులన్నీ మరొక పద్ధతిని.

ఉదయం అలారమ్ కొట్టదు ఏ గడియారమూను.

అంతా తీరుబాటుగా ఉంటుంది.

రేఖ నిద్రలేచేసరికి తొమ్మిదయింది. డైనింగ్‌రూమ్‌లోకి వచ్చి టీ చేసుకుని తాగింది.

గోపాల్ ఇంట్లో కనిపించలేదు.

అటూ ఇటూ చూస్తే గార్డెన్‌లో పనిచేస్తూ కనిపించాడు. రైగర్ అతనికి సహాయం చేస్తున్నాడు.

ఇద్దరూ నవ్వుతున్నారెందుకో.

రేఖ మనస్సులోంచి ఒక బరువు తీసేసినట్లైంది.

టీ తాగి లేచింది. ఇల్లంతా కొత్తగా ఉంది.

ఫర్నిచర్ అంతా అటూ ఇటూ మార్చి ఉంది. కర్టెన్లు కొత్తవి, శుభ్రంగా ఉన్నాయి. ప్రతి గదిలోనూ ఫ్లవర్‌వాజ్‌లో పువ్వులు, కళకళలాడుతూ.

ఇదంతా చెయ్యడం రైగర్‌కి చేతకాదు.

గోపాల్ చేశాడు.

ఇల్లు ఎంత అందంగా ఉంటే రేఖకి అంత సంతోషం. కాని, తరచు ఆమె ఇవన్నీ చేసుకోలేకపోతుంది.

గోపాల్ ఫేక్టరీనుంచి వొచ్చేసరికి అలిసిపోయి ఉంటాడు-అంచేత ఆమెకి కావలసినంత నీట్‌గా ఉండదు ఇల్లు. ఇవేళ ఎంతో బాగుంది

డ్రెస్సింగ్ టేబిల్‌మీద నిన్న చిందరవందరగా పడిఉన్న సామాగ్రులన్నీ శుభ్రంగా అమర్చి ఉన్నాయి.

అద్దంమీద చిన్న కార్డు "ఐ లౌ యు" అంతే.

అది గోపాల్ దస్తూరీలో ఉంది.

రెండు నిమిషాలు అలాగే చూస్తూ ఉండిపోయింది రేఖ. ఇంతగా గోపాల్ ఎప్పుడూ తన భావన వ్యక్తం చెయ్యలేదు. అతనికి తనమీద ఎంతో ఆప్యాయత ఉందని ఆమెకి తెలుసు...కాని...

స్నానంచేసి శుభ్రమైన బట్టలు వేసుకున్నాక పునర్జన్మలాగ ఉంది రేఖకి. నిన్నంతా జరగనట్టే ఉంది.

గోపాల్ తనని క్షమించినట్టే ఉంది.

కిటికీలోనించి బయటకి చూసింది. వాళ్ళిద్దరూ ఏదో చర్చిస్తున్నారు. టైగర్ గోపాల్‌ని క్షమించినట్టే ఉంది.

కిటికీ దగ్గర కుర్చీ వేసి ఉంది.

కూర్చుంటే గార్డెన్ కనిపిస్తోంది.

బయట ఎండగా ఉంది. గదిలో ఫేన్ కింద చల్లగా ఉంది. మనస్సు మట్టుకు వేడి ఎక్కుతోంది.

హటాత్తుగా గోపాల్ తనవైపు చూసి చెయ్యి ఊపేడు.

చిరునవ్వుతో, అనుకోకుండానే ఆమెకూడా చెయ్యి ఊపింది- చేతిలో ఉన్నవి అక్కడ పడేసి, గోపాల్ కిటికీ దగ్గరికి వొచ్చాడు-అతని ముఖం నిండా చెమట, మన్ను.

"లంచ్‌కి పోదాం...వంట చెయ్యకు" అన్నాడు.

ఆలాగేనని, "ఎండగా ఉంది; లోపలికి రండి" అంది.

"వొస్తాను...ఇంకొక్క మొక్క పాతేసి. పొద్దున్న వెళ్ళి పది మొక్కలు-వాలావరకు క్రోటన్స్ కొనుక్కుని వొచ్చేను" అన్నాడు గోపాల్. చిన్నపిల్లవాడు తాను చేసిన ఘనకార్యం తల్లితో చెప్తోన్నట్టు.

"త్వరగా వొచ్చేయండి" అంది రేఖ.

"పది నిమిషాలు" అన్నాడు గోపాల్.

రేఖ గోపాల్‌ని చూస్తూనే మరోసారి 'పది నిమిషాలు' అనుకుంది.

ఎంతో కాలంకిందటలాగ ఉంది; కాని రెండు సంవత్సరాలు కూడా పూర్తి కాలేదు.

"పది నిమిషాలు...నన్నిక్కడ కూర్చోనివ్వండి" అంటూ ఒకనాడు చీకటిపడ్డాక వొచ్చాడు జీవన్, మాలతి వాళ్ళ చుట్టాల ఇంటికి వెళ్ళింది. ఆమె కోసం ఎదురుచూస్తోన్న రేఖ హటాత్తుగా జీవన్ గదిలోకి రావడం చూసి ఆశ్చర్యపడింది.

"కూర్చోండి..." అంది తాను లేచి నిలబడుతూ.

"మీరు కూర్చోండి...ఒక గ్లాసు మంచినీరు తప్ప మరేమీ అక్కరలేదు నాకు..." అన్నాడు జీవన్.

మంచినీరు తెచ్చి యిచ్చింది. అలా హటాత్తుగా జీవన్ ఎందుకు వచ్చాడో అర్థంకాలేదు. సినిమానుంచి ఇంటికి తీసుకొచ్చి వొదిలిన ఆ రోజు తరవాత మళ్ళీ ఆఫీసు బయట ఇదే కలియడం.

"దయచేసి కూర్చోండి" అన్నాడు జీవన్. ఆమె కూర్చున్నాక, "పది నిమిషాలు మీతో మాటలాడి వెళ్ళిపోతాను. మీకేం ఇబ్బంది ఉండదుకదా!" అన్నాడు.

ఉండదని తలఊపి సూచించింది.

"థేంక్స్. మీరు నా కంపెనీలో పనిచేస్తూండడంవల్ల మీ మీద కూడని అధికారం చెలాయించడంలేదు నేను...ఎందుకో, మీ దగ్గర కూర్చుంటే నాకు శాంతిగా ఉంటుంది. అందుకే, మానసికంగా ఈ రోజు మరీ బాధగా ఉండి, ఇక్కడికి వొచ్చాను" అన్నాడు పడక కుర్చీలో వెనక్కి జారబడి కళ్ళు మూసుకుని, జీవన్.

ఆ రోజు అతన్ని నాలుగైదుసార్లు ఆఫీసులో చూసింది రేఖ - ఎందుకో అతను రోజూలాగ లేడని అనుకుంది. పని ముమ్మరంగా ఉండటంచేత అనుకుని సరిపెట్టుకుంది.

"మీ స్నేహితురాలు ఎక్కడ?" అన్నాడు, కళ్ళుతెరిచి, జీవన్.

"చుట్టాల ఇంటికి వెళ్ళింది."

"ఒంటరిగా, చీకటిపడ్డాక, మీకు భయం వెయ్యదూ?" అన్నాడు జీవన్.

"వెయ్యదు-చుట్టూ ఇళ్ళు ఉన్నాయి కదా!" అంది రేఖ.

"మీరు సుఖంగా ఉన్నారా?" అన్నాడు జీవన్.

కొంచెం ఆశ్చర్యపడి, జవాబుకోసం వెతుక్కుని, "బాగానే ఉన్నాను.ఇ. సుఖమంటారా...ఎక్కడి కక్కడే!" అంది రేఖ ఒక్క క్షణంలో తన జీవితాన్ని విమర్శించుకుంటూ.

ఆమె ముఖంలోకి తేరిపార చూస్తూ, "నిజమే...సుఖం అంటూ ఏమీలేదు... ఇవన్నీ వొదిలి ఏ హృషీకేశమో పారిపోవాలనిపిస్తుంది నాకు తరుచు—" అన్నాడు జీవన్.

రేఖకి ఏమనాలో తెలియులేదు. జీవన్ అలిసి ఉన్నాడు. మానసికంగా మరీ అలిసి ఉన్నాడు.

"మీకు ఆశ్చర్యంగా ఉంది కాదూ?...నా కింత డబ్బూ...అధికారం, అటు ఇల్లూ, సంసారం...దైవమిచ్చిన ఆరోగ్యం, అన్నీ ఉండి ఈ వైరాగ్యం

నే నెవర్నీ మోసంచేసే ప్రయత్నంలాగా ఉంటుంది" అన్నాడు. అవు కొంటున్న బాధ రేఖ గ్రహించగలిగింది.

"మీరు మోసం చేస్తారని అనుకోను...మిమ్మల్ని తెలిసిన ఎవరూ అలాగ అనుకుంటారనుకోను." అనుకోని అభిమానం వొచ్చింది రేఖ గొంతుకలోకి.

"థేంక్స్...నేను మోసగాడిని కాను. నాకున్న కొద్దిమంది మిత్రులకే అది తెలుసును. కాని-ఆవిడ ఏమో అనుకుంటుంది. ఏం చేసేది!" అన్నాడు. ఆమె అంటే అతని భార్య అయి వుండాలి.

రేఖ ఏమీ జవాబియ్యలేదు.

జీవన్ అనకూడని మాట అనినట్టు కొంతసేపు మాట్లాడకుండా అలాగే కూర్చున్నాడు.

ఏ మగవాడూ ఆస్తికోసం భార్యని తెచ్చుకోకూడదు, మిస్ రేఖా! ఏ మనిషికీ అమ్ముడుపోవడంకన్న నీచమైన నుదుటిరాత ఉండదు. పదే పదే జ్ఞాపకంచేసి ఆమె నా జీవితం ధ్వంసం చేస్తోంది. నిజమే-నా ఆస్తులన్నీ ఆమెవే కాని ..ఆ మాట అస్తమానమూ వినడం బాధాకరంగా ఉంటుంది."

ఎందుకివన్నీ చెప్తున్నాడు, అనుకుంది రేఖ. అతనికెంతమంది స్నేహితులైనా ఉంటారు తన ఆఫీసులో చిన్న ఉద్యోగం చేసుకుంటోన్న రేఖకి అదంతా ఎందుకు చెప్పాలి?

నిజంగా, తనతో చెప్తే అతని మనోవ్యధ తగ్గితే తనకేమీ అభ్యంతరంలేదు.

"ఈ రోజు ఏం జరిగిందో చెప్పాలని లేదు ... పాపం మీరు ఇవన్నీ విని బోర్ అవుతున్నారు. నా స్వార్థాన్ని క్షమించండి ... మళ్ళీ ఏమైనా సినిమా చూశారా?"

అలాగ మరో దారిపట్టింది సంభాషణ. రేఖకి ఇది చాలా రిలీఫ్‌గా ఉంది. ఎవరి వ్యక్తిగత జీవితంలోకైనా తొంగిచూడడం సంతోషకరమైనదికాదు. అందులో సౌందర్యహీనమైన జీవితాల రహస్యాలు మరీ బాధాకరంగా ఉంటాయి.

ఆ తరవాత పది నిమిషాలు చాలాసార్లు గడిచాయి ... అతను రేఖచేత చాలా మాట్లాడించేడు.

ఆ మాటల్లో ముఖ్యమైన విషయాలేమీ లేవు, కబుర్లు...అంతే.

కాని క్రమంగా రేఖ సంభాషణలో నిమగ్నమైపోయింది-అతడు పరిసరాలనీ, తన పరిస్థితులనీ కాలగమనాన్ని మరిచిపోయాడు. ఎన్నో సంవత్సరాలనించి

ఆదిమానవులు




ఒకరికొకరు చెప్పదలచుకున్న మాటలు దాచుకుని దాచుకుని ఒకసారి చెప్పుకున్నట్టుంది

గడియారం చూసుకుని, "అరే! పదయిపోయింది..." అన్నాడు లేచి నిలబడుతూ జీవన్.

రేఖ కూడా ఆశ్చర్యపడింది.

"పది నిముషాలంటూ రెండు మూడు గంటలు మిమ్మల్ని కూర్చోబెట్టాను. క్షమించండి. మీతో మాట్లాడుతుంటే అన్నీ మరిచిపోయాను. తలమీద నుంచి పెద్ద బరువు తీరింది...ధన్యవాదాలు" అని, రేఖకి నమస్కారం చెప్పి త్వరత్వరగా, వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు జీవన్.

అతను వెళ్ళిన వేపే చూస్తూ నిలబడింది రేఖ.

కారుమబ్బుల్లాంటి ముఖంతో వొచ్చి, కలకలలాడుతూ వెళ్ళిపోయాడు జీవన్. అతన్ని చూడగానే కలిగిన ఆశ్చర్యం ఆమెలో క్రమంగా నిర్వచనం తెలీని ఆప్యాయతగా మారిపోయింది.

గడిచిన గంటలు తియ్యగా ఉన్నాయి.

ఏదో తెలీని శక్తి ఆమెని ఎటో లాగుతోంది.

"ఆయన వెళ్ళిపోయాడా?" అంటూ వచ్చింది మాలతి, రేఖని ప్రస్తుత ప్రపంచంలోకి తెస్తూ.

"వెళ్లేరు" అని, "నీ కెలాగ తెలుసును?" అంది రేఖ.

"రెండు గంటల కిందట వొచ్చాను...మీ రిద్దరూ ప్రపంచంలో మరేమీ లేనట్లు మాట్లాడుకుంటున్నారు...అలా వెళ్ళి నాలుగిళ్లలో తెలిసినవాళ్ళని పలకరించి వొచ్చాను" అంది మాలతి నవ్వుతూ.

"సారీ...నువ్వు రావడం నేను గమనించలేదు" అంది రేఖ.

"అదే నేనంటూన్నదీని!" అంది మాలతి చిరునవ్వుతో.

"నవ్వేదేమీ లేదిందులో" అంది రేఖ.

"అవును, కాని చిరునవ్వులు చాలా ఉన్నాయి-పద! వంట చేసుకుందాం. మనస్సునిండా ఎంత ఉన్నా ఉదరంలోకూడా వుండాలి కదా!" అంది మాలతి.

ఆ నాడు తనలో కలిగిన తియ్యటి భావన ఈనాడు జ్ఞాపకం ఉంది.

రేఖ ముఖంనిండా ఇప్పుడు చిరునవ్వు కనిపించింది.

"ఆ చిరునవ్వుతో ఎంతో అందంగా ఉన్నావు?" అన్నాడు గోపాల్.

ప్రస్తుతానికి వొచ్చి, "ఎంతసేపైంది మీరు వొచ్చి?" అంది రేఖ.

"ఏమో! అలాగ నీవేపు చూస్తూ నిలబడ్డాను గాని, గడియారం వేపుకాదు." అన్నాడు గోపాల్.

"సారీ!" అంది రేఖ.

"దేనికి?...అంత చక్కటి చిరునవ్వు తరవాత సంతోషమే గాని విచారం ఎందుకు?...కాదూ రేఖా?" అన్నాడు గోపాల్.

ఆ చిరునవ్వు అతనికోసం వొచ్చిన సూర్యకాంతి కాదనీ, ఎవరి కాంతో తనమీద ఈ క్షణాలలో ప్రతిఫలించిన చంద్రకాంతి అనీ ఆమె ఎలాగ చెప్తుంది?

"బయటికి వెడుతున్నారా?" అంది రేఖ. మాట మార్చడానికి.

"అవును... ఒక్కసారి ఫేక్టరీకి వెళ్ళిరావాలి ... ఫోనొచ్చింది" అన్నాడు గోపాల్. రింగ్ వినిపించనేలేదు రేఖకి.

"ఆలశ్యం అవుతుందా?"

"ఆవదు...పది నిమిషాలు పని..." అని వెళ్ళిపోయాడు గోపాల్.

అతను వెళ్ళిపోయాక అతనికి బ్రేక్‌ఫాస్ట్ ఇవ్వలేదని జ్ఞాపకం వొచ్చి నొచ్చుకుంది రేఖ.

డైనింగ్ టేబిల్‌మీద హాట్ కేరియర్‌లో ఇడ్లీ ఉంది. చూసి, మళ్ళీ మూత

పెట్టేసింది నిన్న అంతకోపం వొచ్చి, తనని ద్వేషించడానికి అంత కారణం ఉన్న మనిషి ఎంతగా తనకోసం ఇవేళ ఏర్పాట్లు చేస్తున్నాడు! ఆ మధ్య ఏదో మాటల సందర్భంలో, గార్డెన్‌లో ఇంకా రంగురంగుల క్రోటన్స్ ఉంటే బాగుండునని అన్నది. ఇవేళ ఇంత ఎండలోనూ గోపాల్ ఎందుకు శ్రమపడ్డాడో ఆమెకి తెలుసును. ఉదయం ఏ అయిదుకో లేచి ఉంటాడు.

"అమ్మా!" అంటూ లోపలికి వొచ్చేడు డ్రైగర్.

"ఏం?" అంది రేఖ.

చిన్న కవరు.

చించి చూసింది.

ఆ నాటి తేదీ.

"డియర్ రేఖా!

మన జీవితంలో నిన్నటిరోజు లేదు.
మరిచిపో.

నీ విషయంలో దుర్బలమైన ఆలోచనలు రావడం నాదే దురదృష్టం.

ఎంత సిగ్గుపడుతున్నానో చెప్పలేను మాటల్లో.

క్షణికోద్రేకంలో చాలా పొరపాట్లు చేశాను...

నిన్ను ప్రేమించడం తప్పు.

నీ
గోపాల్

మళ్ళీ మళ్ళీ చదివింది.

గోపాల్! గోపాల్! అనుకుంది.

ఎంత లోతైన మనిషి!...

ఆ క్షణంలో చాలా నీరసం అనిపించింది రేఖకి.

అలాగే కుర్చీలో కూర్చుంది. గోపాల్...

మళ్ళీ ఉత్తరం చూసింది.

'నిన్న'టి రోజు లేకపోతే బాగుండును.

గోపాల్ కేమి తెలుసును? పాలవంటి మనసు అతనిది. చంటివాడి స్వభావం అతనిది.

తాను కోరుకొంటూంది నిన్నటిరోజు ఉండకపోయి ఉంటే బాగుండునని కాని, అతని కారణాలు వేరు, ఆమె కారణాలు వేరు.

ఒకప్పుడు రేపటి రోజు లేకుంటే బాగుండును అన్నాడు జీవన్. తనకి అలాగే అనిపించింది. తానూ అలాగే కోరుకున్నది.

ఆ రోజు స్పష్టంగా జ్ఞాపకం ఉంది.

ఇలాగ ప్రకాశంగా, వేడిగా లేదు అప్పుడు.

ఆకాశం నిండా మేఘాలు. రోజంతా చిన్న చిన్న చినుకులూ, వర్షమూ పడుతూనే ఉన్నాయి. రోజంతా ఆఫీసులో కష్టంగానే గడిచింది. ఎందుకో, మబ్బు వేసినా, వర్షం వొచ్చినా, తన మనసు మబ్బుపట్టిపోతుంది.

ఎప్పుడూ లేనిది జీవన్, "ఏం అలాగ ఉన్నారు?" అన్నాడు, రేఖా అని పలకరించి. 'మిస్ రేఖా' వొదిలేసి నందుకు ఆమెకి చాలా సంతోషం అనిపించింది.

"ఏమీ లేదు" అంది.

సాయంత్రం ఆఫీసు వొదిలి వెళ్లేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. బస్‌స్టాప్ దగ్గరికి వెళ్లేసరికి కొంత తడిసింది.

బస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడింది. షెల్టరులోకికూడా చిన్న తుంపరలు వొస్తూనే ఉన్నాయి.

ఎంతకీ బస్ రాలేదు. టేక్సీలో పోతే ఏడెనిమిది రూపాయలు తక్కువకాదు. తాను భరించలేని ఖర్చు... టేక్సీలు కూడా దొరికేలా లేవు.

అలా అరగంట పైన నిలబడ్డాక జీవన్ కార్లో వొచ్చి, "కమిన్" అన్నాడు కారు తలుపుతీసి పట్టుకుని.

ఎంత రిలీఫ్‌తో కార్లో కూర్చుంది! మరో పదినిమిషాలలాగే ఎదురుచూడాల్సి ఉంటే ఆమెకి కన్నీళ్లు వొచ్చి ఉండేవి.

"చాలా అలిసిపోయారు మీరు" అన్నాడు ఆప్యాయంగా, జీవన్.

"అవును. దేవుడిలాగ వొచ్చారు" అంది రేఖ.

"మీరు వెళ్ళిన వెంటనే ఆఫీసు వదలలేకపోయాను...స్వార్థంతోనే మీరిక్కడ వెయిట్ చేస్తూ ఉండాలని ఆశించాను" అన్నాడు జీవన్ చిరునవ్వుతో. హటాత్తుగా పెద్ద వర్షం ప్రారంభమైంది.

"బస్సు దొరక్కపోవడం మంచిదైంది" అంది రేఖ.

"ఇద్దరికీని...బాగా తడిశారా?" అన్నాడు జీవన్.

"అంతగా లేదు."

"కాఫీ తాగి పోదాం."

"మీ ఇష్టం"

తాజ్‌కి తీసికెళ్లేడు. కాఫీ, దానితో రెండు మూడు రకాల టిఫిన్లు - లోపల చల్లదనానికి వొణికింది రేఖ.

"సారీ...తడిసినమీద ఇక్కడ ఏ. సీ.లో మరీ చల్లగా ఉంటుంది" అన్నాడు జీవన్. అతని ముఖంలో ఆత్రత చూసి జాలిపడింది రేఖ.

నిమిషంలో ఆమెకి బాగానే ఉంది.

చుట్టుప్రక్కల ఒక రిద్దరికన్న లేరు.

సన్నగా సంగీతం ఏ మూలనించో వినిపిస్తోంది.

వేడి వేడి కాఫీ తాగేక శరీరంలోకి కొంత వెచ్చదనం వొచ్చింది.

జీవన్‌కి దగ్గరగా కూర్చుంటే, అతని సాహచర్యంలో మనస్సులోకి వెచ్చదనం వొచ్చింది.

అతను చిన్న గొంతుకతో ఏదో మాట్లాడుతున్నాడు.

ఉండీ, ఉండీ తానూ ఏదో చెప్తున్నది.

జ్ఞాపకం ఉంచుకోవలసిన వేవీలేవు ఆ మాటల్లో.

మరిచిపోయేవి ఏవీలేవు ఆ క్షణాలలో.

తనకి జీవన్‌కి మధ్య ఏమీ తెరలు లేనట్టు ఉంది, ఆ పరిసరాలలో. అతని మాటల్లో మర్యాదా, ఆప్యాయతా కలిసి ఉన్నాయి. ఆ సాహచర్యంలో ఆమెకి ఎంతో మాధుర్యం కనిపించింది.

చివరికి, పరిమితి తెలియని ఎన్నో నిమిషాల తరవాత లేచి బయటికి వెళ్ళి కారులో కూర్చున్నారిద్దరూ. బయట వర్షం పడుతూనే ఉంది.

"పదండి...ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు జీవన్.

ఇల్లు దగ్గర అవుతోన్నకొద్దీ రేఖకి బాధగా ఉంది.

జీవన్ వెళ్ళిపోతాడు.

ఈ తియ్యటి క్షణాలు శాశ్వతంగా వెనక్కి వెళ్ళిపోతాయి...

కాని, ఏమీ అనలేని స్థితి తనది.

ఏమీ ఆపలేని స్థితి అతనిది.

ఇల్లు రానే వొచ్చింది.

"జాగ్రత్తగా వెళ్ళండి...బురదగా ఉంది..." అన్నాడు.

"ఫరవాలేదు - అలవాటే" అంది రేఖ.

"మంచి ఇల్లు ఎందుకు తీసుకోరు?" అన్నాడు.

"గడిచిపోతోంది" అంది రేఖ.

"నో. నో...మీ కే బాధలూ ఉండకూడదు" అన్నాడు జీవన్. రేఖ కారుదిగి వెళ్ళిపోతూంటే ఆమెనే గమనిస్తున్నాడు.

అప్రయత్నంగా చెయ్యి ఊపింది రేఖ.

అతని ముఖంనిండా వెన్నెల ఆమె ఆ మసక చీకట్లోకూడా చూడగలిగింది.

మాలతి ఎదురుచూస్తూ కూర్చుంది.

ఆ రాత్రి ఆమె ఎన్నో మాటలు అడలేదు...

నిద్రపోబోతూంటే రేఖకి జ్ఞాపకం వొచ్చింది - మొట్టమొదటిసారిగా ఒక్క-క్షణం మాత్రం జీవన్ తనని స్పర్శించాడని.

నిద్ర కొంతదూరం వెళ్ళిపోయింది. కళ్ళనిండా...జీవన్.

పెద్ద పెద్ద కెరటాలలాటి ఆలోచనల ఉద్రేకాలు.

జీవన్...జీవన్. అతనే తనకి జీవనం.

అలా అనిపించింది.

ఆ తరవాత చాలా త్వరగా అతను దగ్గర అయాడు.

వారానికి రెండు మూడు సార్లు కలిసేవారు. ఎక్కడికైనా వెళ్ళి కబుర్లు చెప్పుకునేవారు. ఊరు వొదిలి ఏ మహాబలిపురమో వెడుతూకూడా ఉండేవారు.

అతను ఆమెకోసమే బ్రతుకుతున్నట్టు ఉండేవాడు.

ఆమె అతనికోసమే బ్రతుకుతూ ఉండేది.

అంతగా దగ్గరగా, వొచ్చేశారు.

చిన్న చిన్న నీటిచుక్కలు మహాసముద్రం అయినట్టు. ఒక ఝంఝూ మారుతంలో చిక్కుకున్నట్టు ఆ ఇద్దరూ పెనవేసుకున్నారు.

ఒకరి సన్నిధి ఒకరికి పెన్నిధి.

ఇంక ప్రపంచమే లేనట్టు-

ఉండేవారు. కాలానికి అర్థంలేనట్టు ఉండేవారు.

మాలతి అంతా గమనిస్తోనే ఉండేది. ఆమెకి అరుణ్‌కీ మధ్య కొంత దూరం వొచ్చింది.

"నేను ఆశించేది వేరు-అతనికి కావల్సింది వేరు..." అంది మాలతి రేఖతో. "అందులో ఉన్న ప్రమాదాల మాట అలా ఉంచి, నా కందులో అవమానకరమైనదే చాలా కనిపిస్తోంది" అంది.

రేఖ అంగీకరించింది.




"కాని...నువ్వూ అంతకన్నా ప్రమాదమైన ఊబిలో చిక్కుకుంటున్నావు సుమా!" అంది మాలతి. ఆమెది ఈర్ష్య కాదనీ, తనకోసం నిజంగా ఆత్రత అనీ రేఖకి తెలుసును

"అతనలాటివాడు కాదు...నన్ను ఏ రకంగా నూ పాడుచెయ్యడు" అంది రేఖ. అది నిజం. వెచ్చ వెచ్చటి సన్నివేశాల మధ్య, ఎంతో అభిమానంగా ఆమె దగ్గర కొంత శారీరకమైన చనువు తీసుకున్నా, జీవన్ అంత ఉద్ధృతమైన తమ మధ్య ఆ హద్దులు మీరిన పనులేవీ చెయ్యలేదు.

"అదంతా ఒక కళ...పొంచి పొంచి ఉండి పులి మీద పడుతుంది. ఇలాగ మనల్ని ఆదమరిపించి మగవాడు ఏదో ఒక బలహీనపు క్షణంలో మనల్ని భాగ్యహీనులుగా చేస్తాడు..." అంది మాలతి. అరుణ్ ప్రవర్తన ఆమెకి చాలా బాధ కలిగించింది. ఆశాభంగం కూడా అయింది మాలతికి.

"జీవన్ అలాటి మనిషి కాదు."

"మరీ ఆలస్యం అయేదాకా అలాటి మనిషి ఎవ్వరూ కాదు ... నీ జీతం వెయ్యి చేశాడు. ఈ ఇల్లు ఇచ్చేడు...నీ చుట్టూ తిరుగుతున్నాడు. ఏమీ కోరకుండానే?" అంది మాలతి.

రేఖకి జవాబు తెలుసును.

"అవును" అంది.

"పిచ్చి పిల్లవి! నీ కే హానీ రాకూడదని నేను దైవాన్ని వేడుకుంటాను" అంది మాలతి.

"కాదు మాలతీ! జీవన్ నా దగ్గర ఉన్నంతసేపూ మర్యాదగా ప్రవర్తిస్తాడు. నా దగ్గర గడిపే క్షణాలు అతనికి ఆనందం ఇస్తాయి ... నిజం చెప్పాలంటే నాకూ అంతే...ఈ ఇల్లు అద్దెకి కాదు. నాకు ఇచ్చేశాడు - కనీసం అలాగ చెప్పేడు..."

మాలతి ఆశ్చర్యంగా చూసింది.

"అవును...కాని నేను అమ్ముడుపోయే మనిషిని కాదు – నీ కా భయం అక్కర్లేదు" అంది రేఖ.

"కాని ... అతను పెళ్ళయిన మనిషి ... నిన్ను ప్రేమించడం ఎంత స్వార్థమో, నువ్వతన్ని ప్రేమించడం అంత మూర్ఖత్వం" అంది మాలతి.

"నీ మాట నిజమే మాలతీ! కాని...అతన్ని ప్రేమించకుండా ఉండలేను. అతని భార్యకీ, పిల్లలకీ అంతకన్న ఎక్కువ అన్యాయం ఏదీ చెయ్యదలుచుకో లేదు...అంది రేఖ.

"కాని..." అంది మాలతి.

"నీ ఉద్దేశం నాకు తెలుసును! ఇలా ఎంతకాలం, అంటావు. దీనికి ముగింపు ఏమిటంటావు...అది నాకూ తెలీదు. దీనికంతకీ సుఖాంతం ఉంటుందని అనుకోను. కాని జీవన్ అంత బలవంతంగా నా సుఖం కోరుతాడు-ఆ ప్రభావం ఉంటుందని పిస్తుంది" అంది రేఖ.

"అదే నిజమవాలని ఆశిస్తాను" అంది మాలతి.

రేఖ నిశ్చయంగా అది నిజమవుతుందని నమ్మింది. ఏదో ఒకరోజున జీవన్ మాటల ఆటలు మాని చేతలదాకా వొస్తాడని మొదటిలో ఆమెకి చిన్న భయం ఉండేది కాని, అతని ప్రవర్తన అలాటి భయాన్ని త్వరగానే దూరంచేసింది. ఆ తరవాత అతనేమన్నా అంగీకరించి ఉండేది రేఖ అంత వ్యామోహం అతనంటే. కాని, "నిన్ను ప్రేమిస్తున్నది నువ్వు సుఖపడాలనిగాని, నిన్ను కొత్త బాధల్లో పెట్టాలని కాదు రేఖా!...నీ జీవితానికి ఏ విధంగానూ మచ్చ తేను" అన్నాడు ఒక పరిస్థితిలో-ఆ మాట నిలబెట్టుకుంటాడని అప్పుడు రేఖకి తెలుసును.

ఆ సన్నివేశాలన్నీ నిన్నటి తెరల చాటునించి తొంగి తొంగి చూస్తున్నాయి.

ఎన్నిసార్లు కలుసుకున్నారు? ఏమో! కాని, ప్రతిరోజూ సినిమా చూసినట్లు ఇద్దరికిద్దరూ తమ తమ దైనందిన జీవితాలను వేరువేరుగా జీవిస్తూ వాటిలోని బాధల్ని తమ సాహచర్యంలో మరిచిపోయేవారు. ఏకాంతంలో వాళ్ళది మరో ప్రపంచం. ఒక్కొక్కప్పుడు గంటలు ఎన్నో అతి కొద్దిమాటలతో గడిచి పోయేవి...కాని అవి చక్కటి నిశ్శబ్దాలు.

అలాగ గడిచిపోయింది కాలం. పెద్ద లాయర్లు ఇద్దరిని పెట్టి జీవన్ ఆమె ఆస్తి వ్యవహారాలన్నీ త్వరగానే సెటిల్ చేయించాడు. తనకంత ఆస్తి ఉందని ఆమె అనుకోలేదు. తాను ఉంటోన్న చక్కటి ఇల్లు తనపేర కొన్నాడు. అది కాక డబ్బు చాలా రకాల పెట్టుబడులు పెట్టించేడు. వొస్తున్న జీతం పేరుకే! ఆమె పరిస్థితి అంత మెరుగుపడింది.

అవన్నీ చేసి జీవన్ తనకి దగ్గిరగా రాలేదు. అప్పటికే అతనిమీద ఆమెకి పూర్తిగా మమత ఉంది

మాలతికీ, తనకీ జీవన్ విషయంలో, వారి సాహచర్యం విషయంలో మాటలు జరిగాక వారిలో కొంత చనువు పెరిగిన మాట నిజమే. కాని, ఆమె అనిష్టం సూచన కాగానే జీవన్ తన హద్దుల్లోనే ఉండడానికి ప్రయత్నించాడు.

అలా జరిగింది కాలం...

దూరంగా పన్నెండు గంటల సైరన్ వినిపించి మళ్ళీ ప్రస్తుతంలోకి వొచ్చింది. "అమ్మా" అంటూ వచ్చాడు టైగర్.

"ఏం ఆకలేస్తోందా?" అంది రేఖ.

"అవును..."

"పోయి హోటల్లో తినిరా...మేమూ బయటికి వెళుతున్నాము" అంది రేఖ. వాడిమాట మరిచేపోయింది ఇవేళ.

"టిఫిన్ ఉంది టేబిల్‌మీద..."

"తిని వెళ్ళు."

"నా కది చాలు."

"నీ యిష్టం."

వాడి సమస్యలు వాడివి ... కాని, వాడూ, గోపాల్, ఎలా రాజీపడ్డారో ఆమెకి అంతుపట్టలేదు. ఎప్పుడో గోపాల్‌ని అడిగి తెలుసుకోవాలి.

అనుకుంటుండే హడావిడిగా రానేవొచ్చాడు గోపాల్.

"ఆలస్యమయిందా?" అన్నాడు ఆత్రతతో.

"లేదు..." అంది రేఖ చిరునవ్వుతో. తన పుట్టినరోజునాడు జరిగిన కథ మళ్ళీ సామాన్య పరిస్థితుల్లో జరగదని ఆమెకి తెలుసును. కాని, నిన్నటిలాటి ఉదంతం మళ్ళీ జరుగుతుందా? నిన్నటిలాగే జీవన్ మళ్ళీ తనని కలియక తప్పదని పట్టు పడతాడా ?

అలిసిపోయి ఉన్నాడు గోపాల్.

మిగిలిన రోజంతా ఆమెకి ఆహ్లాదంగా గడిచిపోయింది. జ్ఞాపకాల ముళ్ళు గుచ్చుకోకుండా ఆమె జాగ్రత్తపడింది.

## 4

అనుకోకుండా ఒకనాడు మాలతి వొచ్చింది. రేఖ పెళ్ళికి ముందే ఆమె మరో ఇంటికి వెళ్ళిపోయింది. అప్పటినించీ వారిద్దరికీ ఎక్కువ కలయికలేదు. ఎప్పుడైనా మాలతి టెలిఫోన్ చేసేది. క్షేమ సమాచారములు చెప్పుకునేవారు.

"అరుణ్ ఎలాగ ఉన్నాడు ?" అని అడిగేది రేఖ తప్పకుండా.

"మామూలే."

"అంటే..."

"అదే! ఏదీ తేల్చడు. ఓసారి పెద్ద కలహమే అయింది మా ఇద్దరికీ-మళ్ళీ అతన్ని చూడాలనిపించలేదు...అతనికీ అలాగే అనిపించి ఉంటుంది."

"అంతా అయిపోయిందా?"

"లేదు-పది రోజుల తర్వాత మళ్ళీ వొచ్చాడు...ప్రాధేయపడ్డం అతనికి చేతకాదుగాని, దానికి దగ్గరగా వొచ్చాడు" అంది మాలతి.

అరుణ్‌ది చిత్రమైన మనస్తత్వం.

పెళ్ళి అనే లాంఛనానికి ముందే దైహికంగా తనకి లొంగిపోయేపాటి నమ్మిక మాలతికి లేదనే బాధా, అలా లొంగిపోయే దౌర్బల్యం ఆమెలో లేదనే సంతృప్తి ఒకదానితో ఒకటి అతనిలో పోటీపడుతూ ఉంటాయి.

మాలతిని చూడగానే రేఖకి చాలా సంతోషం కలిగింది. తామిద్దరూ ఎంతో ఆనందంగా గడిపిన రోజులూ, తాను ఈ ఊరు రాగానే మనసారా స్వాగతం చెప్పిన విషయమూ రేఖ ఎప్పుడూ మరిచిపోలేదు.

"మీ శ్రీవారెక్కడ?" అంది మాలతి.

"రాత్రి ఎప్పుడో వొస్తారు" అంది రేఖ.

"అదేమిటి?...ఇది కొత్త అలవాటా?" అంది మాలతి. రేఖ సంసారంలో ఏం జరుగుతూ ఉంటుందో ఆమెకి కొంతవరకూ తెలుసును

"లేదు-నాలుగైదు రోజులనించి... ఫేక్టరీలో ఏవో కొత్త మిషన్స్ రావడమో ఏదో జరిగిందట..."

"అంతేనా, లేక ఇంటికి రావడం అంటే భయంగా ఉందా అతనికి?" అంటూ నవ్వింది మాలతి. ఆమె ఎంతో సునాయాసంగా నవ్వుతుంది ... తనకి బాధ కలిగించే పరిస్థితుల్లోనూ ఆమె నవ్వగలదు.

"అదేమీ లేదు" అంది రేఖ చాలా తొందరగా, కొంత నిశితంగా.

పరీక్షగా చూసింది మాలతి.

"నిన్నేమీ విమర్శించడంలేదులే-కోపం తెచ్చుకోకు" అంది మాలతి. నాలుగైదు నెలల కిందట రేఖ గోపాల్ గురించి ఏమీ చెప్పడానికే ఇష్టపడలేదు—ఆ విషయమే ఆమెకి రుచికరంగా ఉంది. అది మాలతికి బాగా జ్ఞాపకం ఉంది.

"నీ మీద కోపం...నా కెప్పుడూ రాదు" అంది రేఖ చిరునవ్వుతో. మాలతి మనసు కొంచెం గాయపడిందని ఆమె గ్రహించింది.

"మీ జీవన్ ఎలాగ ఉన్నారు?" అంది కొద్ది క్షణాల తరవాత మాలతి.

ఒక్కసారి రేఖ ముఖంలో రంగులు మారడం గమనింపగలిగింది ఆమె. అక్కడినించి రేఖ మనస్సు క్షణికంగా దూరదూరాలకి పోవడమూ గమనించగలిగింది మాలతి.

"నీ మాట చెప్పు...మీ అరుణ్ ఏమంటాడు? అంది రేఖ. సంభాషణలో విషయంమార్చే ప్రయత్నం దాచుకోలేదు రేఖ.

"అది చెప్పడానికే వొచ్చాను" అంది మాలతి. ఆమె కళ్ళనిండా వెలుతురు. రేఖ ఒక్కసారిగా ఆమెని కౌగలించుకుని, "ఎంత మంచివార్త మోసుకొచ్చావు!" అంది. ఆమె నిజానికి మాలతిని గురించి చాలా బాధపడ్డది. తన స్వంత బాధలో ఆమె ఆ బాధను వెలికి రానీయలేదు. అంతే.

"నువ్వు సంతోషిస్తావని తెలుసును" అంది మాలతి.

"సంతోషమా! డేన్సు చెయ్యాలని ఉంది!" అంది రేఖ, ఆనందంలో తేలిపోతూ. "చెప్పు-నాకు వివరాలన్నీ కావాలి! ... నీటిలో చేపని చేతుల్తో పట్టుకున్నంత కష్టమైన పని ఎలాగ చేసేవు?" అంది.

"ఇలాటి చేపలకి కొన్ని చేతుల్లో చిక్కిపోవాలని బుద్ధిపుడుతుంది" అంది మాలతి.

రేఖకి అంతరాంతరాలలో ఎక్కడో చిన్న స్పందన కలిగింది.

"అలాగ కాదు-వివరాలు కావాలి" అంది రేఖ. మాలతికి చెప్పాలని ఉంది. అరుణ్‌కీ, ఆమెకీ చివరి ఘర్షణ రేఖకి తెలుసును.

"నా మీద ఆ మాత్రం నమ్మకంలేదా?" అన్నాడు అరుణ్.

"నమ్మకం, అప నమ్మకం కాదు—నా సూత్రాలు నాకున్నాయి నీతో కలిసి తిరిగేనని, నీతో స్వేచ్ఛగా మాట్లాడేననీ, నన్ను వివాహం చేసుకునే ఉద్దేశం నీలో ఎక్కడో ఉందనీ, ఈ కారణాలవల్ల కోరికలన్నీ ఇప్పుడే తీర్చడం నా అభిమతం కాదు" అంది మాలతి.

"నిన్ను మోసం చెయ్యను..." అన్నాడు అరుణ్ "నీకేం ప్రమాదంలేదు-మనం ఆధునిక యుగంలో ఉన్నాము. అమ్మమ్మల కాలంలో కాదు" అన్నాడు.

"శరీరానికి జరిగే ప్రమాదం ఒక్కటేకాదు నేను ఆలోచిస్తోన్నది...నువ్వు మోసం చేస్తావా చెయ్యవా అనీ ఆలోచించడంలేదు..." అంది మాలతి.

"మరి?"

"నా కిష్టంలేదు. ఇది ఏ యుగమైనా, వ్యక్తిగా నా సూత్రాలు నాకు ఉన్నాయి..." అంది మాలతి.

"నన్ను దూరంచేసుకుంటున్నావు..." అన్నాడు అరుణ్.

"నాకు దగ్గరగా ఉండడానికి ఇదే షరతు అయితే, దూరంగానే ఉండు" అంది మాలతి.

"అంటే, నా మీద ప్రేమ లేదన్నమాట" అన్నాడు అరుణ్.

"అలాటిదే ప్రేమ అయితే, లేదు" అంది మాలతి.

పార్కులో జరిగింది ఇదంతా. అతను లేచి, స్కూటర్‌మీద వెళ్ళిపోయాడు. ఇంకేమీ అనకుండా. ఆ మధ్యనే కొన్నాడు స్కూటరు.

అది జరిగాక రెండు నెలలు మాలతికి కనిపించలేదు.

ఆ తరవాత ఒకనాడు మాలతికి ఆఫీసులో ఫోన్ చేశాడు.

మాలతి మాట్లాడలేదు.

ఆ ఆదివారం మధ్యాహ్నం వొచ్చాడు. వొస్తూనే, "నీ జాతకం ఇయ్యి" అన్నాడు ఉపోద్ఘాతం లేకుండానే.

అడగకుండానే మంచిసిరిచ్చి, "ఎందుకు?" అంది మాలతి.

"మరెందుకు? ముహూర్తాలు పెట్టించడానికి" అన్నాడు ఎటో చూస్తూ.

లోపలికి వెళ్ళి కాఫీచేసి తెచ్చింది మాలతి.

"కాఫీ కోసం రాలేదు... జాతకం కోసం వచ్చాను" అన్నాడు అరుణ్.

ఈ ఓటమి అతనిలో కలిగించిన మార్పుని జాగ్రత్తగా గమనిస్తోంది మాలతి. కాని తన గెలుపులో ఉన్న ప్రమాదం ఆమెకి తెలుసు.




"కాఫీ తాగు" అంది.

తాగి, "జాతకం ఇవ్వాలనిలేదా ?" అన్నాడు అరుణ్.

చల్లగా, "లేదు" అంది మాలతి.

ఆ జవాబుకి అతను సిద్ధంగానే ఉన్నాడల్లే ఉంది. "సరే, తరవాత నన్నేమీ దూషించకు" అన్నాడు

"దూషించను" అంది మాలతి. కన్నీళ్ళు ఏ క్షణాన్నైనా వొచ్చేసేలా ఉన్నాయి. కాని, లోలోపల ఏదో శక్తి ఆమెకి సహాయం చేస్తూంది.

"వెడతాను" అన్నాడు లేచి నిలబడి, అతను.

మాలతి మాట్లాడలేదు...లోపలికి వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుని ఏడుపు ఆపుకొంటూంది. అతని స్కూటరు శబ్దంకోసం ఎదురుచూస్తోంది.

ఆ శబ్దం రాలేదు.

రెండు చేతులు మాలతిని చుట్టేశాయి- "కొంచెం తెలివితక్కువని క్షమించలేవా, మాలతీ !" అంటూ అరుణ్ ఆమెని తన చేతుల్లోకి తీసుకున్నాడు...

అంతా చెప్పి, "వచ్చే శుక్రవారం ముహూర్తం !" అంది మాలతి. "నమ్మిక లేకపోతే, ఇదుగో కార్డు!" అంటూ ఇచ్చింది.

కార్డు చూస్తూ ఉండిపోయింది రేఖ.

"ఏమిటి ఆలోచిస్తున్నావు ?" అంది మాలతి

"నువ్వు... చాలా సుఖపడాలని దైవాన్ని కోరుకుంటున్నాను... కాని, ఏదో భయం- ఇన్ని మార్పుల తరవాత" అంది రేఖ

హాయిగా నవ్వింది మాలతి.

"భయపడకు... అతన్ని నేను నిజంగానే ప్రేమిస్తున్నాను. తప్పకుండా సుఖపడతాను" అంది.

ఈసారి రేఖలో స్పందన బలంగా ఉన్నది.

"ప్రేమించినవాళ్లంతా సుఖపడతారా ?" అంది రేఖ కొంచెం పొడిగా- చిత్రంగా, ఆ ప్రశ్న వెనక తానే లేదు. గోపాల్ ఉన్నాడు.

"సారీ ! అది కాదు నా ఉద్దేశం..." అంది మాలతి

"సారీ చెప్పకు... నీ మంచి కోరికలు నాకూ మంచి చేస్తాయి" అంది రేఖ

క్రమంగా వాళ్లిద్దరి సంభాషణా ఇతర విషయాలమీదికి వెళ్లింది.

పది దాటుతోందే గోపాల్ వచ్చాడు.

బాగా అలిసిపోయి ఉన్నాడు. స్నానం చేసినా అలసట పోలేదు.

పేరుకి వాళ్ళిద్దరితో ఏదో తిని, వొద్దంటున్నా మాలతిని డ్రాప్‌చేసి వచ్చాడు.

రాత్రి అతను అశాంతితో నిద్రపోలేకపోయాడు.

అతని కదలికలకి తెలివి వొచ్చింది రేఖకి. మామూలుగా లేదు అతని ముఖం.

"ఒంట్లో బాగులేదా ?" అని, అతని గుండెలమీద చెయ్యి వేసింది రేఖ.

"అలిసిపోయాను" అంతే... అని, లేచి కూర్చుని- "నువ్వూ అలిసిపోయావు...నా ప్రక్కన నీకూ నిద్రరాదు. నేను అవతలిగదిలో పడుకుంటాను. నిద్రపో-" అన్నాడు గోపాల్ నిలబడుతూ.

చెయ్యిలాగి అతన్ని కూర్చోబెడుతూ, "ఫరవాలేదు- పడుకోండి... రెండు రోజులు విశ్రాంతి తీసుకోకూడదూ ?'' అంది రేఖ.

గోపాల్ దిండుమీద జారబడి రేఖని తన చేతుల్లోకి తీసుకుని, "చాలా రోజులు విశ్రాంతి... ఆ ఉద్యోగాన్ని రిజైన్ చేశాను'' అన్నాడు.

ఆశ్చర్యంగా, "ఏం ?- ఏమయింది ?" అంది రేఖ.

ఆమెని మరికొంచెం దగ్గరగా తీసుకుని, "కొత్తమెషీన్ల విషయంలో అమెరికా రెండు నెలల పనికోసం వెళ్ళరమ్మన్నారు-" అన్నాడు గోపాల్.

"బాగుంది... మరేం ?" అంది రేఖ.

"నాకేగాని, భార్యకి లేదుట !- నాకు కోపంవొచ్చింది" అన్నాడు గోపాల్.

"లేకపోతే ఏం ?... మీరు చాలా కాలంనించి కోరుకుంటున్నది అమెరికా వెళ్లాలనేగా ?" అంది రేఖ.

"నిజమే. కాని, ఎంత సేవ చేసేను వాళ్ళకి ? కిందటి సంవత్సరం సుమారు కోటి రూపాయిల లాభం తీశారు. ఈ చిన్న మాటకి వాళ్ళు కాదని ఎందుకనాలి?" అన్నాడు గోపాల్.

కొంచెం ఆగి, "తొందరపడ్డారేమో !... వెళ్ళిరావలసింది" అంది రేఖ

"ఎలా వెళ్లేది రేఖా !" అన్నాడు గోపాల్. "నువ్వు పక్కన లేకుంటే నాకక్కడ ఏంబావుంటుంది ?"

"అందుకని- ఇంతకాలం పనిచేశాక రిజైన్ ఇచ్చేశారా !"

విమర్శలాగ అనలేదు రేఖ. ఆమె చలించిపోయింది. బాధగా అంది.

"అవును- నాకు విచారంలేదు... కాని నీకు అభ్యంతరం ఉంటే- నాకెంత అనిష్టంగా ఉన్నా వాళ్లదగ్గరకి వెళ్ళి ఉపసంహరించుకుంటాను" అన్నాడు.

ఇన్నివొందల రోజుల్లో ఆమె చేతులు మొట్టమొదటిసారి అతని చుట్టూ బిగుసుకున్నాయి. అతనెంత పౌరుషం ఉన్న మనిషో ఆమెకి తెలుసును.

"వొద్దు వొద్దు- నా కోసం మీ రలాగ చెయ్యొద్దు" అంది రేఖ- ఆమె ముఖం అతని గుండెలమీద ఉంది.

వెచ్చటి కన్నీళ్ళు అతన్ని ఆశ్చర్యపరిచాయి.

"ఏడుస్తున్నావా రేఖా ?..." అన్నాడు.

"అవును... కాని, మీరనుకుంటూన్నది కారణం కాదు..." అంది రేఖ. అతనికెలాగ చెప్పడం?

"నువ్వు—"

ఏదో అనబోయిన అతన్ని ఆపేసింది రేఖ. "మీరు నిద్రపొండి..." అంది.

ఆమె వెచ్చటి బరువుకింద గోపాల్ ఏమీ మాటలాడే ప్రయత్నం చెయ్యలేదు. ఉండీ ఉండీ వేగం హెచ్చయ్యే ఆమె హృదయ స్పందన అతనికి సుఖవుగా నిద్ర రానీయలేదు.

కొత్త కొత్త రాత్రిలాగ ఉంది

మర్నాడు ఆఫీసుకి నెలరోజులు సెలవుకి ఉత్తరం పంపింది రేఖ.

ఆ ఉత్తరం చూస్తూనే ఫోన్ చేసేడు జీవన్.

"రేఖా ! ఏమిటీ ఉత్తరం ?" అన్నాడు. గోపాల్ గార్డెన్‌లో ఏదో చేస్తూండ డాన్న ఆమె టెలిఫోన్ ఎత్తింది.

"ఏమీలేదు... సెలవుకావాలి. అంతే !" అంది రేఖ.

"కాని... హఠాత్తుగా ఏమిటిది ?" అన్నాడు జీవన్.

"అలా అవసరం వొచ్చింది."

"ఆ రోజు... జరిగినదానికి కోపం వొచ్చిందా ?"

కళ్ళు మూసుకుంది రేఖ.

ఆ రోజు...

"ఇంక... నీనించి దూరంగా ఉండలేను" అన్నాడు జీవన్– "ప్లీజ్ !...నా మనస్సు నీకు తెలుసును" అన్నాడు. ఇంత కాలంనించి అతనలాటి బలవంతం చెయ్యలేదు

"మీరు... దయచేసి బలవంతం చెయ్యవొద్దు" అంది రేఖ– అతని చేతుల నించి తప్పించుకుంటూ. ఆ మధ్య అతను తీసుకున్న గెస్ట్‌హౌస్‌లో అతన్ని కలుసుకుంది. అదీ అనిష్టంగానే. కొంత కాలంనించీ అతన్ని కలుసుకోవడం చాలా తగ్గించింది కష్టపడి. మనస్సు ఒకవేపునించి అతన్ని కలుసుకోవాలని కోరుకుంటూన్నా, మరోవేపు నేరం చేస్తోన్నట్టు ముళ్లుగుచ్చుతోంది. కాని అతను ఎంతో బాధగా పిలిచాక ఒక్కసారి వెళ్ళివొద్దామనుకుంది...

మొదట అతను ఎప్పటి జీవన్‌లాగే ఉన్నాడు– ఈ మధ్య అతని భార్య పుట్టింటికి వెళ్లడంతో కొంత సుఖశాంతులకి నోచుకున్నాడు.

"నీ సంసారం ఎలా ఉంది ?" అన్నాడు.

"సాగుతోంది" అంది రేఖ జరుగుతున్నది మనసులో పెట్టుకుని.

"నువ్వు– జీవన్‌ని మరిచిపోవుకాదూ ?" అన్నాడు ఆశిస్తూన్నట్టు.

"మీ ఉపకారం ఎన్నటికీ మరిచిపోను... మిమ్మల్ని మరిచిపోను" అంది రేఖ. అతన్ని గురించిన నిజం ఆ క్షణంలో ఆమెకే స్పష్టంగా లేదు.

"నువ్వు నాదానివి... ఎప్పుడూ అంతే" అన్నాడు జీవన్.

రేఖ మాటాడలేదు

"నువ్వు లేకుండా బ్రతకలేను– నా చుట్టూ ఉన్న ఈ అంధకారంలో నువ్వే నాకు ఒక్క దీపానివి" అన్నాడు జీవన్, హటాత్తుగా తనని చేతుల్లోకి తీసుకుంటూ.

"కాని... నేను ఇప్పుడు మరొకరి భార్యని, జీవన్ !" అంది, రేఖ అతన్ని విడిపించుకుని.

"నాకు తెలుసును- ప్రతి స్త్రీకి ఒక భర్త ఉండాలి- లేకపోతే సుఖం, మర్యాద, ఉండవు. కాని, నీకు ప్రేమించేవాడూ ఉండాలి... నాలాగ ఎవరు నిన్ను ప్రేమిస్తారు ?" అన్నాడు జీవన్. అతని మాటల్లోకి ఉద్వేగం వొచ్చింది.

గోపాల్ కౌగిటిలో అప్పటిదాకా ఆమెకి జీవన్ జ్ఞాపకం వచ్చేవాడు.

ఇప్పుడు ఆమె మళ్ళీ కౌగిలించుకున్న జీవన్ చేతుల్లో ఉన్నప్పుడు గోపాల్ జ్ఞాపకం వొస్తున్నాడు. అద్దం మీది కార్డు- ఐ లవ్ యూ ఆకాశమంత కనిపిస్తోంది.

ఇంతకుముందు ఎన్నోసార్లు జీవన్ ఒక్క అడుగు తన పరిధిలోకి వేస్తే రేఖ రెండడుగులు అతనివేపు వేసి ఉండే పరిస్థితులు, నిమిషాలు ఉన్నాయి. కాని, రేఖకిప్పుడు ఆలోచనలు వేరుగా ఉన్నాయి.

"వొద్దు జీవన్!... మన మధ్య పవిత్రమైన భావన ఎంత ప్రేమతోనయినా సరే- ఉండాలి. మీరే చెప్పేరు" అంది రేఖ

"ఈ మధ్య నన్ను కలవడమేలేదు నువ్వు- నేను పిచ్చివాడినయిపోయాను." అన్నాడు ఇంకా ఉద్వేగంతో జీవన్. అతని చర్యలు ఆ మాటలు నిజం అని నిరూపిస్తున్నాయి. అతని శారీరిక వాంఛలు జరిగినదానికి నల్లటిరంగులు వేస్తున్నాయి.

ఒక్క క్షణం నీరసించి ఆమె జీవన్ కోరినట్టు చేద్దామనుకుంది.

కాని తనకే తెలీని ఏదో బలీయమైన అనిష్టత ఆమె పెనుగులాడి అతన్ని విడిపించుకునే శక్తి, తలుపు తీసుకుని అవతల పడే యుక్తి ఆమెకి కలిగించాయి. రొప్పుతూ రెండోఫ్లోర్‌నించి మెట్లుదిగి వొచ్చిన రేఖకి దేవుడిచ్చిన వరంలాగ టేక్సీ కనిపించింది. ఇంటికొచ్చేసింది.

"హల్లో ! రేఖా !... అక్కడే ఉన్నావా ?" అన్నాడు జీవన్.

"ఉన్నాను" అంది కళ్లు తెరిచి, రేఖ.

"ఆ రోజు నీకు నిజంగానే కోపం వచ్చింది" అన్నాడు జీవన్. "పొరపాటు చేశాను. క్షమించు"

రేఖ ఏమీ అనలేదు.

"నిన్ను కనీసం చూడకపోతే బ్రతకలేను" అన్నాడు జీవన్. అందుకే తన ఉద్యోగం మార్పుచేసి తనని దగ్గరగా పెట్టుకున్నాడు.

"నాకు తెలుసు. కాని, పరిస్థితులు మారాయి" అంది రేఖ.

"నాకూ నీకూ మధ్య ఏమీ ఎప్పుడూ మారవని వాగ్దానం చేశావు" అన్నాడు

జీవన్. అదీ నిజమే. ఎప్పుడో, తన ప్రేమనంతటినీ అతని మీద కేంద్రీకరించి, ఇంకేమీ తనకి లేని రోజుల్లో నిజంగానే తానలా వాగ్దానం చేసింది.

"వొద్దు జీవన్... ఆ మాటలు జ్ఞాపకం చెయ్యకు" అంది రేఖ. "అవన్నీ మరిచిపో."

జీవన్ క్షణకాలం మాట్లాడలేదు.

"పోనీ- కనీసం ఆఫీసుకి రా" అన్నాడు.

"ఈ నెలా పోనీ."

"నిన్ను చూడాలి- ఇంటికి వస్తాను"

"వొద్దు వొద్దు. ఆయన సెలవులో ఇంటిదగ్గిర ఉన్నారు" అంది రేఖ.

"మీరిద్దరూ..." అని ఆగిపోయాడు. ఇంక ఏమీ అనకుండా ఫోన్ డిస్కనక్ట్ చేసేశాడు జీవన్.

నీరసంగా కూర్చుని హటాత్తుగా వచ్చిన ఈ కొత్త పరిస్థితిని గురించి ఆలోచించసాగింది రేఖ. మరొకసారి తన జీవితంలో మలుపు వచ్చిందని ఆమెకి ఇప్పుడు పూరిగా అర్థమైంది.

అన్యమనస్కంగానే వంటచేసింది.

ఒంట్లో బాగులేనట్టు ఉంది.

మనస్సంతా అల్లకల్లోలంగా ఉంది.

డ్రైవర్‌ని పిలిచి గోపాల్‌కి లోపలికి రమ్మని కబురుపెట్టింది. చేస్తోన్న పని వదిలివొచ్చి, "ఏం పిలిచావట ?" అన్నాడు గోపాల్.

మనిషి అలిసి చెమట పట్టినట్టు ఉన్నాడు.

"అక్కడ ఇంత ఎండలో పనిచెయ్యాలా ?... చాలు లోపలికి రండి. ఎండ మండిపోతోంది" అంది.

"అవును." అని స్నానానికి నడిచేడు గోపాల్.

అతను వచ్చేసరికి కూల్‌డ్రింక్ తయారుచేసి ఉంచింది. తృప్తిగా తాగి, "ఇది చాలా హాయిగా ఉంది," అన్నాడు గోపాల్.

"అవును ఎండలోనించి వచ్చాక అలాగే ఉంటుంది" అంది రేఖ.

"అదికాదు. ఎన్నాళ్ళయింది మనం ఇంత విశ్రాంతి తీసుకుని ?" అన్నాడు, గోపాల్. పెళ్ళి తరవాత అమ్మెకి అంత ఇష్టంలేకా, అతనికింత అవకాశం లేకా, నాలుగైదు రోజులకన్న సెలవు పెట్టి ఎక్కడికీ తిరగలేదు.

"అవును" అంది రేఖ. ఒక్కసారిగా ఆమెకి ఈ పరిసరాలు వదిలి వెళ్ళి

కొన్నిరోజులు తిరిగి రావాలనీ, పూర్వపు ఈ వాసనలన్నిటినీ కడిగివెయ్యాలనీ అనిపించింది.

"ఎక్కడికైనా పోదాం" అన్నాడు గోపాల్. ఆమె ఆలోచనలకి ప్రతిధ్వని లాగ.

"బాగుంటుంది." అంది రేఖ. అతని నిరుద్యోగ పరిస్థితి ఆమెకి జ్ఞాపకం వచ్చి కొంత సందేహించింది. కానీ, అతనాట్టే కాలం అలాగ ఉండిపోడని ఆమెకి తెలుసును. తనకే ఇంక బహుశా ఉద్యోగం దొరకదు. జీవన్ ఏం చేసినా, చెయ్యకపోయినా, తాను మళ్ళీ అక్కడికి వెళ్ళి ఉద్యోగం చెయ్యడం మరిచిపోవాలని ప్రయత్నిస్తోన్న గతాన్ని మళ్ళీ మళ్ళీ తవ్వడమే అవుతుంది. కాని, ఆ మాట అతనికిప్పుడు చెప్పనక్కరలేదు.

"ఎటు వెడదాం?" అన్నాడు గోపాల్.

"మీ ఇష్టం" అంది రేఖ.

"కాదు. ఆలోచించి చెప్పు..." అన్నాడు గోపాల్. అతనికి రాత్రి నిద్రలేని కారణాన ఆవులింతలు వస్తున్నాయి.

"ముందర లంచ్ కానివ్వండి- తరవాత ఆలోచిద్దాం" అంది రేఖ. ఆమెకే అలసటగానే ఉంది

నిద్రపోయి ఆమె లేచేసరికి టెలిఫోన్ మోగుతోంది.

తొందరగా వెళ్ళి రిసీవరు తీసింది— క్షణికంగా ఆమె గుండెలు కొట్టుకున్నాయి. జీవన్ కాదుగదా! అని.

కాదు.

గోపాల్ ఫ్యాక్టరీనించి— అతనికోసం.

"ఆయన నిద్రపోతున్నారు" అంది రేఖ. అంత గాఢనిద్రలో అతన్ని లేపడం ఆమెకిష్టంలేదు.

"నేను ఫోన్‌చేసేనని చెప్పండి" అని నెంబరూ పేరూ ఇచ్చాడు అవతలినించి.

ముఖంకడుక్కుని బొట్టుపెట్టుకుని రేఖ టీ తయారుచేసి తాగుతుంటే గోపాల్ వచ్చాడు. అతనికి టీ ఇచ్చి తాగుతోంటే టెలిఫోన్ మాట చెప్పింది.

"వాళ్ళు బేరాలకి దిగుతారు..." అన్నాడు గోపాల్ టీ తాగుతూ.

రేఖ ఏమీ అనలేదు. తానేమన్నా గోపాల్ అలాగే చేస్తాడని తెలిసి, ఆమె జాగ్రత్తగా ఊరుకుంది. ఏ జవాబు ఇచ్చినా అందులో ఏదో ఒకరకం సూచన ఉండి తీరుతుంది.

"పద. ఏదైనా సినిమా చూద్దాం" అన్నాడు గోపాల్.

సాయంత్రం సినిమా చూసి, టిఫిన్‌తిని ఇంటికి వచ్చేశాము– వెన్నెల రాత్రిలో చాలాసేపు గార్డెన్‌లో కూర్చున్నారిద్దరూ.

"ఇలా– బాగుంది." అన్నాడు గోపాల్.

"అవును" అంది రేఖ

అంతకన్న ఎక్కువ మాట్లాడుకోలేదు. రేఖకి ఎంతో శాంతిగా అతనిమీద ఆప్యాయత ఆమెలో వెల్లి విరుస్తోంది.

నిశ్చలంగా కూర్చుని, తృప్తిగా తన వైపు చూస్తూన్న అతను మొట్ట మొదటిసారి తన జీవితంలోకి రావడం ఆమెకి జ్ఞాపకం ఉంది.

ఆసాయింత్రం నాలుగు దాటాక వొచ్చాడు గోపాల్ తన ఆఫీసుకి జీవన్ కోసం.

"ఆయన బొంబే వెళ్ళేరు" అంది ఏవో కాగితాలు చూసుకుంటూ రేఖ. విచిత్రంగా, అతన్ని ఆకృతిని సరిగా గమనించనేలేదు తానప్పుడు.

"కాని–నాకు మా సరుకులు అర్జెంటుగా డెలివరీ కావాలి" అన్నాడు యుద్ధంలో ప్రతిపక్షితో వాదిస్తోన్న యోధుడిలాగ.

"మేనేజర్‌ని చూడండి" అంది రేఖ.

"చూశాను–అతనికేమీ తెలిసినట్టులేదు."

"మీరు–" అంది రేఖ; అని, ఆగిపోయింది. మీరెవరని ప్రారంభించి ఎందుకో ఆగిపోయింది.

తన కార్డు తీసి ఆమె ముందు పెట్టేడు గోపాల్.

రెండుసార్లు చదివింది. ఆ ఫాక్టరీకి చాలా సరుకులు సప్లై చేస్తుంది జీవన్ కంపెనీ.

"నేను కూర్చోవొచ్చా ?" అన్నాడు గోపాల్ కొంచెం తగ్గిన ఉధృతంతో.

సిగ్గుపడి, "సారీ ! దయచేసి కూర్చోండి..." అంది రేఖ. "కాఫీ తాగుతారా ?" అంది.

"వొద్దు...నా సరుకుల మాట ఏమిటి ?" అన్నాడు గోపాల్.

"చూసి చెప్తాను" అంది రేఖ.

అతన్ని కూర్చోనిచ్చి ఆఫీసులో అరగంట వెతికి, "సారీ ? వాటిని గురించిన కాగితాలేవీ రాలేదు" అంది రేఖ. అతని ముఖంలో ఉన్న నిరాశ చూసి, "కావాలంటే బొంబే ఆఫీసునించి వివరాలు తెలుసుకుని చెప్తాను."




"కాని, రాత్రికి రాత్రే నాకు కావలసిన సరుకులు... ఫేక్టరీ ఆగిపోతుంది అవి లేకపోతే" అన్నాడు గోపాల్.

"ఏం చేసేది!" అంది రేఖ. అతనికి సహాయం చెయ్యాలని ఉంది. కాని, సరుకులకు సంబంధించిన కాగితాలు రాలేదు. జీవన్ కంపెనీ వాటిని బొంబేలోనో, కలకత్తాలోనో కొని తెచ్చి ఇచ్చి ఖరీదుమీద కమిషన్ తీసుకోడం మామూలు. సరుకుల మాట తెలుసుకోవాలంటే చాలా శ్రమ.

"మీకు చేతనైనది చెయ్యండి" అన్నాడు గోపాల్.

అన్నీ చేసింది రేఖ ఎందుకో ఈ మనిషికి సహాయం చెయ్యాలని అనిపించింది. బొంబేకి టెలిఫోన్ చేసి, కలకత్తాకి చేసి, రైల్వేపార్సెల్ నంబర్లు తెలుసుకుని చివరికి ట్రేస్ చేసింది. మిగిలిన పనులు మేనేజరుకి వొప్పజెప్పింది. అతను స్టేషనుకి వెళ్ళి పార్సెల్స్ తీసుకుని రాత్రికి రాత్రే ఫేక్టరీకి చేరవేస్తాడు.

అన్నీ ముగిసేసరికి రాత్రి తొమ్మిదయింది.

"మీకు చాలా శ్రమ ఇచ్చాను-థేంక్స్" అన్నాడు గోపాల్. అంతసేపూ అతను రేఖ దగ్గరే కూర్చున్నాడు.

"డోంట్ మైండ్...మీ పని ముగిసినందుకు నాకూ సంతోషంగా ఉంది" అంది రేఖ, ఇంటికి వెళ్ళడానికి లేస్తూ.

"కాని, నాకు సంతోషంగాలేదు" అన్నాడు ఆమెతో బయలుదేరుతూ గోపాల్.

వెళ్లబోయి, "ఏం ?" అంది రేఖ.

"మళ్ళీ రేపు మీతో ఇలాగ గంటలకొద్దీ గడపడం కుదరదు..." అన్నాడు గోపాల్.

రేఖ చిరునవ్వుతో, "మరికొన్ని పార్సెల్స్ కోసం వొస్తేసరి !" అంది.

"అలాగే చేస్తాను...మీ సూచన బాగుంది" అన్నాడు గోపాల్ నిజానికి అతను అలాగ అంత సేపు కూర్చుంటే ఆమెకి శ్రమ అనిపించలేదు.

"నేను...సీరియస్‌గా అనలేదు" అంది రేఖ తొందరగా.

"నాకు నిరాశ కల్పించేరు !" అన్నాడు గోపాల్ నవ్వుతూ. నవ్వుతూంటే ఇంకా బాగున్నాడు అతను.

"సారీ" అంది రేఖ ఆఫీసు బయటికి నడుస్తూ.

"పదండి-మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు గోపాల్.

"వొద్దు-తిన్నగా బస్సు ఉంది" అంది రేఖ మొహమాటంతో.

"ఉంటే ఉండనివ్వండి...అసలు డిన్నర్ తీసుకుని మరీ వెళ్లాలి" అన్నాడు.

రేఖ ఎంత వొద్దన్నా అతను వినిపించుకోలేదు. చివరికి రేఖ ఇంటికి వెళ్ళి ఆమె బట్టలు మార్చుకున్నాక డిన్నర్‌కి వెళ్ళి రాత్రి పన్నెండు అవబోతోంటే తిరిగి ఇంటికి తీసుకొచ్చేడు

థేంక్స్ చెప్పి, "మీ వాళ్ళు ఎదురుచూస్తూ ఉంటారు పాపం !" అంది సిన్సియర్‌గా రేఖ.

నవ్వి, "మా 'వాళ్ళు' ఎవరూలేరు. బ్రహ్మచారిని" అన్నాడు గోపాల్.

కారు దిగి ఇద్దరూ బయట నిలబడ్డారు.

చీకటిగా ఉంది. మినుకు మినుకు మంటోన్న నక్షత్రాల గుడ్డి కాంతి తప్పిస్తే.

రేఖ మళ్ళీ ధన్యవాదాలు చెప్పి వెనుదిరిగింది.

"రేఖా ! ఒక్కమాట" అన్నాడు గోపాల్. ఆ నిశ్శబ్ద పరిసరాలలో చాలా గట్టిగా వినిపించింది ఆ పిలుపు రేఖ ఆగి వెనక్కి వొచ్చింది.

"ఏమిటండి ?" అంది.

"మీరు నన్ను పెళ్ళిచేసుకోండి" అన్నాడు శరీరంలో కదలిక లేకుండానే, గోపాల్.

మూడు నాలుగు నిమిషాలు అలాగే నిలబడిపోయింది రేఖ. సాయంత్రంనించీ ఎంతో సరదాగా ఉన్న ఈ మనిషి ఒక్కసారి ఇంత సీరియస్‌గా ఇలాగ

అడుగుతాడని ఆమెకి సూచన కూడా లేదు.

"మీరు–" అంది రేఖ.

"తొందరపడుతున్నారంటారు–నా వివరాలడగండి. అన్నీ చెప్తాను. దాచుకోవలసిన రహస్యాలేవీలేవు నా జీవితంలో..."

అప్పటికి కొంచెం స్టెడీ అయింది రేఖ.

"కాని నా గురించి మీకేమీ తెలీదు" అంది నీరసంగా. ఆమె జీవన్‌ని తలుచుకుంది. అతను ఆ క్షణాలలో చాలా దూరంగా ఉన్నట్టు కనిపించేడు.

"మీ గురించి అంతా చెప్పండి–వింటాను. సిగ్గుపడవలసినదీ, నాతోగాని, మరెవ్వరితోగాని చెప్పకూడనిది మీ జీవితంలో ఏమీ ఉందనుకోను" అన్నాడు గోపాల్.

ఏమని చెప్తుంది ?

కాదనాలని, తొందరగా అతన్ని పంపెయ్యాలనీ, లేదు.

కాని, అవుననాలనే ధైర్యంలేదు.

జీవన్.

ఆతనితో జరుగుతోన్న కథకి అంతం ఉండదు–ఆశ్రువుల్లోతప్ప....గోపాల్ ...ఇతను–మరో రకం మనిషి.

"రేపు–మాట్లాడుకుందాం" అంది చివరికి.

"అలాగే! కాని, మరీ తీవ్రంగా ఆలోచించకండి ... నేను చాలా గౌరవ నీయుణ్ని. మీరు నాకు చాలా చాలా నచ్చారు..." ఆమె ఏదో అనబోయింది. "నా కార్డు ఉంచుకొండి–రేపు సాయంత్రం వొస్తాను" అన్నాడు.

"ఆఫీసుకి రావొద్దు..."

"సరే. అయిదున్నరకి ఇక్కడికే వొస్తాను" అన్నాడు.

వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు గోపాల్. రేఖకి ఇప్పటికీ బాగా జ్ఞాపకం...నీరసంగా గేటుమీద ఆనుకుని కారు ఎర్రదీపాలు మలుపు తిరిగి మాయమయ్యాక కూడా ఆమె అలాగ చూస్తూనే ఉండిపోయింది.

ఆ రాత్రి అంతా ఆమెకి ఒకటే ఆలోచన.

జీవన్.

అతన్నించి దూరం కాగలదా ?

అతనూ తననించి దూరం కాగలడా ?

అతనేమంటాడు ?

కాదంటే ?

కాని తన జీవితం ? తానూ జీవించాలి—తాత్కాలికంగానైనా ఈ కథకి ఒక మలుపు ఉండాలి.

ఆకర్షణీయంగా ఉన్నాడు గోపాల్, జీవన్ కన్నా. కాని అతనిలో ఉన్న అనురాగం ఇతనిలో ఉంటుందా ?

ఏదీ ఎక్కువ ఆలోచించి చేసే మనస్తత్వం కాదు గోపాల్‌ది. క్షణికోద్రేకంలో పెళ్ళిదాకా వొచ్చేశాడు!

రేపు మనసు మార్చుకుంటే ?

ఆలోచనలు ముసురుకుంటున్నాయి. అశాంతి, ఆశ, భయం—అన్నీ సమూహంగా బాధపెడుతున్నాయి.

రాత్రి ఎలాగో గడిచింది.

ఉదయం ఆఫీసుకి వెళ్ళేసరికి జీవన్ రానే వొచ్చాడు. అతను ఆమెని చిరునవ్వుతో పలకరించాడు.

ఆమెకి అతన్ని మళ్ళీ చూడడం ఎంతో సంతోషంగా ఉంది.

గోపాల్ ఎంతో దూరంగా వెళ్ళిపోయాడు ఆలోచనల్లో.

"బాగున్నారా ?" అంది జీవన్‌ని.

"అక్కడా ? నువ్వు లేకుండానా ?" అన్నాడు జీవన్.

రేఖ ముఖం చిరునవ్వుతో వెలిగిపోయింది. ఏమీ కోరకుండా అన్నీ ఇచ్చేసే మనిషి జీవన్. ఇతనికెలాగ దూరమవను ? అనుకుంది.

కాని...

ఆలోచనలు రాకుండా, గోపాల్ కార్డు జీవన్ ముందు పెట్టి, "అతను నన్ను పెళ్ళి చేసుకుంటాడుట..." అంది

క్షణకాలం స్తంభించిపోయాడు జీవన్.

తరవాత చిరునవ్వుతో, "నీకు నచ్చాడా ?" అన్నాడు.

రేఖ ఏమీ అనలేదు.

"కొంచెం సంగతులు కనుక్కోనీ...తొందరపడకు" అన్నాడు.

సరేనంది.

నాలుగ్గంటలకి గోపాల్ ఫోన్ చెయ్యడం ఆమెకి వాయిదా కోరే అవకాశాన్ని ఇచ్చింది. కాని, ఆమె ఏమీ అనేలోపునే, గోపాల్, రెండు కారణాలవల్ల మీకు ఫోన్ చేశాను" అన్నాడు.

"ఏవిటవి ?" అంది రేఖ.

"ఒకటోది మీ గొంతుక వినడానికి..." అన్నాడు.

"విన్నారు..." అంది రేఖ. ఈ సంభాషణ ఆమెకి చిత్రంగా ఉంది. లోలోపల తియ్యటి సంతృప్తి.

"రెండోది-సాయంత్రం రాలేనని చెప్పడానికి. కోయంబత్తూరు వెళ్ళాలి-తప్పనిసరిగా...మీరు అంగీకారం చెప్పేస్తే సంతోషంగా వెళ్ళి వొస్తాను" అన్నాడు-ఏదో చిన్న విషయంలో అడుగుతోన్నట్టు.

"మీరు తిరిగి వొచ్చాక..."

"ఆలోచన తెగలేదా ?"

"నిజానికి-తెగలేదు."

"ఏమైనా కావాలంటే అడగండి-చెప్తాను."

"ఆదేమీలేదు..."

"మరి ? ఎవరైనా మిమ్మల్ని ఘుందర అడిగారా ?"

"అదీకాదు"

"అమ్మా నాన్నా అడ్డంకులు పెడతారా? అడ్రస్ ఇవ్వండి. నేను వెళ్ళి మాట్లాడతాను."

"ఎవ్వరూ లేరు నాకు-ఉన్నవాళ్ళని అడిగే అవసరంలేదు."

"మరి? నేను నచ్చలేదా ?"

" ఆలోచించుకోనివ్వండి " అంది చిరునవ్వు ప్రతిధ్వనించే స్వరంతో. జలపాతంలాగా వేస్తున్నాడు ప్రశ్నలు...

"సారీ! నాకు తొందర ఎక్కువ. క్షమించండి...ఎల్లుండి ఆరు గంటలకి ఇంటికి వొస్తాను...సరేనా ?"

"సరే..." అంది రేఖ

"మీరు అవునంటే వారం రోజుల్లో-ఆల్‌రైట్...ఎల్లుండి" అని, నవ్వుతూ ఫోను పెట్టేశాడు గోపాల్.

ఆ సాయంత్రం అరగంటసేపు జీవన్‌తో గడిపింది రేఖ-ఆ రోజుల్లో తన జీవితంమీద అధికారం అంతా జీవన్‌కే ఉన్నట్టు ప్రవర్తించేదితాను.

"అతన్ని గురించి కనుక్కున్నాను" అన్నాడు జీవన్ ఉపోద్ఘాతం లేకుండా.

రేఖ మాట్లాడలేదు.

"చాలా మంచిపేరు ఉంది. ప్రాస్పెక్ట్స్ ఉన్నాయి ... చాలా గట్టివాడుట-

కొంచెం తొందరపడే స్వభావం. అంతే."

రేఖ వింటోంది.

"అతను నీ కెలాగ కలిశాడు?" అన్నాడు జీవన్.

రేఖ చెప్పింది.

నవ్వి "నేను లేనప్పుడు జరిగింది ఇదా ?" అన్నాడు.

"అనుకోకుండా జరిగింది...మిమ్మల్ని అడిగి సలహా తీసుకోకుండా ఏమీ చెయ్యను" అంది రేఖ.

చాలాసేపు ఆలోచనలో పడ్డాడు జీవన్.

చివరకి... "నీకూ నాకూ మధ్య ఉన్నది...ఎప్పటికీ చెరగదు-"అన్నాడు.

తల ఊపింది రేఖ.

"నేను స్వార్థంతో నీ జీవితాన్ని పాడుచెయ్యలేను...నీ కిష్టం అయితే అతన్ని తప్పక చేసుకో..." అన్నాడు.

పెద్ద బరువు దింపినట్టు ఉంది రేఖకి.

"కాని, తరవాత కూడా నాకెప్పుడైనా కనిపిస్తూ ఉండు ఇలాగ-రకరకాల బాధల్లో నువ్వే నాకు కొంచెం ఓదార్పు" అన్నాడు జీవన్.

"నాకు తెలుసును" అంది రేఖ. తనదీ జీవన్‌దీ ఒక ఉన్నతమైన స్నేహం. దానిలో సిగ్గుపడాల్సిందీ, దాచుకోవలసిందీ ఏమీలేదు-అంచేత జీవన్ కోరికని కాదనక్కరలేదు...మాలతి మాత్రం అలాగ కాదంటుంది-అందరూ అనుకొనేదే నిజం...నిజమైన నిజం నిజం కాదంటుంది...

"మీ గోపాల్‌కి...మన పరిచయం విషయం తెలీనీకు-మనుషులు సుళువుగా అపార్థం చేసుకుంటారు."

అలాగేనంది రేఖ.

"మా ఆవిడ నా కదలికలు జాగ్రత్తగా గమనిస్తోంది-త్వరగా ఇంటికి వెళ్లాలి. టేక్సీలో వెళ్ళిపో..." అన్నాడు జీవన్. ఆమె అనుమానాలని గురించి అతను తరుచు చెప్తూనే ఉంటాడు.

ఆ మూడోరోజున ఆరుగంటలకి వొచ్చేడు గోపాల్.

వొస్తూనే, "ఏం చేశారు ?" అన్నాడు.

"కూర్చోండి...కాఫీ తాగండి" అంది రేఖ...మాలతి ఇంట్లోనే ఉంది. పరిచయం చేసింది.

"కాఫీ తాగుతాను - ముందర అసలు విషయం చెప్పెయ్యండి" అన్నాడు




గోపాల్.

మాలతి నవ్వుతూ, "మీ రెప్పుడూ ఇంతేనా? లేక ఈ విషయంలోనే ఇంత తొందరా?" అంది.

ఆమెతో నవ్వుతూ, "మంచి మంచి విషయాలన్నిటిలోనూ నాకు తొందరే" అన్నాడు.

"తొందరే కాదు—అట్టే ఆలోచించరనుకుంటాను" అంది మాలతి.

"ఏం? అలాగ అంటారు?" అన్నాడు గోపాల్.

"రేఖ చిరునవ్వులో మీ కేమీ కనిపించలేదా?" అంది మాలతి నవ్వుతూనే.

అప్పుడే కాఫీ తెస్తోంది రేఖ.

కుర్చీలోనించి ఎగిరి లేచి, "రేఖా! మీరు నాకెంతగా నచ్చేరో తెలుసా? ఈ రెండు రోజులూ నిద్రపోలేదు నేను!" అంటూ ఆమెని కౌగలించుకున్నాడు.

ఆమె చేతిలోని కాఫీ కప్ క్రిందని పడింది.

అందరూ తెల్లబోయి చూశారు.

"సారీ!...కాని, ఇది శుభ సూచకం!...రేఖా! మీరు..."అని ఏదో అనబోయాడు.

"మళ్ళీ తెస్తాను" అని లోపలికి వెళ్ళబోయింది రేఖ.

"వొద్దు" అంటూ ఆమెని ఆపేడు గోపాల్. "కాఫీ తాగాలని లేదు. మీ రిద్దరూ రండి...ఇవేళ సెలబ్రేట్ చేద్దాం" అన్నాడు గోపాల్. అతని కళ్ళలో కాంతి రేఖకి ఈనాడూ జ్ఞాపకం ఉంది.

తాను మందలించేదాకా మీరు అంటూనే మాటలాడేడు గోపాల్.

మరో పదిరోజుల్లో ముహూర్తం.

అంతా కలలాగ అయిపోయింది.

తరవాత...

తన వైవాహిక జీవితం, గోపాల్తో. ముందర తన ఉద్దేశాలలోకి అతని గాఢమైన ప్రేమరాలేదు...సామాన్యంగానే తమ జీవితం గడిచిపోతుందనీ,జీవన్ని అలాగ దూర దూరంనించే ఆరాధించవొచ్చుననీ ఆమె అనుకుంది. పెళ్ళికి ముందుండే ఉత్సాహం గోపాల్లో తగ్గకపోవడం.నిజానికి దినదినమూ అతని అనురాగం హెచ్చడం మరికొన్ని సమస్యలని తెచ్చిపెట్టింది.క్రమంగా గోపాల్ మీద ఆమెకి మమత హెచ్చుతూసాగింది...వొద్దు వొద్దనుకున్నా అతన్ని ప్రేమించకుండా ఉండలేకపోతోంది...తన కోసం, తన ఆనందం కోసం అతని తహతహ ఆమెని పూర్తిగా కరిగించేసింది.

ఈ మధ్య జరిగిన ఒక్కొక్క సంఘటనా ఆమెని మరీ కదిలించింది-తన కోసం అతనేమైనా చేస్తాడు.

"ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు ?" అన్నాడు గోపాల్, లేచి కూర్చుంటూ.

"మామూలే..." అంది రేఖ తానూ లేస్తూ.

"అవును...కాని, నా దగ్గర దాచి నన్నెందుకు బాధపెడతావు ?" అన్నాడు గోపాల్ ఆమె చేతిని తీసుకుని ఇంటి లోపలికి నడిపిస్తూ."నీ కన్న నాకెవరూ లేరు...నీకూ, అలాగే అనిపించాలి—నీ బాధ ఏదైనా సరే...నాతో చెప్పు అన్నాడు సానునయంగా.

ఆమె ఆగిపోయింది.

"మన మధ్య ఎంత పలచటిదైనా సరే...తెరలు ఉండకూడదు" అన్నాడు గోపాల్ మృదువుగా.

ఆపుకోలేని కన్నీళ్ళు ఒక్కసారి వెలికి వొచ్చాయి ఆమెకి. అతని గుండెల మీద వాలి, తన కన్నీళ్ళని అపుకుంది.



అతను ఆమెని లోపలికి తీసికెళ్ళేడు.

ఆ క్షణాలలో తన మనసులోని మధన అంతా అతనికి చెప్పి తేలికపడదామని సిద్ధమయింది రేఖ. కాని ఎవరో వొచ్చారు. కారు బయట ఆగింది. డోర్ బెల్.

అతను ఆమె చెంపలునిమిరి, "బాధపడకు...నేను ఉన్నాను" అని డ్రాయింగ్ రూములోకి వెళ్లేడు.

ఆమెబెడ్ రూమ్‌లోకి నడిచింది.

డ్రెస్సింగ్ టేబిల్‌మీద ముద్దొస్తూ గులాబులు...టైగర్ పెట్టి ఉంటాడు. వాసన చూసింది. చేతుల్లోకి తీసుకుంది. ఒక ముల్లు గుచ్చుకుంది.

అద్దంలో చూసుకుంది.

కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అద్దం ముందు ఆ నాటి కార్డు అలాగే ఉంది. 'ఐ లౌ యు.'

'నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను...వొద్దనుకుంటూనే, అవధులులేని విధంగా, నీతో ప్రేమలో పడ్డాను' అనుకుంది రేఖ. ఆ క్షణంలో అతనక్కడ ఉంటే ఆ మాట చెప్పేది.

త్వరగా ముఖం కడుక్కుంది. మళ్ళీ తాజాగా తయారై, టీ ట్రే పట్టుకుని డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళింది...గోపాల్‌ని చూడాలనిపించింది, మరి.

"ఈయన మా డైరెక్టర్..." అంటూ రావ్‌ని పరిచయం చేశాడు.

లాంఛనాలయి టీ తాగుతూ, "మీ ఆయనని ఒప్పించడానికి వొచ్చేను... ఆయన ఏం చేశాడో తెలుసుగా !" అన్నాడు లాల్.

మౌనంగా తల ఊపింది.

"ఈయన అడిగినదంతా చెయ్యడానికి మేము సిద్ధమే-కాని, ఇంకా నలుగురున్నారు...అందరికీ అలాగే చెయ్యాలి" అన్నాడు లాల్. ఆగి, టీ సిప్ చేసి, "మీరైనా చెప్పండి...అక్కడినించి తిరిగి రాగానే మాకు ఈయనే వర్క్స్ మేనేజరు అవాలి !" అన్నాడు.

గోపాల్ కూడా ఆ వార్తవిని ఆశ్చర్యపడ్డాడు. రేఖ ఏమీ అనలేదు.

"మీరు...నాకు సహాయంచేసి ఈయనకి చెప్పండి" అన్నాడు లాల్.

"ఆయన ఇష్టం...ఏం చేసినా నాకు సమ్మతమే" అంది రేఖ.

లాల్ నవ్వుతూ, "గోపాల్ ! చాలా అదృష్టవంతులు మీరు." అన్నాడు.

గంభీరంగా, "అది నిజం" అన్నాడు రేఖ వేపు చూస్తూ, గోపాల్.

లాల్ లేచి, జేబులోనించి గోపాల్ రెజిగ్నేషన్ ఉత్తరం ఆమె కిచ్చి, "దయచేసి ఆలోచించండి...వొచ్చేసారి మీరిద్దరూ అమెరికా వెడతారని వాగ్దానం చేస్తున్నాను...మంచి ఇంజనీర్లని వొదులుకునేవాళ్ళం మేము కాదు" అని, సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు లాల్.

"ఏమంటావు రేఖా ?" అన్నాడు గోపాల్.

రేఖ కాగితం చిన్న చిన్న ముక్కలుగా చింపేసింది...

అతను జాగ్రత్తగా వాటిని అవతల పడవేశాడు.

* * *

మరునాడు సాయంత్రం అతనికోసం ఎదురుచూస్తూ కూర్చుంది రేఖ. ప్రతి నిమిషమూ లెక్క పెడుతోంది.

తొమ్మిదయ్యాక అలిసిపోయి వొచ్చాడు.

రెండురోజుల పని ఒక్కరోజులో చెయ్యవలసి వొచ్చింది కాబోలు. అతని




అలసటనంతనీ తనమీద తీసుకోవాలనిపించింది.

స్నానంచేసి వొచ్చి తల దువ్వుకుంటూ అతను అద్దంమీద కార్డు చూశాడు. తను రాసినదే మళ్ళీ ఆ పంక్తి కిందనే రాసి ఉంది.

ఆ దస్తూరి ఎవరిదో అతనికి తెలుసును.

* * *

"నువ్వు లేకుండా అమెరికా వెళ్ళడం-నాకేమీ బాగులేదు...డబ్బు పోతే పోనీ...ఇద్దరమూ వెడదాము" అన్నాడు గోపాల్.

చిరునవ్వుతో, "చూద్దాం లెండి..." అంది రేఖ.

"కాదు-అలాగే చేద్దాం" అన్నాడు గోపాల్.అతని కి ఉద్దేశం బాగానచ్చింది. "నువ్వు లేకపోతే అక్కడ నాకు గడవదు...అడిగితే ఆ మాత్రం లోన్ ఇవ్వక పోరు..." అన్నాడు.

"నా దగ్గర-చాలా ఉంది" అంది రేఖ.

"ఉండనీ-నేను నిన్ను తీసికెళ్ళాలని కాని, నువ్వు రాలేవని కాదు" అన్నాడు గోపాల్-ఇంక చర్చ అనవసరం అన్నట్టు.

"అదంతా-మీదే" అంది రేఖ.

"నువ్వే నాది!" అన్నాడు గోపాల్ ఆమెని దగ్గరగా తీసుకుంటూ...పది నిముషాలు మధురంగా గడిచాయి.

అర్థం లేకుండా, జీవన్ జ్ఞాపకం వొచ్చాడు రేఖకి. క్షణికంగా బిగుసుకు పోయింది.

ఆమె గుండెలోని ప్రతీ స్పందననీ జాగ్రత్తగా తెలుసుకుంటూన్న గోపాల్ ఆమె ముఖం ఎత్తి కళ్ళల్లోకి చూస్తూ, "ఏమిటయింది?" అన్నాడు.

ఏమీ లేదని తల ఊపింది.

"కాదు...చెప్పు..."

లాలనలో పూర్తిగా కరిగిపోయింది రేఖ.

ఒకటీ ఒకటీ...

తన జీవితం...

జరిగినదంతా, వివరాలతో చెప్పింది.

అతని ముందు, ఏమీ దాచుకోకుండా చెప్పింది. చివరికి బర్త్‌డేనాటి గొలుసు మాట కూడా...ఆ తరువాతి సాయంత్రం-తనకి జరిగినది...అంతా.

నిజం. నిజంగా. అంతా.

హృదయం కడిగి కడిగి, చెప్పింది.

ఏమీ దాచుకోకుండా, తాను ప్రేమించిన, ప్రేమిస్తోన్న తన దైవం ముందు అన్నీ చెప్పేసింది రేఖ.

అన్నీ విని చాలాసేపు ఏమీ అనలేదు గోపాల్.

భయంకరమైననిశ్శబ్దం గదిని ఆవరించింది.

అతని గుండెలమీద పడుకుని ఉంది రేఖ.

హటాత్తుగా ఆమెని తోసి, లేచి కూర్చున్నాడు గోపాల్. అతని ముఖం వికృతంగా ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

"ఆ గొలుసు...తే" అన్నాడు-గొంతుక పోతూ పోతూ ఉన్నట్టు

తెల్లబోయి చూసింది రేఖ.

"తే" అన్నాడు. మార్దవం లే దా ఆజ్ఞలో.

నిద్రలో నడుస్తూన్నట్టు వెళ్ళి తెచ్చింది.

నిలబడి ఆమె మెడలో వేశాడు.

ఏమి జరుగుతోందో బోధపడక అలాగే చూస్తోంది.

"వెళ్ళు" అన్నాడు.

ఆమె కదల్లేదు. తన ప్రపంచం శిధిలాలై, తన చుట్టూ అవి వర్షిస్తోన్న మాటని ఆమె నమ్మలేకపోతోంది.

"గెటవుట్."

ఆమె కదల్లేదు.

కదలలేకపోతోంది

"అవును-ఈ ఇల్లు నీది. మరిచిపోయాను..."

అతను లేచి త్వరత్వరగా బట్టలు వేసుకుంటున్నాడు.

సూట్ కేసులు రెండిటిలో తన బట్టలూ, సామాన్లూ వేసుకుంటున్నాడు.

"నిజం చెప్పేను మీకు" అంది రెఖ, అంతా చూస్తూ.

"నాలో చాలా మూర్ఖత్వం ఉంది...కాని, అది నమ్మేంతలేదు" అన్నాడు గోపాల్ కర్కశంగా.

"నా మాట నమ్మండి...మిమ్మల్ని మోసం చెయ్యలేను" అంది రేఖ... కన్నీళ్లైనా రావడంలేదు.

"వొద్దులే-నన్ను మార్చే ప్రయత్నం చెయ్యకు...నీ వెనక ఇంత చరిత్ర ఉందని తెలీదు...వెడతాను" అన్నాడు గోపాల్. సూట్ కేసులు బయటపెట్టి కారు తెచ్చి డిక్కీలో వేశాడు.

"ఇంత రాత్రి...ఎక్కడికి ?" అంది రేఖ.

"ఎక్కడికో !...నాకూ స్నేహితులున్నారు...ఊరిలో హోటళ్ళు ఉన్నాయి. నా గురించి బాధపడకు" అన్నాడు గోపాల్ కారులో కూర్చుని డోర్ వేస్తూ.

కారు వెళ్ళిపోయింది.

ఎర్ర దీపాలు మాయం అయిపోయాయి.

చాలా సేపలాగే నిలబడి, లోపలికి వెళ్ళి తలుపు వేసుకుంటూంటే ఆమెకి మరోసారి తన జీవిత నాటకంలో తెర వేసినట్లయింది.

ఇల్లంతా వెలవెలబోతోంది.

బెడ్ వెక్కిరిస్తోంది.

నలిగిన దుప్పటీ; దిండు...

కొంచెంసేపటి కిందట అక్కడ జరిగిన కథ.

తాను నిజం చెప్పింది.

అంతగా ప్రేమించిందతన్ని.

* * *

కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుని బయట చీకటిలోకి చూస్తూ చాలాసేపు గడిపింది రేఖ.

నిద్ర రాలేదు.

అలసట తెలీలేదు.

ఈ రాత్రి తన ఇంటి ముందు అతని కారు ఆగదు.

ఈ రాత్రి అతని గొంతుక టెలిఫోన్‌లో నయినా వినిపించదు

కాని రేపు ?

ఎల్లుండి ?

ఆ తరవాత ?

లేచి వెళ్ళి డ్రెస్సింగ్ టేబిల్ మీది గులాబులని దోసిలిలో ఉంచుకుని వొచ్చి మళ్ళీ కూర్చుంది రేఖ. తనకి వాటి ముళ్ళు గుచ్చుకుంటాయనే ఆలోచన లాతేదామెకి.

బాధగా, ముద్దు పెట్టుకున్నట్టు రేఖ వాటిని వాసన చూసి, బయటికివిసిరి, మళ్ళీ కిటికీలోనించి చూస్తూ కూర్చుంది.



# ఓ ఇందిర కథ

## 'శమైతాంగి'

అప్పుడే అరగంటనుంచి బస్సుకోసం వెయిట్ చేస్తున్నది ఇందిర. ఎన్నో బస్సులు వస్తున్నాయి, వెళ్తున్నాయి కాని ఆమె ఎక్కాల్సిన బస్సు మాత్రం రావడంలేదు. వస్తుందనే ఆశాకనిపించడం లేదు. 'రిక్షాలో వెళ్ళిపోతే?' అనే ఆలోచనైతే వచ్చింది గాని, నలభై పైసలతో వెళ్ళాల్సింది రెండు రూపాయ లౌతాయి. ఎలాగూ ఇంతసేపు వున్నాను, మరి కాస్సేపు నిల్చుంటే బస్సులోనే పోవచ్చు ఇంటికి. ఎలాగూ రేపు ఆదివారమే గనుక, కాస్త ఆలస్యంగా వెళ్ళినా ఫరవాలేదు, అని సమాధానం చెప్పుకుని రాని బస్సుకోసం ఆశగా నిరీక్షించ సాగిందామె.

ఎవరో వచ్చారు హఠావిడిగా. ఆమె ప్రక్కగా నిల్చుని ఆమెను కాస్సేపు పరకాయించి చూసింది. ఆమె కళ్ళల్లో ఏదో మెరుపు వచ్చింది. ఆమె దగ్గరగా జరిగి చనువుగా భుజంమీద చేయి వేస్తూ "ఇందూ! నువ్వా! ఇక్కడా?" అంది సంభ్రమంగా.

మొదట ఆమెను గుర్తుపట్టలేని ఇందిర ఈ హఠాత్ సంఘటనకు కంగారుపడింది. తర్వాత నిదానంగా చూసిందామెను. మధ్య పాపిడ తీసి వాలుజడ అల్లుకుంది. చేతినిండుగా మట్టిగాజులు మధ్య మధ్య బంగారు గాజులు వున్నాయి. మెడలో నల్లపూసలతో పాటు బంగారు గొలుసు వుంది. వంటిమీద పట్టుచీర వుంది. ఆమెను ఎక్కడో ఎప్పుడో చూసినట్లుగా వుంది కాని చప్పున గుర్తు రావడంలేదు.

గుడ్లప్పగించి తననే చూస్తున్న ఇందిరవైపు కొంటెగా చూస్తూ "నేను పంకజాన్ని, నన్నప్పుడే మర్చిపోయావా?" అందామె నవ్వుతూ.

"పంకజం నువ్వా! చప్పున పోల్చుకోలేకపోయాను సుమా! నన్ను క్షమించవే. నీలో చాలా మార్పు వచ్చింది." అందుకే నిన్ను గుర్తించలేకపోయాను అన్నట్లు నవ్వింది ఇందిర.

"అవును నా కట్టు బొట్టులో చాల మార్పువచ్చిందికదూ? మరేం చేయనూ. శ్రీవారి కోసం నన్ను నేను మార్చుకోక తప్పలేదు." పంకజం నిట్టూర్చింది.

"ఒకరికోసం నేనెందుకు మారాలి, ఇది నా వ్యక్తిగత విషయం. నా అలంకరణ గురించి ఎవరన్నా విమర్శిస్తే

నేనూరుకోను." తన అలంకారం గురించి ఎవరన్నా వెక్కిరిస్తే వాళ్ళమీద విరుచుకుపడే పంకజం పెళ్ళి కాగానే అతి సామాన్యంగా వుండటంటే నమ్మలేకుండా వుంది ఇందిర. అలా అని నమ్మక తప్పదంలేదు ఎదురుగా కనిపిస్తున్న ఆమె మూర్తిని చూసి.

నేతచీరలు గాని, పట్టుచీరలు గాని కట్టుకుని అమ్మాయిలు కాలేజీకి వస్తే వాళ్ళని చూసి "అమ్మమ్మల తరం వాళ్ళు, వాళ్లకి ఆధునికంగా అలంకరించుకోవడం అస్సలు తెలియదు" అని చీదరించుకునేది. ఎంతసేపూ పల్చటి షిఫాన్, జపాన్ జార్జెట్ చీరలు వగైరాలు కట్టుకొచ్చేది తను. రోజు కో రకంగా అలంకరించుకుని వాటికి తగిన మాచింగ్‌తో సహా వచ్చేది.

అమ్మాయిల్లో ఎవరన్నా "ఈ రోజు శనివారం గుడికి వెళ్దామా ?" అంటే చాలు వికారంగా పెట్టేది ముఖాన్ని. "గుళ్ళు, గోపురాలు మనలాంటి అమ్మాయిలకాదు, అవి బామ్మల కోసం, అమ్మల కోసమూను. మనకెంతసేపూ పార్కులు, సినిమాలు, షికార్లు వుండాలి" అనేది. తనకి, దేవుళ్ళన్నా, దేవతలన్నా నమ్మకం వుండేదికాదు. "ఆ రాతి బొమ్మను పూజిస్తే నీకేం ఒరుగుతుంది. ఆ ఉత్స విగ్రహానికి, మాటా, పలుకా ? ఏం వుంది" అని హేళనగా, వెకిలిగా నవ్వేది. అందుకని పంకజంతో ఎక్కువ మంది అమ్మాయిలు స్నేహంగా వుండేవారే కాదు, అంటీ ముట్టనట్లు వుండేవారు.

ఇందిర, పంకజం, ఎవరి అభిప్రాయాలు, నమ్మకాలు ఎలా వున్నా స్నేహితుల్లా కలిసివుండేవారు. ఇద్దరూ ఫస్ట్‌ఫారమ్ నుంచి, ఇంటర్‌మీడియట్ వరకూ ఒకే వూరిలో వుండి చదువుకున్నారు. పంకజం నాన్నగారు హఠాత్తుగా పోవడంతోనే ఆ వూరినుంచి వారి స్వగ్రామమైన మరో వూరికి వెళ్ళిపోయారు.

బియ్యే సెకండియర్‌లో వుండగా ఇందిరకు పెళ్లయింది. అప్పటికిప్పుడు చూస్తున్నది పంకజాన్ని. ఎంతో ఫేషన్‌గా అధునాతనంగా అలంకరించుకుని ట్రిమ్‌గా వుండే పంకజం, నిరాడంబరంగా పెద్ద ముత్తయిదువులా నిండుగాకనిపిస్తున్నది. కళ్ళు వెడల్పు చేసుకుని స్నేహితురాలిని చూడసాగింది.

"నన్ను చూస్తుంటే ఆశ్చర్యంగా వుందికదూ ?" అడిగింది నవ్వుతూ.

"ఇంతా అంతానా, చాల ఆశ్చర్యంగా వుంది. పట్టుచీర కట్టేవు ఎక్కడికి వెళ్ళి వస్తున్నావు ? పేరంటానికా ? గుడికా ?"

"గుడికే వెళ్ళి వస్తున్నాను. ఈ రోజు శనివారం కదూ !"

అప్పుడు చూసింది ఇందిర ఆమె చేతిలోనిప్లాస్టిక్ బాస్కెట్‌ని. "ఉహూం" అంది.



"నువ్వేమిటిహఠాత్తుగా కనిపించావు? ఎక్కడనుంచి వస్తున్నావు? మీ వారికి ఈ వూరు ట్రాన్స్‌ఫరయ్యిందా? పిల్లలెంతమంది? ఏ పేటలో వుంటున్నారు?" గబగబ తన సందేహాలన్నీ ప్రశ్నల రూపంలో బైట పెట్టింది పంకజం.

"అన్ని ప్రశ్నలు ఒక్కసారేనా?" అంటూ గలగల నవ్వేసిన ఇందిర నెమ్మదిగా తన విషయాలు చెప్పింది క్లుప్తంగా. 'తను ఆరునెలలుగా అక్కడే వుంటున్నట్లు, తనకి పిల్లలు లేరని, భర్త మాత్రం అక్కడ లేడని, మరో ఊరిలో వున్నాడని, అందుకా్కరణం అడగ వద్దని ఆ విషయాలు మరొకసారిచెప్తానని' ప్రామిస్ చేసింది పంకజం రెట్టించి అడిగేసరికి.

నీ వాలకం చూస్తుంటే ఉద్యోగం చేస్తున్నట్లుగా వుంది, నా అనుమానం నిజమేనా ?"

సమాధానం చెప్పకుండా నవ్వి వూరు కుంది ఇందిర. కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత "నీ సంగతి చెప్పు, మీరు వుండేది ఇక్కడేనా ? పిల్లలు ఎంత మంది ? మీ వారి జీతమెంత ?" అడిగింది పంకజాన్ని.

"నీ ప్రశ్నలకు, ఇక్కడ కాదు జవాబు, మా ఇంటి దగ్గర చెప్తాను." నవ్వింది సుతారంగా పంకజం.

"ఇప్పుడు మీ ఇంటికా ?"

"ఇప్పుడు కాక మరెప్పుడు వస్తావు ? ఈ రోజు దాటిపోతే తిరిగి మనం కలుసు కునేసరికి మరికొన్ని సంవత్సరాలు గడిచిపోతాయి. అప్పుడు మన జుట్టు తెల్లబడిపోతుంది. మన పిల్లలు అమ్మలు, నాన్నలు అయిపోతారు. అప్పుడిక మనం చెప్పుకోవడానికి మాటలే వుండవు. కనక నువ్విప్పుడే రావాలి, వస్తావు కూడా" అన్న పంకజం అటుగా వెళ్తున్న ఆటోని కేకేసి 'కొత్తపేట' అని చెప్పి ఇందిర చేయిపట్టుకుని లాక్కెళ్ళి ఆటోలో కూర్చోపెట్టి పోనీయ్ అంది.

నిస్సహాయంగా చూడటం మినహా ఏమీ అనలేకపోయింది ఇందిర.

పంకజం చెప్పిన గుర్తు ప్రకారం ఓ అందమైన చిన్న డాబా ముందు ఆగింది ఆటో.

ఇందిర బ్యాగ్ తెరచి డబ్బు తీయ బోతుంటే 'నీవు నా గెస్టువి తెలిసిందా' అని వారించి ఆటో డ్రైవర్‌కి డబ్బు లిచ్చి ఇందిర చేయిపట్టుకుని ఇంట్లోకి నడిచింది పంకజం.

"ఇంత దూరం వచ్చాక వెనక్కి పారిపోతాననా, నా చెయ్యి వదులు, నేనే వస్తాను" అని ఆమె చేతిలోంచి తన చేయి లాక్కుని ఆమెను వెంబడించింది ఇందిర.

'మమ్మీ వచ్చింది,' 'ఆంటీ' వచ్చింది,' 'పిన్ని వచ్చింది' అంటూ అయిదారుగురు పిల్లలు కిలకిల్లాడుతూ వాళ్ళకు ఎదురు వచ్చారు. వాళ్ళలో పదిహేను మొదలు, మూడేళ్ళ వయసు వరకూ వున్న పిల్లలు వున్నారు. అందరి లోకి చిన్నగా వున్న పిల్లను ఎత్తుకుని ఆ పిల్ల బుగ్గలు నిమిరింది పంకజం ప్రేమగా.

"మమ్మీ అక్క కొట్టింది మలే" అంది ముద్దు ముద్దుగా.

"అలాగా అక్కను కొడతాలే" అంది పంకజం నవ్వి. ఆ మాటతో తృప్తిపడిన ఆ అమ్మాయి తల్లి చేతిలోంచి కిందికి జారి, తతిమ్మా పిల్లల దగ్గరకు పరుగెత్తింది.

"అది మా అమ్మాయి-పేరు సుజన. వాడు మా వంశాంకురం, పేరు సురేంద్ర. ఆ పెద్ద పిల్లలిద్దరూ మా ఆడబడుచు పిల్లలు. వీళ్ళు మా బావగారి పిల్లలు"

అంటూ ఆ పిల్లల్ని పేరు పేరునా పరిచయం చేసింది. వాళ్ళంతా కోరస్‌లా "నమస్తే కొత్త ఆంటీ" అన్నారు చేతులు జోడించి.

"వచ్చావా అమ్మాయీ, ఇంకా రాలేదేంవిటా అనికంగారుపడుతున్నాను" అంటూ హడావిడిగా వచ్చింది ఓ వృద్ధురాలు. ఆవిడ వెనకాల నడివయసులో వున్న యువిధ వుంది.

అత్తగారు, ఆడబిడ్డ అని వాళ్ళని ఇందిరకు, 'నా స్నేహితురాలు' అని, ఇందిరను వాళ్ళకు పరిచయం చేసింది పంకజం.

"అలాగా, చాల సంతోషం. కూర్చోమ్మా" అని, కోడలితో మాట్లాడుతూ వుండమ్మా, ఇప్పుడే వస్తాను" అంటూ పంకజం అత్తగారుతిరిగిలోపలికి వెళ్ళింది పంకజం లెవబోతే "నువ్వు కూర్చుని మీ ఫ్రెండ తో మాట్లాడమ్మా, నేను వెళ్ళి కాఫీ తెస్తాను" అని,పంకజం ఆడబిడ్డా లోపలికి వెళ్ళిపోయింది.

"మీ ఇల్లు మనుష్యులతో చాల ఇరగ్గా వుందే, నువ్వెలా వుంటున్నావే బాబూ, నేనైతే ఒక్క క్షణం వుండలేను బాబూ ఇంత మంది మధ్య." తన మనసులో ఉద్దేశ్యాన్ని బైట పెట్టేసింది ఇందిర.

అలా అంటున్న ఇందిరవైపు తెల్లబోయి చూడసాగింది పంకజం. "మరి కుటుంబ మన్నాక వీళ్ళంతా వుండరా?" అంది అమాయకంగా చూస్తూ.,

"ఇంతమంది వున్న ఇంట్లో ఎట్లా వుండగలుగుతున్నావన్నదే నా సందేహం ...మీ ఆడబిడ్డ కాపురానికి వెళ్ళదా?"

"ఆవిడ కాపురానికెళ్ళాలంటే పరలోకం వెళ్ళాల్సిందే, ఆమె భర్త ఆ పిల్లలు పసివాళ్లుగా వున్నప్పుడే పోయారు.అప్పటి నుంచీ, ఇక్కడే వుంటున్నా రావిడ పిల్లలతో. ఇక ఆమెకు ఎవరూ లేరు మేము తప్పించి. ఇక మా బావగారి పిల్లలు వుండటానికి కారణం, వాళ్ల తల్లి ఈ మధ్యే పోయింది. తల్లి లేని పిల్లల్ని ఎవరు పెంచుతారు? తండ్రి మరో పెళ్ళి చేసుకున్నాడు. ఆవిడకు ఈ పిల్లలంటే అస్సలు ఇష్టం వుండదు. అందుకే వాళ్ళని ఇక్కడే వుంచాము...."

"వుంచాము అంటున్నావు, ఈ సలహా నువ్వే ఇచ్చావా,లేక మీ వారి ఆలోచనా? ఆయన అంటే మాత్రం నువ్వెలా ఒప్పుకున్నావు?మనపిల్లల్ని మనమే పెంచుకునే స్థితిలోలేని మనం, ఇతరుల పిల్లల్ని కూడా పెంచాలంటే ఎంత కష్టం?" అసహనంగా అంది ఇందిర.

ఇతరులు ఎవరే?నా భర్త తోబుట్టువుల పిల్లలే కదా నా భర్త ఆవులు,నాకూ ఆవులే కదా? నాకు నా అన్న తమ్ములు అక్క చెల్లెళ్ళు వాళ్ళ సంతానం ఎంత ముఖ్యమో నా భర్తకి తనబంధువులు అంత ముఖ్యలే కదా" అంది పంకజం.

"ఏమో బాబూ, నాకైతే అటువంటి బంధాలు ఇష్టం వుండదు. భర్త, పిల్లలు

అంటూ వంటరిగా వుండకుండా, ఇంత మంది మధ్య వుండటం, ఎంత బాధగా, విసుగ్గా వుంటుందో...భర్తతో కలిసి హాయిగా సినిమాకో, షికారుకో తిరక్కుండా అనాధ శరణాలయంలా ఇంతమందిని వెంటబెట్టుకుని తిరగాలంటే ఎంత చికాకుగా వుంటుంది? అందుకే అమెరికాలాంటి దేశాల్లో వృద్ధులైన వారికి వేరే వసతి సౌకర్యాలు వుంటాయట. పెళ్ళయిన జంటలు హాయిగా, హేపీగా వుంటారు. వెనక్కాల అత్తా ఆడబిడ్డల బాధ లేకుండా. అటువంటి పద్ధతి మన ఇండియాలో కూడా రాకూడదూ."

"విదేశాల్లో ఆడవారు, కట్టుకున్న భర్త నచ్చకపోతే వెంటనే అతనికి విడాకులు ఇచ్చేసి మరో పెళ్ళి చేసుకుంటారు. అలా ఎన్ని పెళ్ళిళ్లయినా చేసుకుంటుంది హాయిగా, ఆడది అలా మనం కూడా చేసుకుందామంటావా?" సీరియస్‌గా అడిగింది పంకజం.

"ఛీ...ఛీ...అలా ఎందుకు చేసుకుంటాము...? కట్టుకున్నవాడు, మంచివాడైనా, దుష్టుడైనా, దుర్మార్గుడైనా ఆ ఒక్కడితోనే మన తనువు వెళ్ళిపోవాలి. భర్త కిష్టం లేక ఆమెను విడిచి పెడ్తే ఆలో లక్షణా అని ఏడవ్వాల్సిందే గాని మారు మనువుకి చస్తే ఒప్పుకోదు మన భారత స్త్రీ, ఇప్పుడిప్పుడు, అటువంటివారు, భర్త పోయిన యువతులు, పాత సంప్రదాయాన్ని, కట్టుబాట్లను సడలించుకుని పునర్వివాహం చేసుకుంటున్నారనుకో. కాని అది చాల అరుదే. కాని నా ఉద్దేశ్యం ఏమంటే..." ఆగింది ఇందిర మాట పూర్తిచేయకుండా.

"ఇతర బంధాలేవీ లేకుండా తనూ, భర్తా చిలకా గోరింకల్లా వుండాలంటావు" ఇందిర అసంపూర్తిగా వదిలేసినమాటను పూర్తిచేసింది పంకజం.

"కొన్నాళ్ళన్నా ఫ్రీగా లేకుండా అత్తా, మామా, ఆడబిడ్డ, మరిది అంటూ ఈ చికాకులెందుకు బాబూ" ముఖం చిట్లించి ఇందిర అంటుంటే పంకజం నవ్వకుండా వుండలేకపోయింది. అయితే నువ్వు ఆరునెలలుగా ఇక్కడేవున్న కారణం ఇపుడు అర్థంఅయిందిలే. మీ అత్తా మామలు మీతో కలిసి వుండటం నీకు ఇష్టంలేక, లక్షణమైన కాపురాన్ని తెంచుకుని వచ్చేసి వుంటావు అవునా?" అడిగింది పంకజం.

ఇందిర మాట్లాడలేదు. మౌనం అర్ధాంగీకారంగా వుండిపోయింది.

"కాని ఇది మంచి లక్షణం కాదు ఇందూ. నీ పుట్టింటినే ఊహించుకో. నీకు అక్కా చెల్లెళ్ళు, అన్నదమ్ములు అంటూ చాలా బలగమే వుండవచ్చు. మీ అన్నయ్యకు పెళ్ళవుతుంది మీ వదిన వస్తుంది. ఆవిడకు మీ వాళ్ళెవరూ ఇష్టం వుండదు. మీ వాళ్ళు వుంటే నేను వుండను. మీ వాళ్లను విడిచి మనం దూరం పోయి వుందాము, వంటరిగా 'అంటుందనుకో'

అప్పుడు నీ కెలా వుంటుంది? మీ వదిన గారి ఉద్దేశ్యం మంచిదని అనుకోగలవా? భార్య పోరు పడలేక వేరే వెళ్ళి కాపురం పెట్టిన అన్నగారిని మెచ్చుకోగలవా? ఒక్కనాటికీ మెచ్చుకోలేవు సరికదా భార్యా విధేయుడు అని బిరుదిచ్చి అతన్ని ఏవగించుకుంటావు. అలా కాక అతను తన భార్య మాటకు విలువనివ్వకుండా తన తలితండ్రులను, అక్కచెల్లెళ్ళను, అన్నతమ్ములను విడవకుండా ప్రేమగా, అభిమానంగా చూచుకుంటే మా అన్నయ్య చాల మంచివాడు. మేమంటే ఎంత ప్రేమ, పెళ్ళైనా వాడి మనసు మారలేదు. ఇటువంటి అన్న లభించడం మా అమ్మా నాన్నల అదృష్టం అని మురిసిపోతావు, పొంగిపోతావు, ఎందుకని? మన సంప్రదాయాలు, ఆచారాలు, మన ప్రేమాభిమానాలు మనలో బంధుప్రీతిని పెంచుతాయేగాని తుంచలేవు. మన జీవన విధానమే వేరైనది. మనకి 'నా' అన్న వాళ్ళంతా కావల్సినవాళ్లేను. మనకి స్వేచ్ఛ కావాలని,అత్తింటివారిని దూరం చేసుకోవడం భావ్యంగా వుంటుందా? కొడుకుల కోసం కలవరిస్తారు ఎందుకని? తమ వృద్ధాప్యంలో ఆదుకోవాల్సినవాడు కొడుకే. ఇష్టం వున్నా లేకపోయినా లోకం కోసం అయినా, కర్తవ్యపాలన కోసం అయినా తల్లి తండ్రులను,తలచెడిన తోబుట్టువుని, తన కన్న చిన్నవారిని ఆదుకోవలసిన వాడు కొడుకే గనుక, అటువంటి కొడుకు కావాలని కోరుకుంటారు తలిదండ్రులు.

తమని ఆదుకోవలసిన కొడుకు పెళ్ళి కాగానే భార్యా విధేయుడై, స్వార్థపరుడై తన దారి తాను చూసుకుంటే,ఆ కొడుకు మీద ఎన్నో ఆశలు పెట్టుకున్న ఆ కన్నవారి మనసు ఎంత ఆక్రోశిస్తుందో ఆడది అవగాహన చేసుకుంటే ఆ అత్తవారి నుండి తన భర్తను విడదీయాలని కలలో కూడా అనుకోదు. తన అన్న తమ్ములు మాత్రం, పితృ విధేయులై వుండాలని, తన భర్త మాత్రం తను గీచిన గీటు దాటకూడదని స్వార్థపరురాలైన ఆడది మాత్రమే కోరుకుంటుంది. అలా అని తన భర్త సంపాదనంతా అత్తా ఆడబిడ్డలకేదారపోయమని కాదు నా అభిప్రాయం. వాళ్ళు కూడా తన ఆడపడుచులేకదా,అనే సమదృష్టి వుండాలి అంటాను. అత్తా ఆడబిడ్డ స్థానాల్లో వున్న స్త్రీలు కూడా తమ ఇంటికి వచ్చే నవ వధువుని ప్రేమగా, ఆదరించాలి. ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవించాలి.ఆమెను ఆ ఇంటి గృహిణిగా, ఆడపడుచులిగా మన్నించి ఆదరాభిమానాలు చూపించాలి. అప్పుడే ఆ నవవధువు ఆ ఇంటి వాతావరణంలో పాలూ నీరూలా కలిసిపోగలదు. నన్నే చూడు, మా అత్తా ఆడ బిడ్డ ఎంతో అభిమానంగా చూస్తారు. వాళ్ళంటే నాకూ అంత అభిమానంగానే వుంటుంది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, ఒక వ్యక్తి భార్యగా,గృహిణిగా

ఇంట్లో అడుగు పెట్టిన ఆడది ఆ కుటుంబ శ్రేయస్సుకై ఆలోచించాలి. తను సుఖపడి, తన చుట్టూ ఉన్న వారిని సుఖపెట్టాలి, అందుకోసం ప్రయత్నించి సాధించాలి. అంతే గాని సమిష్టిగా వున్న కుటుంబంలో చీలికలు తీసుకు రాకూడదని ఉద్యోగ రీత్యా దూరంగా వెళ్ళిపోవలసివస్తే అది సమస్యే కాదు. కాని తప్పనిసరి పరిస్థితుల్లో ఉమ్మడిగా ఉండాల్సి వచ్చినప్పుడు భరించాలి తప్పదు." పంకజం ఆవేశంగా లెక్చరిస్తుంటే దిగ్భ్రాంతిగా చూస్తూండిపోయిందేగాని, పెదవి కదిపి ఒక్కమాటా చెప్పలేకపోయింది ఇందిర. పంకజం ఆవేశం తగ్గి మామూలు ధోరణిలో పడ్డాక "రాజకీయాల్లోకి దూకపోయావా, పనికి వచ్చేదాని." వ్యంగ్యంగా నవ్వింది ఇందిర.

"అందుకు పనికివచ్చేవారు వేరే వుంటారులే. సంసారమనే ఈ రాజకీయాల్ని దాటనియ్యి ముందు" తనూ తేలిగ్గా నవ్వేసింది పంకజం.

చిన్నమాటకు ఎంత పెద్ద ఉపన్యాసం ఇచ్చావే నీ కట్టు బొట్టుతోపాటు నీ హృదయాన్ని కూడా సంస్కరించారన్న మాట మీ శ్రీవారు. అయితే ఆయన్ని తప్పకుండా మెచ్చుకోవాల్సిందే. మొత్తానికి నిన్ను మీ శ్రీవారు తన అభిరుచులకు అనుగుణంగా మలచుకున్నారు.

"ఆయనేం నన్ను మార్చలేదు. భర్తకనుగుణంగా, ఆయనకు నచ్చేపద్ధతిలో నడుచుకుంటేనే ఎక్కువ ఆనందం లభిస్తుందని నన్ను నేనే సంస్కరించుకున్నాను, ఆనందిస్తున్నాను కూడా." ముఖాన్ని ముడుచుకుంటూ అంది పంకజం.

"కేవలం ఆయన మనసు గ్రహించే మార్చుకున్నావా నీ భావాలను అసంభవం" నమ్మలేనట్లు చూసింది ఇందిర.

"నిజంగా, ఆయన నోరు తెరచి, అలా వుండకు, ఇలా వుండు, అని ఏ ఒక్కరోజూ నాతో అనలేదు. నేను అతిగా అలంకరించుకున్న రోజున, చాల ముభావంగా, పరాయి వారిలా ప్రవర్తించేవారు. అలంకరించుకోవడానికి బద్ధకించి సింపుల్‌గావున్న రోజున నాతో చాల క్లోజ్‌గా వుండేవారు. నేను అడక్కుండానే నన్ను సినిమాకో, షికారుకో తీసుకెళ్ళేవారు. "ఈ రోజు నా కంటికి చల్లగా ఆహ్లాదకరంగా కనిపిస్తున్నావు సుమా!" అని ప్రశంసించేవారు. అదీగాక ఓ చిన్న సంఘటన నా స్వభావాన్ని మార్చివేసిందంటే నమ్ముతావా ?"

ఓ రోజు గుడికి బయలుదేరాము, నేనూ ఆయనాను. నేను పల్చటి షిఫాన్ చీర కట్టుకుంటే ఆయన అదోలా నవ్వుతూ "మనం వెళ్లేది పార్టీకి కాదు, గుడికి. కనుక కాస్త సభ్యతగా వెళ్తే బాగుంటుందేమో అన్నారు. ఆమాటలోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకుని, అయిష్టంగానే పట్టుచీర




కట్టుకుని తలలో పూలు పెట్టుకుని బయలు దేరాను. టాక్సీలో వెళ్ళకుండా బస్సులో వెళ్ళాము ఆదే బస్సులో ఇద్దరు యువతులు ఎక్కారు. వాళ్ళ వయసు పాతికపైన, నలభై లోపు వుంటుందేమో. చాల ఫేషన్‌గా వున్నారు. పల్చటి చీరలు వాళ్ళ వయసుని దాచడంలేదు. వాళ్ళ వెనకాల నలుగురు అబ్బాయిలు పడ్డారు. రకరకాల మాటలతో, గూడార్థాలతో వాళ్ళని ఏడిపిస్తున్నారు. ఆ యువతులు పాపం చాల సిగ్గుపడి పోతున్నారు. కాని అబ్బాయిలను ఏమీ అనలేకపోతున్నారు. వాళ్ళున్న పరిస్థితిలో నా ప్రక్కన ఓ పండు ముత్తయిదువ కూర్చొని వుంది. ఆవిడ తన దగ్గర కూర్చున్న ఆమెతో నన్ను చూపిస్తూ "ఆ అమ్మ ఎంత లక్షణంగా వుంది, వాళ్ళు చూడు ఎలా వెకిలిగా, అలంకరించుకున్నారో, అబ్బాయిలు ఏడిపించారంటే మరి ఏడిపించరా, అటువంటి వాళ్ళను చూసి" అని. ఆ మాటలు వింటున్న నాకు వళ్ళు జలదరించింది. ఆ సమయంలో నేను వాళ్ళలా అలంకరించుకోనందుకు నన్ను నేను చాల అభినందించుకున్నాను. ఆ రోజునుంచే నేను చాల మారిపోయాను. తక్కువ అలంకారంతో ఎక్కువ ఆదరణను ఆయననుండి పొందుతున్నాను. నన్ను చూసుకుని నేను గర్వపడేకన్న, ఇతరుల నుంచి ఎక్కువ ఆనందాన్ని, తృప్తిని పొందడమే నాకు ఎక్కువ సంతోషాన్ని కలిగిస్తున్నదప్పుడు.

నా యిష్టప్రకారము, నాకు నచ్చిన రీతిలో నడుస్తాననుకో, అప్పుడు నాకు లభించేది నా ఒక్కదాని ఆనందమేను. కాని ఇప్పుడో, ఇంట్లో అందరిచేతా

మన్ననలు పొందుతున్నాను. నేనంటే శ్రీవారు ప్రాణం పెట్టారు. అత్తా, ఆడ బిడ్డలు, ప్రతిక్షణమూ నా గురించే ఆలోచిస్తారు. పిల్లలు నేను కనిపించకపోతే కలవరించిపోతారు. ఇప్పుడు చెప్పు ఆడదానికి ఇంతకన్న కావాల్సిందేమిటి ?" పంకజం నవ్వుతూ ఇందిరవైపు చూసింది. ఆ నవ్వులో ఎన్నో ప్రశ్నలు 'ఇలా నీవు నీ జీవితంలో సాధించ గలిగేవా ? సాధించగలవా ? నీ వల్ల నీ ఇంట్లో ఎవరికైనా తృప్తివుంటుందా?' అనేవి తొంగిచూసినట్లు ఊహాగానం చేసిన ఇందిర మనసులోనే ఉలిక్కి-పడింది. తప్పు చేసిన అపరాధిలా లోలోపల ముడుచుకుపోయింది. ఆమెకు ఆలోచించుకోవడానికి వ్యవధి నిస్తున్నట్లుగా, "కూర్చో" ఈ వీక్లీ తిరగేస్తుండు. చీర మార్చుకొస్తాను" అంటూ ఆ చోటు విడిచి వెళ్ళిపోయింది పంకజం.

పంకజం అత్తగారు, కాఫీ, టిఫిన్ తెచ్చి ఇందిర ముందు పెట్టింది. అవి తీసుకోవడానికి ఇందిర మొహమాట పడినా ఆవిడ ఊరుకోలేదు. ఆవిడ బలవంతంమీద తిన్నాననన్న పేరుకి కాస్త తిని కాఫీ త్రాగింది ఇందిర.

తర్వాత ఇందిర స్వవిషయాలు అడిగింది. అన్నిటికీ చాల క్లుప్తంగా జవా బిచ్చింది ఇందిర. ఓ అరగంట కూర్చుని లేచిందామె వెళ్తానంటూ. అసలు ఆ పూటకు అక్కడే వుండిపోమని బలవంతం చేసారు వాళ్ళంతా. ఇంటిదగ్గర తన కోసం ఎదురుచూస్తారంటూ బయలు దేరింది ఇందిర, వినకుండా. పంకజం, బస్టాండు వరకూ వచ్చి ఇందిరను బస్సెక్కించి వెళ్ళింది

బస్సులో కూర్చున్న ఇందిరకు పంకజం కుటుంబమే గుర్తు రాసాగింది. పంకజం కుటుంబం ఎంత హాయిగా వుందో, స్వేచ్ఛగా స్వతంత్ర భావాలతో పెరిగిన పంకజం అంతమందిలో తానూ ఓ మనిషిగా కలిసిపోయి, నేర్పుగా, ఓర్పుగా సంసారాన్ని చేసుకుంటున్నది కాని తానో నలుగురి మధ్యా పెరిగినా, పదిమందిగల కుటుంబంలో నిలవలేక స్వేచ్ఛని కోరుకుంటూ వచ్చేసింది. వచ్చిన కొత్తలో వారానికి ఓ ఉత్తరం వచ్చేది భర్త దగ్గరనుంచి "నువ్వు ఎప్పుడు వచ్చేది తెలియజేస్తే వచ్చి తీసుకెళ్తాను అంటూ. తనకింకా తెలియదు, ఆ సంసారం చేయడం ఇష్టంలేకే తను వచ్చేసినట్లు, ఇక్కడ తను ఓ ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నట్లూను. ఆ ఉత్తరాలన్నీ చదివి పొయ్యిలో పారేసేది. కనీసం జవాబు కూడా ఇచ్చేదికాదు. కాని పంకజం భర్త ఆనందం కోసం, అతని బలగం కోసం తనని తనే మార్చుకుంది. సంతోషంగా తృప్తిగా బ్రతుకుతున్నది. కాని తనో... ? 'నీ కోసం, నీ ఆనందం

కోసం, నీ స్వేచ్ఛ కోసం నువ్వు బ్రతుకుతున్నావు' అంది మనసులోని మరో మనిషి. 'అవును నా కోసం నేను బ్రతుకుతున్నాను అంతే ' నిర్లిప్తంగా గొణుక్కుందామె.

ఆమె ఆలోచనలకు బ్రేకుపడింది వెనక సీటులోంచి వినిపిస్తున్న మాటలకి వెనక్కి తిరిగి చూసింది ఇద్దరు నడివయసు దాటిన స్త్రీలు కూర్చుని, బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు.

ఎర్ర చీర కట్టుకున్న ఆమె అంటున్నది. "వాడు మాత్రం ఎన్నాళ్ళు ఆగుతాడమ్మా? వయసులో వున్నవాడు, కోరిక లేకుండా వుండటానికి వాడేమైనా సన్యసించాడా? అందుకే మేమంతా పట్టుబట్టి మళ్ళీ పెళ్ళి చేయించాము ఈసారి చదువుకున్న పిల్లని చేయలేదులే ఏదో కాస్త అక్షరజ్ఞానం వున్నపిల్లయితే చాలన్నాడు వాడేను. ఓసారి చదువుల బొమ్మను చేసి అనుభవించాము కదా." గళ్ళ చీరావిడ అంటున్నది. "మరి ఈ సంగతి అదే తన మొగుడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని ఆ అమ్మాయి కి తెలిసిందా ?" అని.

"ఎందుకు తెలియదూ ?! ఓ వేళ తెలియకపోతే ఈ తర్వాత తెలుసు కుంటుంది. అమ్మ పెట్టా పెట్టదు,అడుక్కు తినానియ్యదు అన్నట్లు తనూ కాపురం చేయక, మరో ఆడదాన్ని రానివ్వదా ? అయినా ఇప్పుడు దానికేం లోటు. బళ్లో మేస్టరుపని చేస్తున్నదట. నెమ్మదిగా ఎవరో చేరదీస్తారు. ఈ రోజుల్లో ఇలా జరగడం మామూలైపోయింది వదినా. మా సుగుణ మొగుడు వాళ్ళ ఆఫీసులో పనిచేసే అమ్మాయిని ఉంచుకున్నాడు. మొదట్లో మా సుగుణ మొగుడు చేసిన పనికి పోట్లాడింది, ఏడ్చింది అలిగింది, పుట్టింటికి పోయింది. 'నువ్వు ఏమన్నాకా నేను మాత్రం ఆ అమ్మాయిని వదిలి పెట్టేదిలేదు అని కరాఖండిగా చెప్పేసాడు నువ్వూ రా, నిన్నూ నీ పిల్లల్ని లోటు రానివ్వకుండా చూసుకుంటాను. అన్నాడు చదువాట్టే లేని మా సుగుణ, భర్త చాటున బ్రతకడం నేర్చుకున్న మా సుగుణ చేసేదేంలేక తిరిగి ఆ భర్త దగ్గరకే వచ్చింది మరో మార్గం తెలియక. ఉంచుకున్నదాన్ని, మా సుగుణను కూడా బాగానే చూసుకుంటున్నాడు మన దేశంలో ఆడది, తండ్రి చాటునా, లేక భర్త చాటునా, లేదా అన్నదమ్ముల పంచనా తప్పించి వంటరిగా, ధైర్యంగా బ్రతకలేదు. చదువుకున్న పిల్లలైతే ఏ కాస్త పొరపాటు జరిగినా ఈ మొగుడూ వద్దు,ఈ కాపురమూ వద్దని ఇప్పుడిప్పుడు వీధులెక్కుతున్నారనుకో." 'అడ్డ రోడ్డు' అంటూ అరిచాడు కండక్టరు. ఎర్ర చీర. గళ్ళ చీర ఉలిక్కిపడిలేచాయి. కంగారు పడుతూ కిందిగి దిగాయి. వాళ్ల వెనక్కాలే దిగింది ఇందిర. ఆమె మనసంతా చేదు మాత్ర తిన్నదానిలా అశాంతిగా, తిక్క

తిక్కగా వుంది. కొంపదీసి తన భర్త కూడా మరో పెళ్ళి చేసుకోడుగదా? అందులో ఆశ్చర్యం ఏముంది? అసలీ పాటికే ఎవర్నన్నా చేరదీసి వుండొచ్చు. అందుకే తన దగ్గరనుంచి ఉత్తరాలు రావడం కూడా ఆగిపోయాయి. ఆ ఆలోచనరాగానే మనసుకో ఏదో ఆరాటం ఆందోళనా బయలుదేరాయి ఓ వేళ అదే నిజమైతే తను ఏం చేయగలదు? ఉహూం ఏమీ చేయలేదు. 'నా భర్త నన్ను వది లేసాడు నాకు అన్యాయం చేసాడు' అని సిగ్గు విడిచి కోర్టు కెక్కగలదా? నిజానికి ఆ రెండు పనులు అంటే, భర్తని వదిలి పెట్టడం. ఆ సంసారం నా కక్కర్లేదు, అని వచ్చేసిందే తను, అటువంటప్పుడు, సిగ్గూ అభిమానం వదిలేసి ఎవరితో మొరపెట్టుకుంటుంది?' ఆలోచన్లతో నడుస్తున్న ఇందిర ఓ రిక్షా కింద పడబోతే దారేపోయే వారెవరో చటుక్కున ఆమె చేయి పట్టుకుని ఇవతలకు లాగారు.

"రోడ్డు మీద నడిచేటప్పుడు కాస్త జాగ్రత్తగా వుండాలమ్మా అని హెచ్చ రించాడతను.

అతనికి కృతజ్ఞత చెప్పుకుని గబగబ నడిచి ఇల్లు చేరుకుందామె.

మూసివున్న తలుపుల మీద చేయి వేస్తూ ఆగిపోయింది. గదిలోంచి అన్నా వదినలు మాట్లాడుకోవడం వినిపిస్తున్నది.

"మీకు మరో వూరు ట్రాన్సఫరయి నట్లు మీ చెల్లెమ్మకు చెప్పారా?" అని అడుగుతున్నది వసంత

"ఇంకా లేదు, ఆ విషయమే ఆలోచిస్తున్నాను," అంటున్నాడు ప్రకాశం.

"ఆ ఉత్తరం అయినా చూపించారా?"

"ఊహూ, అప్పుడే చెప్పడం ఎందుకని ఆగాను అదీగాక ఆ ఉత్తరంలోని సంగతులు ఎంతవరకు నిజమో తెలుసు కోకుండా ఆ విషయాలు బైటపెట్టేదాని మనసు నొప్పించడం నాకిష్టం లేదు. నువ్వు మాత్రం ఆ ఉత్తరాన్ని ఇందు కళ్ళబడకుండా చూడు. ఎప్పుడో రాబోయే ప్రళయం ఇప్పుడే వస్తుంది లేకపోతే" అనే అన్నగారి మాటకు మనసులోనే తృళ్ళిపడిన ఇందిర, 'ఎక్కడ నుంచి వచ్చింది? ఎవరు రాశారు ఆ ఉత్తరాన్ని? అనుకుంది కంపరంగా. ఓ వేళ ఆ ఉత్తరంలోని విషయాలు నిజమే అయితే ఏం చేస్తారు? కోర్టు కెక్కు తారా?" వసంత సందేహాన్ని వ్యక్తం చేసింది మళ్ళీ.

"ఓ వేళ కోర్టు కెక్కినా మనమే ఓడిపోతామేమో...'నా భార్య కాపురానికి రావడంలేదు మరి మళ్ళీ వివాహం చేసుకోక ఏం చేయను' అనే పాయింటు తీస్తాడేమో ఆయన. ఏది చేసినా ముందు దానిలో నిజా నిజాలు తెలుసుకుని, ఆ తర్వాత ప్లీడరుతో సంప్రదించిగాని ఏదీ చేయను. ఇందు వచ్చేస్తుందేమో ఆ మాటలు ఎత్త వద్దిక" అని ప్రకాశం




అనగానే వసంత మౌనంగా వుండిపోయింది.

అప్పుడే వచ్చినట్లు శబ్దం చేస్తూ 'వదినా' అని పిలిచింది ఇందిర. ఎక్కడ వాళ్ళు అక్కడ స్తంభించుకుపోయినట్లు అతి నిశ్శబ్దంగావున్న గదిలోకి వాడిపోయిన ముఖంతో అడుగు పెట్టింది ఇందిర

"ఆఫీసులో పని తెమలలేదా? లేక బస్సు అందలేదా? నీ కోసమే బయలు దేరుతున్నారు మీ అన్నయ్య." పెదవుల మీదకు నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది వసంత.

"ఎందుకూ రావడం? నేనేమైనా చిన్నపిల్లనా రాలేకపోవడానికి? నే నెక్కిన బస్సు దారిలో చెడిపోయింది. అది బాగుచేసి తిరిగి బయలుదేరేసరికి ఈ టైమయ్యింది" ఇందిర బట్టలు మార్చుకోవడానికి గదిలోకి వెళ్ళిపోయింది.

'అన్నం తిందువుగాని రా' అని వసంత ఎంత పిలిచినా 'నాకు ఆకల్లేదు వదినా' అంటూ కూర్చుంది. మనసులో రెండు ప్రశ్నలు తలెత్తి ఆమె మనసుకి శాంతి లేకుండా చేస్తున్నవి

ఒకటి 'అన్నయ్యకు ట్రాన్స్‌ఫరై వెళ్ళిపోతే తను వంటరిగా ఎక్కడ వుండాలి? అన్నది. రెండోది ఆ ఉత్తరం ఎక్కడనుంచి వచ్చింది? ఎవరు రాశారు? ఏమని రాసారు? ఆ ఉత్తరానికి, నా భవిష్యత్తుకి సంబంధ మేమిటి?' అనేది. ఈ రెండు ప్రశ్నలు ఇంతై, అంతై చివరకు ఆమె మనసంతా ఆక్రమించుకుని కుమ్మరి పురుగులా దొలుస్తున్నది మనసుని.

తనకి కాస్త మజ్జిగ ఇచ్చి అన్నా వదినలు భోజనానికి కూర్చున్నాక ఆ ఉత్తరంకోసం గాలింపు మొదలు

పెట్టింది ఇందిర ఎక్కువ శ్రమపడకుండానే ఆ ఉత్తరం దొరికిందామెకు.

దానిమీద ఉన్న అడ్రసునిబట్టి అది అముతాపురంనుంచి వచ్చినట్లు, అన్నగారి స్నేహితుడు మురళీక్రిష్ణ అనే అతను దాన్ని రాసినట్లు గ్రహించి ఆ ఉత్తరాన్ని ఆమూలాగ్రంగా చదివేసింది. తర్వాత తెలిసిన విషయం ఏమంటే? తన భర్త ఆ ఊరు పెళ్ళిచూపులకోసం వెళ్ళినట్లు గ్రహించి ఆమె మనసు ఉక్కిరిబిక్కిరై పోయింది ఓ క్షణం. ఇది నిజమేనా? తన భర్త మరో పిల్లను పెళ్లిచేసుకోవడానికి సిద్ధపడుతున్నాడా? ఎంత నీచం...ఛీ...ఛీ...ఇందిరకు భర్తమీద ఎంతో అసహ్యం వేసింది. భార్య బ్రతికి వుండగానే మరో పెళ్ళా? ఇందుకు చట్టం ఒప్పుకుంటుందా? ఎందుకు ఒప్పుకుంటుంది? కాని చట్టం దృష్టిలోపడి నేరం రుజువు కావాలికదా? నువ్వు 'నా భర్త, నన్ను వదిలేసి మరొ కర్తిని కట్టుకున్నావు' అని కోర్టు కెక్కగలవా? ఓ వేళ వెళ్ళినా అప్పుడు నేరం నీ మీదకే తిరగుతుంది? నా మీదకా! ఎలా? పిచ్చిదానిలా గొణుక్కుంది.

"ఎలాగా? నీ మనసు మారి పోయిందని, నీతో కాపురం చేయడం ఇష్టం ఇష్టంలేదని కోర్టులో నా భర్త వాదిస్తాడు?"

"అంటే?"

"అంటే ఏంపీలేదు నీ శీలం చెడిపోయినట్లు రుజువు కూడా సృష్టించ గలడు నీ భర్త" ప్రశ్న, జవాబు కూడా తనే చెప్పుకుంటున్న ఇందిర ఆ పైన ఇక ఆలోచించలేకపోయింది.

"అయితే ఇప్పుడు నేనేం చేయను?" పిచ్చిదానిలా మనసుని ప్రశ్నించుకుంది.

"తిన్నగా నీ భర్త దగ్గర కెళ్ళిపో. అన్ని సమస్యలు వాటంతటవే సర్దుకు పోతాయి" మనసు హితబోధ చేయసాగింది.

"పిలవని పేరంటంగా వెళ్తే వాళ్లకి లోకువకానూ?"

"నీ ఇంటికి నీవు వెళ్లడానికి బొట్టూ, కాటుకా పెట్టి పిలవాలా? గుమ్మంలోకి వచ్చిన భార్యను ఏ మగవాడూ తూలనాడడు, చెండనాడుకోడు. ఓవేళ అన్నా, 'నా ఇంటికి నేను వచ్చాను' అను చాలు. దానిలో సిగ్గుపడాల్సింది, అవమానం పొందాల్సింది ఏంపీ లేదు. అక్కడ చికాకులంటావా? పెళ్లయిన ఆడబిడ్డలు, చదువుకునే మరుదులు ఎల్లకాలమూ నీ దగ్గర పడివుండరు. వాళ్లు ఎటువంటివారైనా నీ భర్త గుణం నీకు తెలుసు కదా? భార్య రాగానే అయినవారంతా విషమైపోయాము అనే మాట రావడం ఆయనకు ఇష్టంలేదు. రేపు నీకే ఓ కొడుకు పుట్టాడు. పెరిగి పెద్దయ్యాక పెళ్లి చేస్తావు. భార్యమీద మోజుతో, నిన్ను నీ భర్తను చిన్న చూపు చూస్తాడు — అప్పుడు నీ మన














సెలా వుంటుందో ఒక్కసారి ఆలోచించి చూడు నీకే తెలుస్తుంది. ఆ మానసిక వేదన ఎంతనరకమో అందుకే ఓర్చుకో, ఆ ఓర్పే నీకు కొండంత ఆనందాన్ని, తృప్తిని ఇస్తుంది. పంకజాన్ని చూడు ఎలా మారిపోయిందో?తన చుట్టూ శాంత మనే కోటని కట్టుకుంది. పదిమంది కోసం నవ్వుతూ బ్రతుకుతున్నది. ఆపదిగాని మగాడు గాని,'ఇది నా యిల్లు, నా పిల్లలు, నా భర్త లేదా, నా భార్య, పిల్లలు, నా ఇల్లు' అనే స్వార్థంతోతనచుట్టూ ఓ గిరిగీసుకుంటే, అది అతనికే, లేదా ఆమెకే తృప్తిని ఆనందాన్ని ఇస్తుంది. అంతేగాక ఇది మా ఇల్లు, వీళ్లంతా నా వాళ్లు అనుకుంటే ఆ ఆనందాన్ని తృప్తిని పదిమందితోనూ కలిసి అనుభవిస్తారు. మనసు లోతుల్లోంచి వివేకమనే జ్ఞానబోధ చేయసాగారెవరో. అన్నా వదినల భోజనమయింది కాబోలు అన్నగారు బ్రేవ్‌మని తేనుస్తూ వస్తున్నాడివతలకు. చేతిలోని పుస్తకాన్ని ఎక్కడనుంచి తీసిందో అక్కడ పెట్టేసి ఏమీ ఎరగనట్లు ఆ వారం వీక్లీ చేతిలోకి తీసుకుంది ఇందిర.

ఆ రాత్రి కలతగా పట్టిన నిదురలో తను తిరిగి అత్తవారింటికి వెళ్ళినట్లు "ఎందుకు వచ్చావు ? సిగ్గు లేకపోతేసరి తగుదునమ్మా అంటూ వచ్చావా ? ఛీ-పో' అంటూ భర్త ఓ వైపు, అత్తగారు ఓ వైపు దుయ్యపట్టుతున్నట్లు కలవచ్చి త్రుళ్ళిపడి లేచింది. కలవరం తగ్గి కలగా గుర్తించి ఓ గ్లాసు మంచి నీళ్ళు త్రాగి పడుకుంది మళ్ళీ. ఆ మర్నాడు కాఫీ టిఫిన్‌లు అయిన తర్వాత ప్రకాశం

ఎక్కడికో ప్రయాణ మవసాగాడు. బహుశా అన్నయ్య వెళ్లేది ఉత్తరం రాసిన ఫ్రెండు దగ్గరకు కాబోలు, అనుకున్న ఇందిర తనూ చీరమార్చుకుని సూట్ కేస్ సర్దుకుంది.

"ఈ ఒక్కరోజు సెలవు కోసం ఎక్కడికి నువ్వూ బయలుదేరావు? రేపు కూడా సెలవు పెట్టావా?" అడిగింది వసంత.

"అన్నయ్యతో నేనూ వెళ్తున్నా రేపు అక్కడనుంచి ఆఫీసుకి రాజీనామా లెటర్ పంపిస్తాను వదినా?" ఆ మాటకి ప్రకాశమూ వసంతా కూడా అదిరిపడి ముఖ ముఖాలు చూసుకున్నారు.

"రాజీనామా ఇస్తావా? ఎందుకని?"

"నేను గుంటూరు వెళ్ళిపోతున్నాను అన్నయ్యా" తల వంచుకుని నిదానంగా చెప్పింది ఇందిర.

"గుంటూరు వెళ్ళిపోతావా? అక్కడ నుంచి ఉత్తరం వచ్చిందా నిన్ను రమ్మని..." ప్రకాశం ఆశ్చర్యాన్నుంచి చప్పున తేరుకోలేకపోతున్నాడు. తను వినేది నిజమేనా లేక భ్రమపడుతున్నాడా? కాని తను వినేది ఇందిర నోట్లోంచి వచ్చే మాటలేను.

"నా ఇంటికి నేను వెళ్ళడానికి ఉత్తరా లెందు కన్నయ్యా!" నవ్వింది ఇందిర. నా అంతట నేను వచ్చాను, తిరిగి నా అంతట నేను వెళ్ళిపోతున్నాను. నీకు రావాలని వుంటే స్టేషన్‌కి వచ్చి బండెక్కించు. లేదా అదీ అక్కర్లేదు. నేనే వెళ్ళిపోతాను'' అంది అలా అంటున్న చెల్లెలి వైపు ప్రేమగా, ఆప్యాయతగా చూసాడు ప్రకాశం, దగ్గరగా వెళ్ళి -మె తల మీద చేయివేసి నిమురుతూ నా చెల్లెలు తిరిగి భర్త దగ్గరకు వెళ్తానంటుంటే అంతకన్న నాకు కావల్సిం దేమిటమ్మా. నువ్వు సంతోషంగా, సంసారంచేసుకోవడమే నేను హర్షిస్తాను. స్టేషన్‌కే కాదు నీ వెంబడి గుంటూరు వచ్చి నిన్ను నీ అత్తవారింటిలో దింపి మరీ వస్తాను. కాని ముందు మనం వెళ్ళాల్సింది స్టేషన్‌కి కాదు. బజారుకి. ఇన్నాళ్ళ తర్వాత నా చెల్లెలు అత్త వారింటి కెళ్తుంటే వట్టినే ఎలా పంపిస్తాను. ముందు బజారు వెళ్ళి నీకు కావాల్సిన చీర, రవిక తెచ్చుకో. ఆ తర్వాత ట్రెయిన్‌కి వెళ్దాము ఏం? ఉండు వెళ్ళి టాక్సీ తీసుకొస్తాను" అంటూ ప్రకాశం వీధిలోకి పరుగెత్తాడు. ఇన్నాళ్టికైనా ఆడబిడ్డ మనసు మార్చుకుని భర్త దగ్గరకు వెళ్ళబోతున్నందుకు ఎంతో సంతోషాన్ని వ్యక్తం చేస్తూ ఆడబిడ్డ వైపు ప్రేమగా అభిమానంగా చూడసాగింది వసంత. కాని ఇందిర మాత్రం తను అత్త వారింటిలో ఎటువంటి దృశ్యాన్ని ఎదుర్కోవలసి వస్తుందో, అనే ఆలోచనతో సతమత మవసాగింది.

---




అంతులేని ఆవేశంతో ఒణికిపోతున్నాను నేను! జయని కీలుకి కీలు విరిచి, గొంతు పిసికిచంపి పాతర వేస్తేగాని, నాకు నిద్రపట్టేట్టు లేదు ఆటో ఎక్కి యింటికి ఎలా వచ్చానో నాకే తెలియదు. రాగానే సరాసరి అక్కయ్య దగ్గరకి వెళ్ళి 'జయ వచ్చిందా?' అని అడిగాను.

"స్నేహితురాలి దగ్గరకి వెళ్ళిందిగా. యింకా రాలేదు. పిల్లలకి అన్నం పెట్టాను. జయ ఎప్పుడు వస్తుందో, ఏమిటో? నువ్వు అన్నానికి రా!" అంది.

"నాకు ఆకలిగా లేదు. నువ్వు తినేయ్," అనేసి గిరుక్కున తిరిగి నా గదిలోకి వచ్చాను. నా గుప్పిట్లు మాటి మాటికి బిగుసుకుంటున్నాయి. నా తల యీ భూమి భారం అంతా నా నెత్తిన వున్నంత భారంగా వుంది!

నా గదిలోకి వచ్చాను! ఎదురుగా నా టేబిల్ మీద జయ నవ్వుతూన్న ఫొటో కనిపించింది. ఆ ఫొటో అంటే నా కెంత యిష్టంగా వుండేది! క్షణంసేపు ఆ ఫొటో వైపే తదేకంగా చూసాను! నవ్వుతూన్న జయ ముఖంలో భావాలు మారుతున్నట్లుగా అనిపించింది నాకు. ఆ

నవ్వు అమాయకంగా నిష్కల్మషంగా కాకుండా, నన్ను చూసి వెక్కిరిస్తున్నట్టుగా వుంది.

జయ ఆ ఫొటోలోనుంచి విరగబడి నవ్వుతూ నా కోపాన్ని మరింత రెచ్చగొడుతోంది.

నేను టేబిల్ మీద వున్న ఆ ఫొటో లాగి క్రింద బలంకొద్దీ కసిగా విసిరేసాను! ఆ ఫొటో నేల మీద భళ్ళున పడి ముక్కలు ముక్కలు అయింది! పగిలిన ముక్కల మధ్య నుంచి నవ్వుతున్న జయ ముఖం వికారంగా వుంది!

ఈ శబ్దం విని కాబోలు అక్కయ్య పరుగెత్తుకు వచ్చింది. గది మధ్యగా గుప్పిట్లు బిగబట్టి నిలబడినన్ను ఖంగారుగా చూస్తూ! ఏమిటి! ఏమైంది?' అంది. నేను అక్కవైపు తిరగలేదు. ఇంకా వికృతంగా నవ్వుతూన్న జయ ముఖం వైపే చూస్తున్నాను! 'ఫొటో పగిలిపోయిందా! ఉండు చీపురు తెస్తాను. అక్కయ్య వెళ్ళి పేపరు, చీపురు తెచ్చింది అక్కయ్య ఆ ముక్కలు ఎత్తబోతుంటే 'ఆగు! నువ్వు వద్దు, నేను తీస్తాను. ఆ పాపిష్టిదాన్ని నువ్వు ముట్టకోకు'అన్నాను

అక్కయ్య నా వైపు వింతగా చూసింది. నేను చీపురుతో, పగిలిన గాజు ముక్కలు పోగుచేసి. కాగితంలోకి ఎత్తాను. నా ముఖం అక్కయ్యకి ఎలా కనిపించిందో ఏమో, నా వంకే తదేకంగా చూడసాగింది. నేను ఆ ముక్కలు, ఫొటో పారేసి వచ్చాను.

"అదేమిటి! ఆ ఫొటో కూడా పారేసావేమిటి?" అంది.

"అంతే చెత్తకుండీలో వుండాల్సిన మనిషిని, నా యింట్లోకి తెచ్చుకున్నాను. ఇప్పుడు పొరపాటు తెలిసింది" అన్నాను.

అక్కయ్య నా వైపు ఆందోళనగా చూసింది. 'ప్రసాదూ! నీ ఒంట్లో బాగుందా!' అంది.

'బాగానే వుంది! నాకేమైంది!' అన్నాను. పైకి అన్నానేగాని అక్కయ్య ముందు, మామూలుగా నిలబడ లేక పోయాను. వెళ్ళి తల పట్టుకుని కుర్చీలో కూలబడ్డాను

"భోజనం చేద్దువుగాని రా" అంది.

"నాకు ఆకలి లేదు."

"పోనీ కాఫీ యివ్వనా?"

"ఊహు ఏమీ వద్దు. నన్ను కాసేపు వదిలేయ్. నీకు పుణ్యం వుంటుంది." చిరాగ్గా అన్నాను

అక్కయ్య యింకేం తర్కించలేదు. తలుపులు దగ్గరకి లాగి వెళ్ళిపోయింది!

నేను తలెత్తి చూసాను! మూసివున్న గదిలో నా కేపటో నా స్థితి చాలా భయంకరంగా అనిపించింది. గభాల్న వెళ్ళి తలుపులు బార్లా తెరిచాను! కిటికీలకి వున్న పరదాలు పక్కకి లాగి కట్టాను! కిటికీ చువ్వలకి తల ఆనించి కళ్ళు మూసుకున్నాను! నా మనసు హఠాత్తుగా అతి

దొంగ కాదయ్యా-స్టూడెంటు....
వాడిదగ్గర పేపరు లాక్కోవాలి నేను......




దీనంగా భగవంతుడిని ప్రార్థించసాగింది 'భగవాన్' నాకుజీవించాలని వుంది! ఎలాం ఒడిదుడుకులూ లేకుండా నా జీవితం ప్రశాంతంగా జీవించేలా ఆశీర్వదించు! నిన్ను నేనేమీ కోరను! నాకు శాంతి కావాలి! అది చల్లగా, హాయిగా వుండాలి! ఆ వుద్రేకం, ఆలజడి నేను భరించ లేకుండా వున్నాను! నేను పిచ్చివాడిని అవుతానేమోనని నాకు భయంగా వుంది.'

భగవంతుడు నా మొర విన్నాడో లేదో నాకు తెలియదు! నేను మనసులో ఎలుగెత్తి అరిచిన మాట నిజం!

వచ్చి కుర్చీలో కూర్చున్నాను! సిగరెట్ తీసి వెలిగించి ఒకదాని వెంట ఒకటి కాలుస్తూనే వున్నాను!

మెల్లగా నా కళ్లు మూతలు పడినాయి! నాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. హఠాత్తుగా మళ్ళీ భరించలేని తలనొప్పి వచ్చింది! కుర్చీలోనుంచి లేచాను! నా మనసంతా అలజడిగా వుంది!

నేనెందు కిలా అశాంతిగా వున్నానా అని ఆలోచించాను నాకు క్రమంగా గుర్తు కావచ్చింది! జయ ఏదీ? పక్క మీద చూసా! లేదు! ఇంకా యింటికి రాలేదు! దాహంతో నా నోరు పిడచ కడుతోంది. లేచి మంచి నీళ్లు తీసు కెళ్ళాను. మంచి నీళ్ళు తాగి, అక్కయ్య గదిలోకి వచ్చాను!

అక్కడ అక్కయ్య మంచం పక్కన, కవిత, కల్పనల పక్కమీద జయ నిద్రపోతోంది ఎప్పుడు యింటికి వచ్చిందో ఏమో! ఏమీ ఎరగని నంగ నాచిలా హాయిగా నిద్రపోతోంది. జయని చూడగానే, నా పళ్ళు పటపట లాడినాయి. గబాల్న ఆ మంచం దగ్గరకి వెళ్లాను. జయని రెక్కపట్టి లేపి కూర్చో

బెట్టాను. ఎడాపెడా కొట్టాను. కంఠం నులమసాగాను!

జయ కేకలకి అక్కయ్య, పిల్లలు అంతా లేచారు. అవతల గదిలోవున్న నాన్న కూడా 'ఏమిటమ్మా' అని కేకలు పెట్టారు.

అక్కయ్య లేవగానే నేను చేస్తున్న పని చూసింది. గభాల్న జయని నా చేతులనుంచి విడిపించింది. 'ఏమిటీ యీ అఘాయిత్యం! నీ కేమైనా మతిపోయిందా' అంది.

'నీకు తెలియదక్కా! ఇది రాక్షసి. యిష్టంవచ్చినట్టు తిరిగివచ్చి, నంగనాచిలా నిద్రపోతోంది వదులు దీన్ని చంపేస్తాను' అన్నాను.

అక్కయ్య జయని వెనక్కి తీసుకుని, నన్ను అవతలకి తోసింది. ఆ కోపంలో నేను అక్కయ్యను కూడా లక్ష్యపెట్ట లేదు. అవతలకి తోసాను. పిల్లలు ఏడవ సాగారు.

అక్కయ్య, పిల్లలు నన్ను ఎంతో కష్టంమీద అవతల గదిలోకి తోసి తలుపులు మూసారు. 'అక్కయ్యా! తలుపు తియ్. దాన్ని ప్రాణంతో వదల కూడదు' అని అరిచాను.

అరగంటలో డాక్టరు వచ్చాడు. నన్ను బలవంతంగా పట్టుకొని ఇంజక్షన్ యిచ్చారు. నాకు నిద్ర వచ్చేసింది ఆ రోజు నుండి నాకు నరకం ప్రారంభ మైంది!

జయ ఏమి చెప్పిందో ఏమో నాకు వైద్యపరీక్షలు ప్రారంభమైనాయి!

జయ స్నేహితులు ఎవరైనా నేను కనిపిస్తే భయపడినట్టుగా దూరంగా పారిపోసాగారు!

నేను వీధిలో వెళ్తుంటే ఇరుగు పొరుగు వింత జంతువుని చూసినట్టు చూస్తున్నారు. నా మనసులో పెద్ద ఘర్షణగా వుంది. జయని నయానా, భయానా క్రమశిక్షణలో పెట్టుకోవటమా! లేక శాశ్వతంగా, విడాకులు యిచ్చి వదిలేయటమా! తలి తండ్రులని ఎదిరించి, జయని ప్రేమించానని అనుకుని పెళ్ళిచేసుకున్నాను నేను! ఇప్పుడిలా యీ వివాహం విఫలం అయితే, లోకంముందు నా బ్రతుకు ఎంత అవహేళన అవుతుందో నాకు తెలుసు! అలాగని జయ విచ్చలవిడి తనం భరించలేను. రేపు పిల్లలు పెద్ద వాళ్ళవుతారు. వాళ్ళని ఎవరైనా ఏదయినా అంటే నేనం జవాబు చెప్పాలి! భార్యని కంట్రోల్ చేయలేని, చవటగా లోకం నన్ను చూసి నవ్వుతుంటే, నాకు పొడుచుకు చావాలన్నంత పౌరుషంగా అనిపిస్తోంది!

నేను టేబిల్ మీదకి తలవాల్చి ఏడవ సాగాను!

'ఇదీ వరస డాక్టర్! ఒక్కడే గంటలతరబడి కూర్చుంటాడు! తనలో తను ఏదేదో గొణుక్కుంటాడు. పళ్ళు

నూరుతుంటాడు. లేకపోతే యిలా నడుస్తాడు. యివి పిచ్చి లక్షణాలు కావంటారా?'

జయ కంఠం వినిపించింది!

నేను చివ్వున తలెత్తి చూసాను. ఎదురుగా జయ నిలబడివుంది. జయ పక్కన మరో వయసుమళ్ళినాయన నిలబడి వున్నాడు. ఆయన ఎక్స్‌రే చూపులాటి చూపులతో నన్ను చూస్తు న్నాడు.

"పిచ్చా? ఎవరికి?" నేను జయని చూడగానే ఠగ్గున లేచాను.

"యింకోసారి ఆ మాట అన్నావంటే పళ్ళురాలగొడతాను! ఎవరికి పిచ్చి? నీకు మదపిచ్చి!" అరిచినట్టుగా అన్నాను.

"మిస్టర్" ఆయన ఏదో అన బోయాడు.

"నువ్వెవరసలు? నన్ను అడగ కుండా నా యింట్లో ఎందుకు అడుగు పెట్టావు? గెటవుట్" అరిచాను.

అతను నన్ను చూస్తున్నాడు. "గెటవుట్" ఆయన్ని తోసాను! నాకు యీ మధ్య అసలెందుకోగాని ఊరికే కోపం వస్తోంది.

ఆయన, జయ వెళ్ళిపోయారు.

నా ఆవేశం చాలాసేపటివరకూ తగ్గ లేదు? ఊరునుంచి మా అత్తగారు వచ్చింది. వెంకట్రామయ్య కూడా వచ్చాడు. జయ మా యింట్లో కాపురం మానేసింది. ఆ రోజు సాయంత్రం నేను యింటికి వచ్చేసరికి అక్కయ్య తల పట్టుకొని ఏడుస్తోంది!

"అక్కయ్యా! ఎందుకు ఏడుస్తు న్నావు?" అన్నాను.

అక్కయ్య తలెత్తి చూసింది జవాబు చెప్పలేదు. మరింతంగా ఏడవసాగింది!

'ఏమైంది?' అన్నాను.

అక్కయ్య చేతిలోని కాగితం నా చేతిలో పెట్టింది. నేను అది చదివాను. జయ నాకు విడాకులు కోరుతూ యిచ్చిన లాయరు నోటీసు. అందులో నాకు మతి స్థిమితంలేదు, అక్కయ్య యింట్లోచేరి తనని చాలా బాధలుపెట్టడంవల్ల ఆ కాపురం తను చేయలేకపోతున్నాను, కాబట్టి విడాకులు కోరుతున్నానని వుంది.

నేను ఆ కాగితాలను పరపరా చింపేసాను.

"నేను విడాకులు యివ్వను. యిప్పుడే వెళ్ళి రెండుతన్ని లాక్కువస్తాను. రాక ఎక్కడికి పోతుందో చూస్తాను!'' అని గబగబ అడుగులు వేసుకుంటూ బైలుదేరాను!

'ఒరేయ్ ప్రసాదూ! నువ్వు వద్దు నేనే వెళ్ళి జయకి నచ్చచెబుతాను., అక్కయ్య వెనకనుంచి బతిమిలాడు తున్నట్టుగా అంది.

"నీకు తెలియదు అక్కయ్యా! నువ్వు వెళితే జయ రాదు. నువ్వంటే దానికి భయం లేదు.'

"మనం లాయరుగారిని సంప్రదించి తర్వాత మాట్లాడుకుందాం."

''యిది ఏ లాయర్లు తేల్చలేరు. నాకు నేనే తేల్చుకోవాలి'' అంటూనే మెట్లు దిగేసాను.

నేను జయ యింటికి వచ్చేసరికి వరండాలో చుట్టకాలుస్తు వెంకట్రామయ్య కనిపించాడు.

అతను నన్ను మిర్రిచూసాడు. నేను కోపంగా చుసాను.

"జయ ఎక్కడ "

"యింట్లో లేదు."

''ఎక్కడకి వెళ్ళింది."

''ఏమో తెలియదు "

'సరె. వచ్చేవరకూ కూర్చుంటాను.' నేను అక్కడున్న కుర్చీలో కూర్చున్నాను

'' నీకొక్కడూ చెప్పేది. ఎప్పుడు వస్తుందో తెలియదు" అన్నాడు చిరాగ్గా.

"ఎప్పటికో అప్పటికి వస్తుందిగా. అప్పటివరకూ కూర్చుంటాను."

" ఫ్రెండ్స్‌తో ఊరు వెళతానంది. వెళ్ళిందేమో!"

నేను క్షణం సేపు ఆలోచించాను.

''సరే" అని లేచాను.

గేటుదాటి బయటికి వచ్చేసాను ఆ యింటికి ఎదురుగా ఒక బార్బరు షాపు వుంది. అక్కడ కూర్చున్నాను. ఆ చోటులోనుంచి జయ యింటికి ఎవరెవరు వచ్చేది పోయేదీ కనిపిస్తూనే వుంది.

నేను వచ్చేసిన 10 నిముషాలకి ముందు వెంకట్రామయ్య వచ్చి, వీధిలో అటు యిటు చూసాడు. తర్వాత లోపలికి వెళ్ళాడు. 5 నిముషాల్లో అందాల బొమ్మలా తయారైన జయ, తల్లి వెంకట్రామయ్య కూడా బైటికి వచ్చారు.

వాళ్ళు బస్‌స్టాప్‌వైపు యిటే వస్తున్నారు నేను చటాలునలేచి సరాసరి ఎదురు వెళ్ళాను

ఇంట్లోవుండి లేవనిపిస్తే నిన్ను నేను పట్టుకోలేనని కదూ! యిప్పుడు ఎక్కడికి వెళ్తావు'' అన్నాను. జయ కేవ్వుమని అరిచింది.

"ఇంటికి వెళ్దాం మర్యాదగా రా ! రోడ్డుమీద అనవసరంగా గొడవ చెయ్యకు!" అన్నాను.

' నేను రాను" నా చెయి విదిలించుకుంది.

''ఏమిటయ్యా నీ గొడవ! అది రాదు ఎందుకు రమ్మనమనటం? కొట్టి చంపటానికా!"

"మీరు ముందు నోరుమూసుకోండి " అన్నాను.

నేను జయ చెయ్యి పట్టుకోబోతుంటే వెంకట్రామయ్య నా చేతిమీద గట్టిగా కొట్టాడు. నా చెయ్యి విరిగిపోయిందేమో నన్నంత బాధ వేసింది. మరు నిముషంలో నేను ఆయనమీద కలపడ్డాను. ఇద్దరం చిత్తుగా తన్నుకున్నాం. పల్లెటూరివాడు. మోటుమనిషి అయిన ఆయన బలం ముందు నేను ఆగలేక పోయాను. ఇంతలో అందరూ అక్కడ పోగయారు,

పెట్రోల్ చేస్తున్న పోలీస్‌వాన్ అక్కడ ఆగింది. వాళ్లు నన్ను వెంకట్రామయ్యను, జయని ముగ్గుర్ని పోలీస్‌స్టేషన్‌కి నడవమన్నారు.

(సశేషం)

———

# జెట్టి తత్వ

దక్షిణామూర్తి గాలి పీల్చుకోడానికి నిడదవోలు ప్లాట్‌ఫారంమీదికి దిగాడు. కూపే ఒకరకంగా సుఖంగానే ఉంటుంది గాని, మిగతా పెట్లలాగా రైలు కదులుతున్నా గాలిరాదు. అయితే - కూపేలోకి బొగ్గు నెరుసులు, అనవసరమైన ప్రయాణీకులు అట్టే రారు. లాభనష్టాలు ప్రతిదానికీ ఉంటాయనుకుని తృప్తిపడ్డాడు. దక్షిణామూర్తి.

ప్లాట్‌ఫారం మహా రద్దీగావుంది ఈ పెట్టెలో కాళీలేదంటే, ప్రయాణీకులు మరో పెట్టెదగ్గరకు పరుగెత్తుతున్నారు. వాళ్ళ ఆత్రంలో జంతు సహజమైనదేదో ఉంది. అసలు దక్షిణామూర్తి ఎన్నికలో సామాన్య ప్రజలు జంతువులే. అయితే అప్పుడప్పుడు ఆ జంతువులతో రాసుకు తిరగడం కూడా బాగానే ఉంటుంది. ముఖ్యంగా ఇటువంటప్పుడు, బొత్తిగా ఒంటరిగా కొన్నిగంటలసేపు కూపేలో ప్రయాణం చేశాక, జీవ చైతన్యం ఉన్న వస్తువులతో తాత్కాలిక సంపర్కం కాస్త అవసరం. అయితే ఆ సంపర్కం అతనికి విసుగు పుట్టిస్తే, మళ్ళీ తన ఏకాంతంలోకి తను పోవడానికి అవకాశ ముండాలి. ఆ కూపేలోకి పోతే, ఈ జనం తన్ను తాకలేదన్న ధీమాతోనే, దక్షిణామూర్తి జనసముద్రంలోకి అడుగు పెట్టాడు. సోడాలూ, తినుబండారాలూ, పుస్తకాలూ అమ్మేవాళ్ళు పెట్లను తోసుకుంటూ, అతన్ని రాసుకుంటూ పోతున్నారు. పక్కపెట్టెలో మనిషి అరటిపండు తినేసి విసిరిన తొక్క అతన్ని తల వెంట్రుకవాసిలో దూసుకుపోయింది. జన ప్రవాహాన్నించి కొంచెం దూరం తొలిగి నిలబడ్డాడు దక్షిణామూర్తి. ప్లాట్‌ఫారం మీదికి దిగడంలోనూ లాభనష్టాలున్నాయి.

"ఏమండోయి దక్షిణామూర్తిగారూ? హ! హ! హ!" అంటూ ఒక విగ్రహం అతని రెండుచేతులూ పట్టుకుని ఊపింది.

"ఏమిటి విశేషాలు? పట్నమేనా? ఏమండీ! అక్కడెక్కడో అచ్చు ఇటికల ఫాక్టరీ పెడతన్నారంట. కాస్త ఇవరాలు మాకూ్కడా ఇవ్వండి. దానమ్మా మోటిడి ఉన్న లాభాలన్నీ మీరే ఏసుకోవాలేంటండి? అవునుగాని, కలప మా దగ్గిర కొనడం బొత్తిగా మానేశారేంటి?"

దక్షిణామూర్తికి వ్యాపారమంటే పిచ్చి మోజు. లాభనష్టాల మాట అటుంచి, అసలు వ్యాపారంలో ఏదో ఒక విధంగా తనది పైచెయ్యి అనిపించుకోవాలి. అయితే ఒక్కొక్కప్పుడు

ముఖ్యంగా ఇలాగ విశ్రాంతికోసం ప్రయాణాలు చేస్తూన్నప్పుడు-వ్యాపార వాతావరణంనించి, ముఖ్యంగా వ్యాపారస్థులనించి, దూరంగా ఉండాలని పిస్తుంది. కాని పెద్ద వ్యాపారస్థుడుగా పేరు ప్రఖ్యాతులు గడించాక, ప్రతి ఊళ్ళోనూ పదిమందితో వ్యాపార రీత్యా పరిచయం ఏర్పడ్డాక, అలా దూరంగా తొలిగిపోయి ఉండడం అసాధ్యమని అతనికి అనుభవంవల్ల తెలుసు అదీ గాక తనకు లోపల ఎంత చిరాకుగా ఉన్నా వాళ్ళతో అప్యాయంగా, చిరునవ్వు చెదరకుండా మాట్లాడంవ్యాపారానికి ముఖ్యావసరం-ఒక్కరికి మనస్సు నొచ్చుకునే మాట అతడు మాట్లాడగా, అతను ఇన్నాళ్ళూ నిర్మించుకుంటూ వచ్చిన పలుకుబడీ, ఔన్నత్యం పేకల మేడలాగ కూలిపోతుందని అతనికి తెలుసు.

మొదటి ఆసామీ చుట్టూ మరో నలుగురైదుగురు చేరారు. కొందరు అతన్ని కేవలం మర్యాదగా పలకరించడంకోసమే దగ్గరగా వచ్చారు. మరికొందరు అతని సహాయం అర్థించడాని కొచ్చారు. అతడు అందరినీ సమంగా మాటలతో గౌరవించి, రైలు కదలబోతూండగా తన కూపే ఎక్కేశాడు. ఎక్కుతూ రైలులో ప్రయాణం చేస్తున్న ఉద్యోగిని సంజ్ఞచేశాడు.

"చూ డప్పలసామీ! ఆ పెద్దమనుషులంతా ఈ కూపేలో పైబర్తు కోసం నిన్ను వేపించుకు తింటారు నా స్నేహితులెవరో బెజవాడలో ఎక్కుతారు, అంచేత రెండూ నేను రిజర్వు చేయించానని చెప్పు"

"నాకు మీరు చెప్పక్కర్లేదుసార్. అప్పుడే కొందరు నన్నడగడం, నేను ఖాళీలేదని చెప్పడం అయింది"

ఉద్యోగి కదులుతున్న రైలుకిమ్మీ పట్టుకుని పక్క కంపార్టుమెంటులోకి వెళ్ళిపోయాడు. దక్షిణామూర్తి తన కూపే తలుపులు గట్టిగా మూసుకున్నాడు ఇంక పట్నం వెళ్ళేవరకూ వాటిని తెరవకూడదనుకున్నాడు పాపం రైల్వే ఉద్యోగులు అతనెంత చెపితే అంత. అతను కావాలంటే రైలంతా ఖాళీ చేయించి అతని కిస్తారు.

కొంచెం బొగ్గురజను పడిందేమో నన్న అనుమానంకొద్దీ పక్క బాగా దులిపి మళ్ళీవేశాడు దక్షిణామూర్తి. తలగడక్రింద లోపలికున్న పిస్తోలుతీసి చేతిలో ఒక్కసారి దాని బరువు మాసి, పక్కన పెట్టుకున్నాడు ఆ పిస్తోలు దగ్గరుంటే తన కింక ఏ అపాయం రాదని అతని నమ్మకం.

అప్పుడే కనుచీకటి పడుతోంది బర్తుమీద మూలగా ఉన్న దీపం వెలిగించాడు. ఫైనాన్షల్ ఎక్స్‌ప్రెస్ విప్పిచదవడం మొదలుపెట్టాడు.

బ్రతుకు కొక బజారు అందులో ప్రతి



వ్యక్తి విలువను పెంచుకోడానికి ప్రయత్నిస్తాడు నిత్యం పైకో కిందకో పోతుంటాడు. ధర పెరిగినప్పుడు ధనంగా మార్చుకోగలవాడు సమర్థుడు. ఇంకా పెరుగుతుందన్న ఆశకొద్దీ బిగుసుక్కూచున్నవాడు ఆఖరికి పడిపోక తప్పదు. ధర తగ్గుతున్నప్పుడు ఆదుర్దాగా అమ్మడానికి ప్రయత్నిస్తే, ధర మరీ పడిపోతుంది. ప్రతిదినం ఈ పత్రికలో ఇదేకథ తను చదువుతున్నాడు. ఈవేళ కూడా ఎందుకీ తాపత్రయం! ఈవేళ హాయిగా అన్నీ మరిచిపోవాలి. రేపెలాగా తప్పదు.

మూసిన గాజు కిటికీ అవతల అస్పష్టంగా కదిలిపోతోంది ప్రకృతి- చెట్లు, చేమలు, ఇళ్ళు, దీపాలు, దగ్గర స్తంభాలు, దూరపు కొండలు. కాని దిజ్మండలరేఖ మాత్రం అతనితో సాగుతూ వస్తూంది. మధ్య మాయమైనా, మళ్ళీ వస్తోంది. పరధ్యానంగా చూస్తున్నాడు దాని వేపే ఆ రేఖమీద-అవతరించింది అనసూయ ముఖం. అందంగా, తీక్షణంగా ఆడతనం, అహంకారం అన్నీ కలిసున్నాయి ఆ ముఖంలో. అనసూయా సుగర్ మిల్స్ తనతో అరణంగా తెస్తుంది. ముప్ఫయి లక్షలు విలువగల ఫాక్టరీకి ఆమె ఏకైక వారసురాలు ఇంకా పెళ్ళికాకముందే అతని ఇంటికి యజమానురాలులా ప్రవర్తిస్తోంది. ఇంటికేకాదు అతనికిన్నీ-

తాంబూలాలు పుచ్చుకుని రెండేళ్ళయింది. ఎప్పటికైనా పెళ్ళిచేసుకోక తప్పదు. అయితే బ్రహ్మచర్యాశ్రమంలో ఉన్న స్వేచ్ఛను వీలయినంతకాలం పొడిగిస్తున్నాడు దక్షిణామూర్తి.

అనసూయ అందమైనదీ, హోదా గలదీ అతనికి చాలా ఇష్టం పక్కని కూచుండగా ఆమె చెయ్యి పట్టుకుని నలపకుండా ఉండలేడు. పళ్ళు బిగించి తీవ్రంగా, ఏకాంతంగా ఆమెతో ఏకమై పోతున్న దృశ్యాలు ఊహించుకోకుండా ఉండలేడు. ఆమె విలువ ముప్పయి లక్షలు–ఈ రోజుని. అయినా అతను పెళ్ళి వాయిదా వేస్తున్నాడు.

అప్పుడప్పుడు తన బ్రహ్మచారి స్నేహితులు అతన్ని పార్టీలకి పిలుస్తుంటారు అప్పుడప్పుడూ పార్టీలు అతని ఇంట్లోనే జరుగుతుంటాయి. ఎప్పుడో రాత్రి తొమ్మిది గంటలకి ప్రారంభమౌతాయి. అప్పుడప్పుడు తెల్లవారిపోయేదాకా సాగుతుంటాయి. మర్నాడెంత నీరసపెట్టినా, వాటి సరదా వాటిదే. తన సెక్రటరీ సులోచన ఎప్పుడన్నా – ఇంకెవరూ దొరక్కపోతే వస్తుంటుంది అనసూయకన్నా సులోచన ఎక్కువని కాదు. సులోచనలు వందలకొద్దీ ఉన్నారు. అనసూయ ఒక్కత్తే ఉంది. అయితే అప్పుడప్పుడు ఏ సులోచనతోనన్నా ఒక్కరాత్రి సరదాగా గడపడానికి, అన్నీ మరిచిపోడానికి, అవకాశం ఇస్తుంది బ్రహ్మచర్యం. గృహస్థు అయిన మరుక్షణంనించీ ఈ అవకాశం పోతుంది.

ఈ రెండు ఆశ్రమాలకీ, వాటికి తగిన విలువలు నిర్ణయించి, తన వయస్సుకి ఒక ధర ఇచ్చుకుని, పెళ్ళయాక వచ్చే లాభాలు బేరీజు వేసుకుని, పోయే స్వాతంత్ర్యానికి నష్టపరిహారం కట్టుకుని, లాభనష్టాల పట్టీ ఒకటి మనస్సులో తయారు చేసుకుంటున్నాడు దక్షిణామూర్తి.

అప్పుడతని కంటబడింది, కదులుతున్న చిదత. ఆ చిదత పాకీదొడ్డి తలుపుది. ఒక్కసారి పైకి లేచి మళ్ళీ కింద పడిపోయింది, చిరు చప్పుడు చేస్తూ

దక్షిణామూర్తికి ముచ్చెమటలు పోశాయి. పాకీదొడ్డిలో ఎవడో దొంగ ఉన్నాడు ఈ కూపేట్లో రెండూ మూడు కూనీలు, దొంగతనాలు జరిగినట్టు పత్రికల్లో చదివాడు ఈ దొంగలకి దయాదాక్షిణ్యాలుండవు. లేవబోయాడు. లేచి గొలుసు లాగాలని అతని అభిప్రాయం. కూర్చుని కాళ్ళు క్రింద పెట్టాడు టప్పుని చిదత చప్పుడు చేస్తూ రెండో పక్కకి తిరిగిపోయింది. తను లేచి గొలుసు లాగేలోగా దొంగ తనమీదపడి ఏమన్నా చెయ్యగలడు. అతని కాళ్ళు జావలా మెత్తబడిపోయాయి. తనదగ్గర దొంగతనం గాని, ఖూనీగాని చెయ్యవలసినంత

డబ్బు లేదని చెపితే ఆ దొంగ నమ్ముతాడా? చటుక్కుని పిస్టలు గుర్తు కొచ్చింది గభాల్న దాన్ని తీసి పాకీదొడ్డి తలుపువేపు గురిపెట్టి అరిచాడు.

"రా! ఇవతలికి రా!"

తన గొంతు ఎవరి గొంతులాగో ధ్వనించింది, అనవసరమైనంత గట్టిగా. తలుపు మెల్లగా తెరచుకుంటోంది. ఆ చివరికి ఒక అడుగు పైకి దృష్టి కేంద్రీకరించి పిస్టలు గురిపెట్టాడు; దొంగ గుండెకాయ ఆ ప్రాంతంలో ఉంటుందని అతని అంచనా. తలుపుకీ గుమ్మానికీ మధ్య చీలిక పెద్దదయింది తలుపు వెనకాల, అతను చూస్తున్న చోట అంతా ఖాళీ. దొంగ తలుపు చాటుని దాక్కుని తీస్తున్నట్టున్నాడు.

"దాక్కుని లాభంలేదు. నా చేతిలో పిస్టలుంది" అని ధీమాగా అన్నా డీపారి. ఎందుకో ఇంక దొంగ తనకి లొంగిపోయినట్టనిపించింది.

తలుపు తెరుచుకుంది. అతని చూపులు కేంద్రీకరించని క్రిందభాగంలో ఏదో కదిలింది; కిందికి చూశాడు. చేతిలో పిస్టలు అనుకోకుండా జారి పోయింది. నరాలన్నీ సర్దుకుని పట్టు వదలేశాయి. అతనికి చటుక్కున పక్కలు పగిలేటంత నవ్వొచ్చింది.

ఏనుగంత దొంగ ఇవతలి కొస్తాడని అతను అన్నిటికీ సిద్ధపడి ఎదురు చూస్తుంటే అందులోంచి ఇవతలికొచ్చింది ఒక ఎలక పిల్లలాంటి, చిన్న ఆడపిల్ల.

నాలుగైదేళ్ళుంటాయి. చింకి పరికిణీ, చింపిరి జుట్టూ, కళ్ళు అమాయకంగా చురగ్గా మెరుస్తున్నాయి. దక్షిణా మూర్తికి ఆ పిల్లమీద కోపంమట్టుకు రాలేదు. తన ఆందోళననీ, భయాన్నీ పోగొట్టినందుకు, నిజంగా దొంగ కాకుండా నిరపాయకరమైన చిన్న పిల్లగా మారిపోయినందుకు ఒకరక మైన కృతజ్ఞత కూడా అతనికి కలగక పోలేదు. అంచేత సౌమ్యంగా అడిగాడు.

"పాకీదొడ్లో ఎందుకు దూరావు?"

"నువ్వు పెట్లో కెక్కుతుంటే. నేను దొడ్లో కెళ్లా," అంది పిల్ల.

"అసలీ పెట్లో కెందుకెక్కావు?"

"ఈ రైలు పట్నం పోద్దంటగా"

"చూడు పిల్లా. ఇది పరుపుల పెట్టె. వొచ్చి స్టేషనులో దిగిపోయి మరో పెట్లో ఎక్కు."

"ఏం?"

"ఇది పరుపుల పెట్టని చెప్పడంలా? మూడోక్లాసు పెట్లో ఎక్కాలి. నీ టిక్కెట్టేదీ?

"అదేంటది?"

"టిక్కెట్టు కొనలేదా?"

లేదన్నట్టు తలూపింది. ఇంకామెను ఏ ప్రశ్న అడిగినా ఏం లాభం లేదను కున్నాడు. బెజవాడలో రైలాగ్గానే

రైల్వే ఉద్యోగికి అప్పగించెయ్యొచ్చు ననుకున్నాడు.

"ఆ మూల కూర్చో." ఆ పిల్ల కూర్చుంది. దక్షిణామూర్తి వెల్లగిల పడుకుని పత్రిక తిరగవెయ్యడం ఆరంభించాడు. అవి మూసేసి మరో పత్రిక తెరిచాడు. కళ్ళు అక్షరాలని గుర్తు పట్టినా, అవి మనస్సుకి ఎక్కడంలేదు. ఏం చెయ్యడానికీ తోచక ఆఖరుకి భోజనం చేసేద్దామని నిర్ణయించుకున్నాడు. బెర్తుమీద పత్రిక పరచి, సీటుమీద నున్న కారియర్ తీసాడు. గిన్నెలన్నీ విడదీశాడు. అబ్బో! పదిమందికి సరిపడా పెడుతుంది వెంకాయమ్మెప్పుడూ.

వెంకాయమ్మ క్షత్రియ వితంతువు. నిడదవోలు స్టేషన్‌కి దగ్గరగా దక్షిణామూర్తికి పిత్రార్జితం ఒక స్థలం ఉంది. ఆ స్థలంలో పూటకూటిల్లు నడుపుతోంది వెంకాయమ్మ. అత నెప్పుడూ నిడదవోలుమీదుగా ప్రయాణం చేసినా, వెంకాయమ్మ కారియర్‌తో భోజనం పంపుతుంటుంది. వంట మహా పసందుగా చేస్తుంది అందులో ఈవేళ కోడి పులావ్ కూడాను బాగా ఉడికిన కోడి కండలు చూస్తూంటే నిగనిగ పొటమరించిన వెంకాయమ్మ వీపుమీది కండలు గుర్తుకొచ్చాయి అతనికి. వెంకాయమ్మ రవిక తొడుక్కోదు-వితంతువు గనక. ఆ వీపూ, పక్కలూ ఎంత నున్నగా ఉంటాయో అతని వేళ్ళకి తెలుసు. ఆ స్థలం తాలూకు అద్దె మరోరకంగా వసూలు చేసిన ఘట్టాలు అతనికి గుర్తుకొచ్చాయి అతనికి నవ్వొచ్చింది. తింటూ తింటూ నవ్విన మూలంగా అతను ముఖం పైకెత్తవలిసొచ్చింది నోట్లో ముద్ద జారిపోకండా. మూల నున్న అమాయకపు కళ్ళు అతన్ని చూస్తున్నాయి. చటుక్కున అతనికి సిగ్గేసింది. ఏదో పవిత్రమయిన చోట తప్పుడు ఆలోచనలు ప్రదర్శించినట్టు. తను ఆబగా తింటూ, అంతకంటె ఆబగా వెంకాయమ్మ శరీరసౌష్టవాన్ని తలుచుకుంటూ, ఆ అమాయకపు కళ్ళకు అపచారం చేసినట్టనిపించింది.

"ఆకలేస్తోందా?"

ఔనన్నట్టు తలూపింది. ఒక గిన్నెలో కొంత పులావూ కూరా పెట్టి ఇచ్చాడు. ఆమె ఆకలిగా తింది. ఆ దృశ్యం చూస్తూంటే దక్షిణామూర్తి మనస్సు ఎందుకో చివుక్కుమంది. మామూలుగా రైళ్ళలో ముష్టెత్తుకోడానికి అలవాటుపడ్డ రకం కాదని అతనికి ముందే అర్థమైంది. అన్నం తినేసి ఆమె అసహాయంగా నిలబడి ఉంటే, అత నన్నాడు.

"ఆ గదిలో కుళాయుంది. చెయ్యి కడుక్కురా"

ఆమె తన చెయ్యీ, తిన్న గిన్నే కడుక్కొచ్చింది. అతనుకూడా కారియరు

సర్ది చెయ్యి కడుక్కొచ్చాడు సిగరెట్టు ముట్టించాడు. చేతి సంచీలోంచి పేకతీసి ఒక్కడూ ఆడుకోడం మొదలు పెట్టాడు. పేకాటలో మునిగిపోయాడు.

"అది ఇస్పేటు రాణీ కదూ?" అంది ఆమె.

"నీకు పేకముక్కలు తెలుసా?"

"ఓ మా నాన్న రోజూ ఆడతాడు. సత్తెన్న మామ, పెద్దిగాడు, రత్తయ్య అంతా వొచ్చి కూర్చుని ఆడతారు."

"నాతో ఆడతావా?"

"ఛా! పేక తాకితే పాపం."

దక్షిణామూర్తి తలెత్తి ఆ పిల్లవంక చూశాడు. ఎదురుగా ఉన్న బల్ల చెక్కని ఆనుకుని నిలబడి రైలు ఊపుకి అసహాయంగా ఊగుతోంది ఆ అమ్మాయి.

"ఎవరు చెప్పారు?"

"మా యమ్మ."

"మరి మీ నాన్న ఆడతాడుగా?"

"అందుకే మా అమ్మని కొడతాడు. ఓ తూరి కాలిరిగిపోయింది మా యమ్మకి."

దక్షిణామూర్తికి తనెన్నడూ చూడ దలుచుకోని ఒకానొక దృశ్యంముందు తెర తొలిగిపోయింది. పేకాట ఆపి ఒక క్షణం ఆలోచించాడు.

"మీ నాన్న కేం పని?"

"తాగుడు, పేకాట. అందుకే అతన్నెవరూ పనికి పిలవరంట. మా యమ్మంది. ఓ తూరేమో పెద కామం దింట్లో బియ్యం దంపి మాయమ్మ నాలుగు రూపాయలు తెచ్చింది. అదేమో తన కిమ్మని తన్నాడు. ఆమ్మేమో నా మీదికి గిరాటేత్తే, ఆ డబ్బుచ్చుకొని నేను లగెత్తా నా ఎంట బడ్డాడు. పేటంతా తిప్పినా. రంగ డడ్డొచ్చాడు గాని, లేకపోతే దొరకను. నా తల సెట్టునేసి కొట్టాడు. ఇదుగో దెబ్బ."

ఎడంచెవిమీది జుట్టు తొలిగించి చూపించిం దా పిల్ల. రెండంగుళాల మేర మానిన గాయం చూశాడు దక్షిణామూర్తి.

"నువ్వీ రైలెందు కెక్కావు?"

"మా యమ్మ పట్టంలో వుండగా మరి."

"పట్నం ఎందుకు వెళ్ళింది."

"మా యయ్య మోట కత్తుచ్చుకొని తెగేసాడుగా మరి. మా యమ్మని పట్టంలో ఆస్పత్రికి తీసుకుపోయారు."

"మీ అయ్య?"

"పోలీసోళ్ళు తీసుకుపోయారు బేడీ లేసి."

ఆ పిల్ల చెప్పిన కథ కాదు దక్షిణామూర్తికి వింతగా తోస్తు, ఆమె ధోరణి. ఆమె కళ్ళయినా చెమ్మగిల్లలేదు. ఇంత దారుణం జరిగినా, దాని ఘాతుకత్వం ఆమె గ్రహించినట్టు లేదు. దక్షిణామూర్తి పేక తీసేశాడు. పెట్టెలో పెట్టేశాడు. విజయవాడ వచ్చింది. కాని ఆ పిల్లని దిగిపొమ్మని అనలేదు–

రైలు మళ్ళీ కదిలాక బొమ్మల పత్రిక తీసి నడుం వాల్చాడు. ఆ పిల్ల అలాగే నిలబడి ఉంది.

"ఆ మూల పడుకో"

"నిద్దర్రాదు"

"ఏం?"

"మా యమ్మ పాట పాడాలి"

"ఏం పాట?"

"నా సిట్టితల్లీ, నిదరపోవమ్మా.
రాసోరి పాపాయి రంగైన వోడు
సింతల్లొ సెంద్రుడూ తొంగిసూసేడు
పుంతల్లొ ఎలుతురూ పిండారబోసె-
పాకలో పాడావు పాలు సేపింది—
పడుకో నాచిట్టి పండుకోవమ్మా....
నాకంతే వచ్చు"

"పాటింకా ఉందా?"

"నాకు నిద్ద రొచ్చినా మా యమ్మ పాడతానే వుంటాది. అదేం టది? బొమ్మల పుత్తకమా?"

"ఇలా కూచుని చూడు."

అతడు కొంచెం జరిగాడు. అయితే ఆ పిల్ల కిందే కూచుని పత్రికలో బొమ్మలు చూసింది.

"నీ పే రేమిటి?" అన్నాడు పేజీలు తిరగేస్తూ.

"సిట్టితల్లి!"

"మంచి పేరు."

"ఈ బొమ్మేంటి?" అని అడిగింది చిత్రంగా ముఖం పెట్టి. ఆ ముహూర్తంలో దక్షిణామూర్తికి ఆ పిల్లంత అందమైనది సృష్టిలో మరొకటి లేదనిపించింది. ఒక్కసారి ఆ పిల్ల తలమీద చెయ్యేసి నిమరా లనిపించింది కాని అంత సబబు కాదని తోచింది. మర్నాడు ఉదయం ఆ పిల్ల దారి ఆ పిల్లది, తన దారి తనది ఈ రాత్రికిమట్టుకు తను ఆ పిల్లను ఆదుకున్నాడు. ఆకలి తీర్చాడు టిక్కట్టు లేకండా పట్నం చేరుకోటానికి సహాయపడుతున్నాడు. ఆ అనుబంధం అంతవరకే పెట్టుకోవాలి. ఈ సంగతి అనసూయకి చెపితే ఏమంటుంది? అనసూయ కిది అర్థంకాదు. చెయ్యకూడని పని చేశా ననుకుంటుంది. పోనీ పదిమంది చూస్తుండగా పేదలకు సహాయంచెయ్యడమూ కాదిది. అల్లాంటి సేవ ఉబుసుపోకకి అనసూయ చేస్తుంటుంది. కూలిపేటల్లోకి వెళ్ళి వాళ్ళకి ఆరోగ్యసూత్రాలు నేర్పుతుంది. వాళ్ళ చంటిపాపలికి నీళ్ళు పోసి పాలు పట్టిస్తుంది. అయితే, కూడా పత్రికల తాలూకు ఫోటోగ్రాఫ రుంటాడు. ఆమె ఆ పనులు చేస్తుండగా రకరకాల కోణాల నుంచి ఛాయా చిత్రాలు తీసి పత్రికల్లో వేయిస్తాడు ఆ మురికికంపు భరించినందుకు ప్రతిఫలంగా ఆమె కీర్తి ప్రచార మౌతుంది ఏకాంతంగా ఒక రైలుపెట్టెలో ఒక అనాధకి చేసిన మేలు ఎందుకూ పనికిరానిది. బూడిదలో పోసిన పన్నీరు ఈ చిట్టితల్లివల్ల తను పొందిన సంతృప్తికూడా ఒక టుంది.

ఈ ఒంటరి ప్రయాణంలో తోడు కావడం ఒకటేకాదు; చిన్న అమాయక ప్రశ్నలద్వారా నవ్వొచ్చే కొన్ని నిర్వచనాలద్వారా, కటికి వ్యాపారస్థు డైన తనవంటివాడికి ఓ కొత్త అనుభవం కలిగించింది. లాభనష్టాలతో నిమిత్తంలేని అనుభవం అది. దానికి విలువ లేదని దక్షిణామూర్తికి తెలుసు. అతని మనస్సు వర్తక వాణిజ్యాలకు అందీకాదు వాటికి యజమాని నయాపైసలూ రూపాయల ప్రపంచానికి బయటుండే విలువలు అతనికి తెలుసు అంచేతే అతను వ్యాపారస్తులలో అగ్రగణ్యుడు. అంచేతే ఆ విలువలకు రూపాయలు, నయా పైసలలో వెలకట్ట గలడు అనసూయను కూడా అతను వెల కట్టేశాడు.

"ఏమిటి చూస్తున్నావు చిట్టీ" అన్నాడు దక్షిణామూర్తి. అతను పరధ్యానంగా ఆలోచిస్తున్నప్పుడు చిట్టి తల్లి అతని చేతిలో బొమ్మలపత్రిక తీసు కుని కాళ్ళమీద పరుచుకుని చూస్తోంది.

"ఈ కుక్క మాట్లాడగలదా ?"

"ఏం ?"

"దాని నోట్లోనుంచి ఎవ్వోమాట లొస్తున్నాయిగా ?"

"నిజమే. మాట్లాడుతోంది."

"ఏ టంటాది ?"

"ఆ గోడనున్నది తినేదేనా అనుకుంటోంది."

"పిచ్చికుక్క."

"ఏం ?"

"అది టోపీగా. ఎట్టా తింటాది ?"

"కుక్కగదా. దాని కేంతెలుసు ?"

"మరి మా కావేరి కెన్నితెలుసో తెలుసా ?"

"కావే రెవరు ?"

"మా కుక్క మా అయ్య కల్లు ముంత దరిమేనా పోదు; పక్కింటి పోతురాజు కల్లుమట్టుకు నాకేత్తాది. మా ఎదురింటి ఆడపిల్లని పట్టుకుని ఏడి పిత్తాది నే నెక్కడికెల్లినా కూడా వొత్తాది. చేసనుకికూడా వొచ్చేంది. పెట్టిలో కెక్కకండా తలుపు మూసేశా "

"పోతుమా మెవరు ?"

"మా ఇంటిపక్క నుంటాడు. మిల్లు కామందుగారి డ్రైవరు ఆడికి కారుంది. తాగేసినప్పు డూరికే కామందు గారి పెళ్ళాం ఊసే. పోతుమామకి దబ్బిత్తావంట నా మీద పడతాది-దూది బత్తాలాగ - డో కంటాడు పోతుమామ. మిల్లు కామందు మడుగులో పడి సచ్చిపోతే పోతుమామని పోలీసోళ్ళట్టుకు పోయారు. పోతుమామ మంచోడు మా యమ్మని కొడతావుంటే మా అయ్యని సందెటేసి పట్టుకునీవాడు, కదలకుండా. పెద్దమనిసి. రంగత్త దూళ్ళ సాల కూలిపోయింది గాలోనకి. లేగదూడ ఉంది పాపం. పోతుమామ ఒంటిచేత్తో కూలి పోయిన పాక నెత్తిపట్టుకున్నాడు.

అవునీ - దూడనీ ఇంటో కట్టేసిందా రేత్రి పోతుమామ శానా మంచోడు. వొద్దన్నా మా యమ్మకి పావలా అర్ధా ఇచ్చివోడు. ఒకో రోజు బియ్యానికి లేకపోతే........"

దక్షిణామూర్తి రెండు చేతులూ తల కింద పెట్టుకుని చిట్టితల్లి ఇల్లూ పరిసరాలూ ఊహించుకోవడం మొదలు పెట్టాడు

ఆ పిల్ల చెప్పుకుంటూ పోతోంది. చటుక్కుని ఆమె కేసంగతి జ్ఞాపకంవస్తే అందులోకి దాటేస్తుంది. మొదలుపుట్టిన ఘట్టం పూర్తి చెయ్యకండానే మరో ఘట్టంలోకి పోతుంది. రకరకాల పేర్లు ఆడ, మగ, వచ్చి పోతున్నాయి. వాళ్ళెవరో ఆమె వివరించి చెప్పదు. అయినా ఆమె వివరిస్తున్న కథలో ఒక పరిపూర్ణతుంది. అతని మనస్సులో అతి స్పష్టమైన చిత్రంగా అది క్రమంగా రూపు దాల్చింది. అటువంటి గుడిసెలు, అటువంటి వ్యక్తులు, తనవోటివాళ్ళు ఎన్నోసార్లు చూసి ఉండవచ్చు. వాళ్ళ కథలు రకరకాలుగా విని ఉండవచ్చు. కాని నాలుగయిదేళ్ళ ఈ పసిపాప వివరించినంత స్పష్టంగా ఆ కథను ఎన్నడూ వినలేదు. ఇక ముందు వినబోడు. ఆమె చిన్ని మాటలలో తను ఎరగని వింత ప్రపంచకం పరుచుకుంది. ఆ వ్యక్తుల్నీ ఆ వాతావరణాన్నీ మననం చేసుకుంటూ వుండగా అతనికి నిద్ర పట్టింది. అతి ప్రశాంతమైన నిద్ర; ప్రగాఢమైన నిద్ర.

అతనికి మెలకువ వచ్చేసరికి పెట్టె తలుపు తెరిచుంది. అవతల పొద్దుటి కనుచీకటిలో కంటి కలవాటుపడ్డ పట్నం దృశ్యాలు మసగ్గా కనబడ్డాయి. గుమ్మంలో సందేహిస్తూ నిలబడ్డాడు ఇంటి నౌకరు, దొర. ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు దక్షిణామూర్తి. దొర పక్క చుట్టేస్తూ అన్నాడు.

"చిన్న శెట్టియా రొచారు సార్."

"ఎక్కడికి?"

"ప్లాట్ఫారంమీ దున్నారు సార్."

ఒక్కసారి బాత్రూములోకి వెళ్ళి ముఖం చన్నీళ్ళతో కడిగి తుడుచుకున్నాడు. తల దువ్వుకున్నాడు. దొర తెచ్చిన కాఫీ తాగాడు ఈలోగా దొర, సామానంతా కూలీచేత మోయించుకుపోయాడు ఆ తరవాత అతను పెట్టెలోంచి దిగాడు. దిగగానే చిన్నశెట్టి కాళ్ళమీద పడ్డాడు ఇంత జన సమూహంలో ఈ దృశ్యం జరిగినందుకు దక్షణామూర్తికి కోపం, చిరాకూ పుట్టుకొచ్చాయి.

"చెట్టియార్, పదిమందిలో ఈ పని చేశావంటే నిన్ను దుంపనాశనం చేస్తాను. లే ముందు," చెట్టియార్ లేచాడు దక్షిణామూర్తి అతి తొందరగా బయటికి నడుస్తుంటే చెట్టియార్ కూడా పడ్డాడు.

"పొరబాటయిందిసామీ! మీ సొత్తు నయాపైసాతో ఇస్తును. ఏదో మా తమ్ముడుండాడే, వాడి బుద్ధి మంచిది కాదు. నాక్కూడా తెలియదు. సిమెంటని చెప్పి వట్టి బూడిద బస్తాల్లో నింపి మీ కిచ్చినాడని. మీ తోడు. మీరు ఊరిలో లేరు. మీ వకీల్ నా మీద అరస్టు వారంటు తీసినాడు. పదిమంది బిడ్డల వాండ్లము ఈతూరి దయ చూపించా రంటే..."

"పదకొండు గంటలకు పోయి మా వకీలును చూడండి."

"నిన్న సూస్తిని. అతను సిండా కోపంగా..."

"ఈవేళ పదకొండు గంటలకు వెళ్ళి చూడండి"

"తమరుదా దయ తలిస్తే..."

"చెపుతుంటే మీక్కాదూ, పదకొండు గంటలకి వెళ్ళి చూడమని. ఇంకొక్కడుగు నా వెనకాల వేశారంటే, ఈ రైల్వే పోలీసులచేత మిమ్మల్ని అరస్టు చేయిస్తాను...ఇక వెళ్ళండి"

తన్ను తిన్న కుక్కలాగా వెళ్ళి పోయాడు చెట్టియార్. తన్ను మోస గించినవాళ్ళమీద తన కెల్లాంటి అధికార మొస్తుందో దక్షిణామూర్తికి బాగా తెలుసు. వాళ్ళని నిర్దాక్షిణ్యంగా నాశనం చెయ్యగల డతను. వాళ్ళు తనచేతి కీలు బొమ్మలు. వాళ్ళని శిక్షించడంలో అతని కేమీ పెద్ద సంతృప్తి ఉండి కాదు. వాళ్ళు సంపూర్ణంగా తన దయమీద ఆధారపడి ఉండేటంతవరకూ తీసుకొస్తే, అతని కొక సంతృప్తి. దానివల్ల అతని సమర్థత అతనికే రుజువవుతుంది వాళ్ళు వచ్చి తన కాళ్ళుపట్టుకోడం అతనికి చాలా ఇష్టం. అయితే పదిమందిలోకాదు.

చెట్టియార్ ఆడిన నాటకం, అతని తమ్ముణ్ణి విడదీసి, లంచం ఇచ్చి. అతని చేత కోర్టులో అన్నగారికి వ్యతిరేకంగా సాక్ష్యమిప్పించడం, చెట్టియార్ దగా కోరని కోర్టువారికి రుజువు కావడం, అన్నీ గుర్తుకు తెచ్చుకుంటూ అతను కారు దగ్గరకు వచ్చాడు. వెనకతలుపు డ్రైవరు తెరిచాడు. అతను ఎక్కి కూచున్నాడు. డ్రైవరు తలుపు ముయ్యబోతుంటే అడ్డొచ్చింది చిట్టితల్లి. నిద్ర లేవగానే ఏదో మరిచిపోయినట్టు అనిపించిం దతనికి. ఇంతలో చెట్టియార్ సంఘటనవల్ల అది పూర్తిగా మరిచి పోయాడు. కాని చిట్టితల్లి కనబడగానే తను మరిచిపోయింది ఆమెనని గుర్తు కొచ్చింది.

అయితే రాత్రి రైలు పెట్టిలో ఏకాంతంగా ఆమెతో ఎంత ఆంతర్యం ఏర్పడ్డా, తన పగటి జీవితంలో ఆమె ప్రవేశించడం మాత్రం అతని కిష్టంలేదు. కొంచెం చిరాగ్గానే అడిగాడు.

"ఏం చిట్టీ?"

"మా అమ్మదగ్గరికి తీసికెళ్లవా?" అంది దీనంగా చిట్టితల్లి.

"ఫో, ఫో," అంటూ లాగేయ్యబోయాడు దొర.

"ఉండు దొరా!" అన్నాడు దక్షిణామూర్తి. "మీ అమ్మెక్కడుంది."

"ఏమో!"

"ఎప్పుడొచ్చింది పట్నానికి?"

"నిన్న పొద్దున్న"

"ఏ రైలుమీద?"

"రైలుమీద కాదు. రెండు గడలు పొడుగ్గా ఏసి, మధ్దినేమో సిన్న సిన్న ముక్కలేసి, ఓ మంచంకింద కట్టి దానిమీద మోసుకొచ్చారు. మా నాన్నని పోలీసులు పట్టుకుపోయారుగా, అందుకని సీతయ్యబాబు ముంతలో నిప్పు పట్టుకుని ముందెళ్ళాడు"

దక్షిణామూర్తి గుండె గతుక్కుమంది

పట్నం వచ్చిందని ఎందుకు అనుకున్నావు?"

"రంగత్త సెప్పిందిగా. నేను మా యమ్మతోకూడా పోతానని ఏడిస్తే సెప్పింది. 'పట్నం అస్పత్రికి తీసుకుపోతున్నారు, బాగవగానే తిరిగొత్తాదలే' అంది. తనింటికి తీసుకుపోయి కూడెట్టింది. తినేసి నేను జారుకున్నాను. పట్నం పోద మెట్లాగంటే సోడా సాయిబ్బు అన్నాడు, ఆ రైలెక్కితే సీదా పట్నం పోతాదని. ఎక్కేశా."

ఒక క్షణంపాటు దక్షిణామూర్తికి నోట మాట రాలేదు. కళ్ళలో చెమ్మ కనబడకుండా తుడుచుకుని అన్నాడు.

"ఎక్కు, కారెక్కు."

ఆమె కారెక్కింది. కారు కదిలింది.

షినాయి నగర్‌లో పెద్ద బంగాళా అతనిది. దారి పొడుగునా చిట్టితల్లి ఏదో అడుగుతూనే ఉంది. దక్షిణామూర్తి పరధ్యానంగా సమాధానాలు చెపుతున్నాడు. ఆఖరుకి కారు పెద్ద ఇనుప తలుపులను దాటి గుండ్రటి రోడ్డువెంట తన ఇంటిముందు పోర్టికోలో ఆగేవరకూ అతనొక నిశ్చయానికి రాలేకపోయాడు

చిట్టితల్లి నేం చెయ్యాలి?

ఆమె కెలాగో సహాయం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. ఆగిన కారు తలుపు పక్క నిలబడి, అమాయకంగా ఆమె చెప్పిన కథ విన్నప్పుడు అతని వ్యక్తి ఆపాదమస్తకమూ నీరయిపోయింది. ఆ ముహూర్తంలో ఆమెను కారెక్కమనడం తప్ప మరో ఆలోచన అతని మనస్సులోకి రాలేదు. కాని జరిగిన కథ వింటే అనసూయ అతడు చేసినపని హర్షించదు. అనసూయే కాదు, అతని స్నేహితులూ, ఆప్తులూ ఎవరూ హర్షించరు. ఆమెను చూసి జాలిపడ్డం, పదో పదిహేనో చేతిలో పెట్టడం—అంతవరకూ మాత్రం అతని కర్తవ్యమూ, విధీ అని అంతా ఒప్పుకుంటారు. కాని ముక్కూ మొగం ఎరగని ఒక అనాధ బాలికను కార్లో ఎక్కించి ఇంటికి తీసుకురావడం, అది మట్టుకు అందరికీ వింతగా తోస్తుంది.



అందులో తనలాంటి ఆరితేరిన వ్యాపారస్థుడు చెయ్యవలసిన పనికాదు. ఇది వింటే సాటివాళ్ళు అతని మతి భ్రమించిందనుకుంటారు. అతని వ్యాపారానికే కాదు, అతని పేరు ప్రతిష్టలకే దెబ్బ. అయితే ఆ పసిపాపను వీధిపాలు చెయ్యడానికి అతనికి మనసొప్పలేదు. పోర్టికోలో ఆగిన కారులోంచి అతను దిగకండానే తోటమాలి గుడిసె దగ్గరకు నడపమన్నాడు డ్రైవరుని. తీరా తను దిగాక డ్రాయింగు రూములో ఎవరన్నా వేచిఉంటే వాళ్ళకి పిల్లను గురించిన సముజాయిషీ అంతా చెప్పుకోవాలి.

తన ఇంట్లో తనే ఏదో దొంగతనం చేస్తున్నట్టనిపించిందతనికి. ఒక వంక అనసూయనీ, మరోవంక చిట్టితల్లినీ కూడా ఏదో మోసగిస్తున్నట్టు అతని మనస్సు పీకింది. కాని గుండె నిబ్బరపరుచుకుని, తోటమాలిని పిలిచాడు.

"ఆర్ముగం! ఈ పిల్లని నీ ఇంట్లో పెట్టుకుని, పెట్టూ పోతా చూస్తుండు."

"ఎత్తనినాళ్ళు సార్," అని అడిగాడు ఆర్మగం.

"నేను చెప్పేదాకా, తెలిసిందా? దొరగారికి అన్నీ వివరాలతో చెప్పాల గావునేం? నీ పిల్లలతో సమంగా చూస్తుండు. ఆమె కేమన్నా లోటొచ్చిందా జాగ్రత్త."

తోటమాలిమీద కోప్పడి, ఆమె విషయం అంత కచ్చితంగా అతనితో ఏర్పాటు చేశాక, అతని మనసులో ఇంతవరకూ అలజడి పెడుతున్న ఆందోళన కొంత తగ్గింది. ఆమె ఎడల తన కర్తవ్యాన్ని నెరవేర్చానని సంతృప్తి పడ్డాడు.

"ఆఫీసులో అడిగి డబ్బు తీసుకుని ఆ పిల్లకి గుడ్డలు కుట్టించు," అని చెప్పి డ్రైవరుని కారు షెడ్డులో పెట్టమని, ఇంటివేపు నడిచి వెళ్ళాడు సావకాశంగా ఆ పిల్లని ఒక అనాధశరణాలయంలో జేర్పించేస్తే, సమస్య అన్నివిధాలా పరిష్కారమైపోతుందని నిర్ణయించుకున్నాడు.

ఆ తరవాత పని తొందరలో ఆ పిల్ల విషయం పూర్తిగా మరిచిపోయాడు. అన్నిటికన్నా ముఖ్యమయిన పని అతని పెళ్ళి.

అతను సరదాగా గడిపొద్దామని విశాఖపట్టణానికి బయలుదేరిన రోజునే, అనసూయ తండ్రికి గుండెజబ్బు సూచనలు కనిపించాయట. అనసూయ పట్టుబట్టి ఆ వార్త అతని కందకుండా ఆపించింది. ఒకటి, ఏదో విశ్రాంతి కోసం వెళ్ళినతన్ని వెంటనే తగినంత కారణం లేనిదే రప్పించడం న్యాయం కాదనీ; రెండు, తన తండ్రి గుండె జబ్బు అంత ప్రమాదమైనది కాదనీ. అయితే అనసూయ తండ్రి మాత్రం ఒక వాగ్దానం పుచ్చుకున్నాడు. దక్షిణామూర్తి తిరిగొచ్చిన వెంటనే అతనికీ అనసూయకీ పెళ్ళి జరిగిపోవాలని. నర్సింగ్‌హోమ్‌లో తమ ఆస్థాన జ్యోతిష్కుల్ని రప్పించడం, ఇద్దరి జాతకాలూ చూసి, ముహూర్తం నిర్ణయించడం, అన్నీ దక్షిణామూర్తి ఊరికి చేరుకోకుండానే జరిగిపోయాయి. మొదట అతనికి కొంత చిరాకు కలిగింది, తన ప్రమేయం లేకుండా ఇదంతా జరిగినందుకు.

"సరే, నీ కిష్టం లేకపోతే వొద్దని నాన్నతో చెప్పేస్తానులే ఇందులో బలవంత మేముంది?" అంది అనసూయ.

"ఆ! అదేమన్న మాట. ఇప్పుడు పెళ్ళి వాయిదా వేస్తానంటే మాత్రం నే నొప్పుకుంటానా?" అన్నాడు ఛలోక్తిగా దక్షిణామూర్తి తను చిరాకు పడ్డందుకు అనసూయకి కోపం వొచ్చిందని గ్రహించి ఆమెను దగ్గరగా తీసుకుని పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు కూడా. అంత చనువు ఆమె ఇవ్వడం తను తీసుకోవడం అదే మొదటిసారి ఆమె ఎంత నవయువతి

కయినా, కొన్నింటి విషయంలో మాత్రం మహా పాతకాలపు మనిషి.

ముహూర్తం సరిగ్గా వారం రోజులైనా లేకపోవడం మూలాన అతనికీ ఆమెకూ కూడా నిద్రా విశ్రాంతీ లేదు. వ్యాపార విషయాలన్నీ వాయిదావేసి రోజుకి ఇరవై నాలుగు గంటలూ పనిచేసినా పెళ్ళి ఏర్పాట్లు పూర్తయేటట్టు కనబడలేదు. బంగారునగలు బహిరంగంగా చేయిం డానికి వీల్లేదు గనుక, అతని ఇంట్లో సరుకుల గదిలో ఆ కార్ఖానా ఏర్పాటు చెయ్యాల్సి వచ్చింది. రెండు వేపులా పిలుపులు, ఆహ్వాన పత్రాలు, వగైరా ఏర్పాటులన్నీ అతని నెత్తిన పడ్డాయి. మామగారు నర్సింగ్‌హోమ్‌లో ఉన్నారు: కయనవంక మగదక్షతలేదు. ఒక్కగా నొక్క కూతురు. తమ్ముళ్ళనీ, వాళ్ళ పిల్లల్నీ ఆయన నమ్మలేదు-ముఖ్యంగా డబ్బు విషయంలో.

అన్నిటికన్నా ఎక్కువకాలం తినేసింది పెళ్ళిబట్టల ఎన్నిక. ఆమెకు కొనవలసిన చీరలు ఆమెనే ఎంచుకోమన్నాడు దక్షిణా మూర్తి

"బాగుంది, కట్టుకనేదాన్ని నేనయినా, అనుక్షణం చూసేవాడిని నువ్వు. నీకూ నచ్చి తీరాలి."

బట్టల దుకాణంలో అడుగు పెడితే, ఒక పూట గడిచిపోయింది, ఒక్క చీరయినా ఎంచకుండానే. పెళ్ళిలోగా ఈ చీరలుకొనడం ఎల్లాగా పూర్తికాదని నిరాశ చేసుకున్నాడు దక్షిణామూర్తి. కాని రేపు పెళ్ళనగా సేలం వెళ్ళి ఆఖరి చీరలు కొనేసి, రాత్రి పదిన్నరకి ఇంటికి తిరిగొచ్చేసరికి, ఫరవాలేదు రేపు పెళ్ళి జరుగుతుందన్న నమ్మకం కలిగిందతనికి. వచ్చిరావడంతోటే సోఫాలో కూలబడి కన్ను మూశాడు పెద్దగాలివానకి అలసి విశ్రమిస్తున్న ప్రకృతిలాగుంది అతని స్థితి అప్పుడొచ్చి చెప్పాడు దొర.

"ఆ పొణ్ణు కనబడలేదు సార్."

"ఏ పొణ్ణు?"

"తోటకారన్‌కి మీరిచ్చిన పొణ్ణుసార్. ఆ దినం మీతో కార్లో..."

"ఏమయింది?"

"పొద్దున్న తొమ్మిది గంటలకి—చూసినాడంట. ఆ తరవాత చూణ్లే లేదంట."

దక్షిణామూర్తికి తనేదో తప్పుచేసిన ట్టనిపించింది.

"ఆర్ముగా న్నిలా పిలు."

ఆర్ముగం వచ్చాడు. అతని పెళ్ళాం వొచ్చింది. ఇంటిముందు పందిరి వెయ్య డానికి కుదిర్చిన కూలీ లందరూ వచ్చారు. అన్ని పోలీస్ స్టేషన్లకీ ఫోన్ మోగింది. ప్రతి ఖయిదు నిముషాలకీ వాకబులు. ఎదురుగా కనిపించినవాణ్ణి తిరిగి తిరిగి అదే ప్రశ్న అడగడం. దక్షిణామూర్తి అందర్నీ తిట్టాడు. తన కప్పగించిన పిల్ల మాయమైనందుకు ఆర్ముగాన్నీ, ఆమె ఎక్కడికి పోయిందో జాగ్రత్తగా చూడ

నందుకు దొరనీ. ఆమెను పట్టుకోలేక పోయినందుకు పోలీసుల్ని పై అధికారులందరూ నిద్ర మేలుకున్నారు హోమ్‌శాఖ మంత్రిగారి ద్వారా. అందరూ టెలిఫోన్ల వద్ద కూచున్నారు, చిట్టితల్లి కబురు కోసం. ఒక్క అనసూయకి మాత్రం అతడు ఫోన్ చెయ్యలేదు. ఆ క్షణంలో అతడు అనసూయ సంగతే మరిచి పోయాడు

రాత్రి పన్నెండు దాటినా చిట్టితల్లి కబురు తెలియలేదు. దక్షిణామూర్తికి ఆందోళన ఎక్కువైంది. ఈ మహాపట్నం ఆ పసిపాపను మింగేసిందా?

ఆర్ముగం తన పిల్లలు ఆరుగుర్ని నిద్ర లేపి తీసుకొచ్చాడు. అందర్నీ తిరిగి తిరిగి విచారించాడు దక్షిణామూర్తి కొన్ని అతనికి మరీ బాధ కలిగించిన వివరాలు దాటేశేవాడు ఉదాహరణకి, మూడు రోజులక్రితం అతడూ అనసూయా బయటికి పోడానికి కార్లో బయలుదేరినప్పుడు, దారి కడ్డంగా నిలబడిందట చిట్టితల్లి. ఆర్ముగం ఆమె నోరు మూసి ఒక గుబురుపక్కకి లాగేశాట్ట అయ్యగారికి ఆమేఏడుపువింటే కోపమొస్తుందని. అతన్ని చూడ్డానికి ఎన్నో సార్లు ప్రయత్నం చేసిందట. గుమ్మం లోపల అడుగు పెట్టకుండానే అవతలికి ఈడ్చిపారేశాకటదొర.

"మా అమ్మదగ్గిరికి తీసికెళ్లానన్నాడు. నన్నొదులు," అని గుంజుకునేదట వీళ్ళు పట్టుకుంటే.

వాళ్ళతో ఎంత గట్టిగా మాట్లాడినా, ఎవర్నీ నిజంగా తిట్టలేకపోయారు దక్షిణామూర్తి. ఎందుకో వాళ్ళలా చేసినందుకు నిజంగా బాధ్యత తనదే ననిపించిందతనికి.

మరో రోజున ఆర్ముగం చేతిలోంచి విడిపించుకుని అరుస్తూ తన కారు వెనకాల పరిగెత్తుకుంటూ వచ్చిందట. పంపి రేస్తున్న ఆసామీ ఒకడు వెనకాల వెళ్ళి ఆమెను పట్టుకుని తీసుకొచ్చి తిరిగి ఆర్ముగానికి అప్పగించాడట.

ఇంక చిట్టితల్లి దొరక దన్న నిస్పృహ అతని మనస్సులో ఆవరిస్తున్న సమయంలో ఆర్ముగం మూడోకొడుకు చెప్పిన ఒక సంగతి గుర్తుకొచ్చింది.

అక్కడే పడుకుని నిద్రపోతున్న బాలూని బలవంతంగా ఊపి లేపాడు దక్షిణామూర్తి. ఈ దిక్కులేని పిల్లకోసం తమ యజమాని పడుతున్న ఆందోళన నౌకర్ల కెవరికీ అర్థంకాలేదు.

"ఏంరా బాలూ! పొద్దున్న ఏమిటి చూశానన్నావు? నువ్వూ చిట్టీ కలిసి, ఎక్కడికి పోయారు? ఇందాక ఏమిటన్నావు? చెప్పు" అని ఆత్రంగా అడిగాడు.

"పాడకట్టసార్. పొణం సార్ పొణం" అన్నాడు బాలు సగం మగతలో

"ఎక్కడ? శవాన్ని ఎటు తీసుకు పోయారు?"

"భూమి జికరై పక్కమా సార్."



"డ్రైవర్! కారు తియ్యి—తొందరగా..."

డ్రైవర్ షెడ్ తలుపు తెరిచి కారు ఇవతలికి తీసేదాకా ఆతనికి తొందర ఆగలేదు తనే షెడ్ దగ్గరకు పరుగెత్తాడు తనే కారుస్టార్ట్ చేసి బుర్రుమని శరవేగంతో వీధిలోకి తిప్పాడు. ఎవరో మోసుకు పోతున్న శవం చూసింది. తన తల్లినలాగే తీసుకుపోయాడు. ఆ శవంతో పోతే తన తల్లి తప్పకుండా కనబడుతుందని గంపెడాశతో బయలుదేరింది చిట్టి పాపం. పూనమళ్ళి హైరోడ్డులోకి కారు తిప్పుతుండే టైర్లు కిర్రుమన్నాయి. ఒక లారీనీ, ఒక రిక్షానీ భయపెట్టి కారు పూనమళ్ళి వేపు స్థిరపడింది. వంతెన దాటింతరవాత వేగం తగ్గించాడు. కుడిచేతి పక్కనున్న సర్పి

లైటు వెలిగించి ఆ స్మశానం అంతా వెతుకుతూ మెల్లగా కారునడుపుతున్నాడు. నిర్మానుష్యమైన ఆ స్మశానంలో, ఆ కటిక చీకట్లో—ఏకాకిగా నిస్సహాయంగా దూరంగా కూర్చుని ఉంది ఒక చిన్న ప్రాణి ఆమె చిట్టితల్లి అని గుర్తుపట్టాడు దక్షిణామూర్తి తనతల్లిని వెతుక్కుంటూ మద్రాసు వచ్చింది తన తల్లిని వెతుక్కుంటూ స్మశానంలోకి వచ్చింది. తల్లి లేదనీ, ఎక్కడా లేదనీ తనకింక కనబడదనీ తెలుసుకుంది తల్లి లేని లోకం స్మశానం. ఆ స్మశానంలో ఒంటరిగా కూర్చుంది. ఆ దృశ్యం కంటబడగానే దక్షిణామూర్తికి లోపల ఎక్కడో విపరీతమైన బాధ పుట్టింది. అల్లాగే స్టీరింగు చక్రంమీద కళ్ళు మూసి వాలాడు మెల్లగా కారు తలుపు తెరిచాడు. స్మశాననిశ్శబ్దాన్ని భంగపరచకుండా జోళ్ళు విదిలించి పారేసి వట్టి పాదాలతో నడిచాడు కారు దీపాలయినా ఆర్పకుండా.

చిట్టి వెనక ఒక క్షణం నిలబడ్డాడు. మెల్లగా వంగాడు, కూర్చున్నాడు. చేతులు ఆమెచుట్టూ వేశాడు. ఆమె ఒక్కసారి ఉవ్వెత్తుగా లేచింది.

''నన్నొదిలేసెయ్ మీరంతాదొంగలు నన్ను ముట్టుకోకు—నన్నొదిలేసెయ్ ''

'' చిట్టీ! '' అన్నాడు మెల్లగా, మృదువుగా.

''అబద్ధాలాడారు నాతో—రంగత్తా, నువ్వూ అంతా మా అమ్మని అల్లాగే కాల్చేసి—ఆస్పత్రిలో ఉందన్నారు. పట్నంలో ఉందన్నారు. ఎందుకన్నారు? మా అమ్మ ఇంకలేదంటగా. ఇంకసలు రాదంటగా ఉందని ఎందుకన్నా నాతో-నాతో అబద్ధాలెందుకాడారు మీరంతా? రంగత్తా, నువ్వూ-అంతా ?''

మాట మాటకీ మధ్య ఎగుపుల్లో, ఆకస్మికంగా తగిలిన గాయం రక్తం చిందుతోంది. ఆమెలో, ఆకస్మికంగా కలిగిన జ్ఞానం కత్తిలా ఇంకా కోస్తోంది? దక్షిణామూర్తికి తెలుసు, ఆ గాయాన్ని ఓదార్పులు మాన్పలేవని.

చిట్టితల్లిని భుజంమీద వేసుకున్నాడు. కాలుతున్న చితుల మధ్య కాలిబాటవెంట రోడ్డువేపు నడిచాడు. చిట్టితల్లి ఎగుపులు క్రమంగా సన్నగిల్లాయి. ఆమె ఎడం చెయ్యి అతని కంఠాన్ని చుట్టుకుంది—ఇంక జీవితాంతం వదలని బంధంలాగా

కారు తలుపు తెరిచి చిట్టిని లోపల సీటుమీదికి దింపాడు. అప్పుడు చూశాడు చిట్టితల్లి నిద్రపోయిందని ఆమె శరీరం వశందప్పి సీటుమీద పడి పోయింది. ఉదయం తొమ్మిదిగంటల నించి ఈ నాలుగోఝాము రాత్రివరకు ఆ లేతమనస్సులో ఎన్ని ఉప్పెనలు చెలరేగాయో ఊహించుకోగానే అతని ఒళ్ళు జలదరించింది. తలుపు మెల్లగా మూసి, డ్రైవరు సీటువేపు కొచ్చాడు. ఒక్కసారి దిగంతంవరకూలాగ పరుచుకున్న స్మశానంవేపు చూశాడు. మెల్లగా







కారులో ఎక్కి తలుపు మూశాడు. పరధ్యాన్యంగా ఇంటికి నడిపించాడు కారు.

మిగతావాళ్ళు చిట్టితల్లిని తియ్యబోతోంటే వారించాడు. తనే ఎత్తుకుని వెళ్ళిలోపల సోఫాలో పడుకోపెట్టాడు.

పక్కనున్న ఫోను తీసి అలవాటైన నంబరొకటి డయల్ చేశాడు. కొంత సేపటికి-ఎంతో సేపటికి పరిమితమయిన కంఠం నిద్రమత్తులో బరువుగా పలికింది.

"డార్లింగ్! ఏమి టింత రాత్రివేళ?" అంత రాత్రివేళ అతడు తప్ప మరెవ్వరూ ఫోన్ చెయ్యరని ఆమెకు తెలుసు.

"నువ్వు తక్షణం ఇక్కడికి రావాలి."

"రేపు పెళ్ళన్న సంగతి మరిచి పోయావా ?"

"లేదు గనకే రమ్మంటున్నాను. నువ్వు వచ్చి తీరాలి. నీ కో ముఖ్యమైన బహుమానం ఇవ్వదలిచాను.......అది నువ్వు అంగీకరించాలి."

"ఏమిటది ?"

"నువ్వు రాగానే చూపిస్తాను." అతడు ఫోన్ పెట్టేశాడు. ఆమె వస్తుందని తెలుసు. అతని చెయ్యి అప్రయత్నంగా చిట్టితల్లి తల నిమిరింది. అనసూయతో చెప్పదలుచుకున్న మాటలు మననం చేసుకున్నాడు.

"అనసూయా! ముందీ చిట్టితల్లికి నువ్వు తల్లివి కావాలి. అయితేనే నాకు భార్యవు కాగలవు." అతని హృదయంలో అమితమైన ప్రశాంతి నిండింది.

———

చెట్లూరి సీతారాజేశ్వరరావు



# నక్క-నిజమయింది

ధనమ్మ పేరుకుతగ్గ యిల్లాలు అక్షరాభ్యాసం రోజున పుస్తకాలు ముట్టుకోలేదు. డబ్బుని పట్టుకుంది. ధనమ్మ బామ్మ 'జమీందార్ పెళ్ళాం అవుతుందని' జోస్యం చెప్పేసింది. కాని ధనమ్మ వెంకటనర్సయ్య భార్యయింది. వెంకటనర్సయ్యకి కూలిపోయే కొంప, రెండెకరాలు పొలంమాత్రం ఉంది. ధనమ్మ నిరాశపడలేదు. సంతోషించింది.

ఎందుకంటే వెంకటనర్సయ్య మంచి మొగుడు. అన్ని పవర్సూ ధనమ్మ కిచ్చేసి తాను చదరంగంబల్ల పుచ్చుకుని కూర్చున్నాడు. ధనమ్మ కిదే కావాలి. మొగుడ్ని చాటుచేసుకుని చక్రం తిప్పింది. పిడక లమ్మింది. పాలు అమ్మింది. ధనాన్ని పోగేసి రెండెకరాల ప్రక్క సున్న చుట్టింది.

"మా ధనం ఉంది చూశారూ ..."

వెంకటనర్సయ్య పొగడ్డం, ఆరాధిం చడం నేర్చుకున్నాడు. పిల్లలకి కూడ తల్లి ప్రాముఖ్యమే కనిపించింది.

ఓ సుప్రభాతాన వెంకటనర్సయ్య వేపచెట్టు క్రింద ముఖం కడుగుతూంటే 'దండాలండి' సీతయ్య దగ్గరకి వచ్చాడు. ఉత్సవ విగ్రహాలకి కూడ ఆరాధన జరుగుతుందని వెంకట నర్సయ్యకి తెలుసు. "అమ్మగారు లోపలుంది..." అన్నాడు.

సీతయ్య పెరటివైపుకి వెళ్ళాడు.

అక్కడ పదిమంది పైగా జన మున్నారు. ధనమ్మ పాలు, పెరుగు అమ్మకంలో ఉంది. సీతయ్యని చూసి పలకరింపుగా నవ్వింది. జనం వెళ్ళే దాకా సీతయ్య ప్రక్కనే కూర్చున్నాడు. ధనమ్మ ఖాళీ గిన్నెలు దాసీదానికి పడేసి "కాఫీ త్రాగుతావా సీతయ్యా ... ఏమిటో నీకు ముఖమాటం. ఎప్పుడూ ఏం తాగవు" అంది దగ్గరకి వచ్చి.

ఆమె తత్వం తెలుసు గనుక సీతయ్య నవ్వి ఊరుకున్నాడు.

"మామిడిచెట్లు అడిగావు ... మళ్ళీ కనిపించలేదు. చెట్లు అమ్మమని బేర గాళ్ళు వస్తున్నారు. ఊర్లోవాడివి నిన్నడిగి యిద్దామని ఆగాను..."

ఓ వారం క్రితం సీతయ్య వచ్చి చెట్లు చూసుకున్నాడు. ధర ధనమ్మకి నచ్చలేదు. తర్వాత చెబుతానని మిగతా బేరగాళ్ళని పిలిచింది. వాళ్ళు సీతయ్య కంటె తక్కువ చెప్పారు. దాంతో ధనమ్మ ప్లేటు ఫిరాయించింది.

"మీలాంటి దయగల తల్లులని నమ్ముకునే ఏదో సంసారం ఈడ్చు కొస్తున్నా నమ్మగారూ. నామీద మీ కా అభిమానముంది." సీతయ్య పొగిడాడు.

ధనమ్మకి పొగడ్త లక్కర్లేదు. "మొన్నటి ధరకి కోసుకు పో."

సీతయ్య పెరటివైపున ఉన్న మామిడిచెట్లని చూసి వచ్చాడు. "అలాగే అమ్మగారూ !"

"ఇవాళ నువ్వు కోసుకుపోవాలి. మేం పెళ్ళికి వెళుతున్నాం. ఎవరన్నా తెంపుకుపోతే బాధపడతావు"

"ఇవాళ సంతకూడా నండి. ఇప్పుడే వచ్చి కోసేస్తాను."

సీతయ్యకి యాభై యేళ్ళుంటాయి. చిన్నప్పట్నుంచి కాయగూరల వ్యాపా రమే చేస్తున్నాడు. సంసారం పెద్దది కావడంతో ఎప్పుడూ కరువుగానే ఉంటుంది.

సీతయ్య రెండయ్యేసరికి కాయలు కోయడం పూర్తిచేశాడు. రాసులు క్రిందపోశాడు.

"అమ్మగారూ చూస్తూండండి బండి తోలుకు వస్తాను." అని చెప్పి వెళ్లాడు.

రాసులు చూడగానే ధనమ్మకి కన్ను కుట్టింది. తను చవుకగా యిచ్చేసింది. సీతయ్యకి వచ్చే లాభాన్ని అంచనా వేసుకుంది ఆమె గుండె లదిరాయి.

ఇప్పుడు రేటు ఎక్కువ చేయమనడం బాగోదు. ఏంచేయాలో ధనమ్మ వేగిరం ఆలోచించింది. పెద్దగంప తీసుకువచ్చి కాయలు యింట్లో పోసుకుంది.

కంగారుగా యిలా రెండుసార్లు చేసింది.

టీకోసం వచ్చిన వెంకటనర్సయ్య "నువ్వు మోస్తున్నావేమిటీ కాయలు ... పాలేరు వీధిలో ఉన్నాడు కదా !" అన్నాడు భార్య కష్టపడిపోతోందని.

"మీరు నోర్మూసుకోండి," ధనమ్మ కసిరిపడేసింది.

ఆ మానవుడింక మాట్లాడలేదు.

సీతయ్య బండి తెచ్చి కాయలు ఎగుమతి చేసుకుంటున్నాడు. గుర్తించాడేమోనని ధనమ్మ వసారాలోనుంచి తొంగిచూస్తోంది.

సీతయ్య కాయలు వెయ్యడం ఆపి వంటింటి దగ్గర కొచ్చాడు, "అమ్మగారూ !" అంటూ.

తను కాయలు తీయటం చూశాడేమో, ధనమ్మ వణికిపోయింది. ఏదో పని ఉన్నట్లు కాస్సేపు రాలేదు.

సీతయ్యకి మాట్లాడడానికి అవకాశం యియ్యకుండా "డబ్బు నువ్వు యిప్పుడు యిచ్చెయ్యాలి, ఏదో వస్తుందనుకున్నాం, అది రాలేదు." వేగిరం చెప్పింది.

"సంత చెయ్యకుండా ఎలా వస్తుందమ్మా?" దీనంగా అన్నాడు.

"మీరంతా అంతేరా ... ఇంతకీ ఎందుకు పిలిచావు ?"

"మామిడికాయలు..."

"నేను చూస్తూనే ఉన్నాను. ఎవరూ తియ్యలేదు. నువ్వొత్త అనుమానం మనిషివి."

"అదికాదమ్మగారూ. రాశిదగ్గర గొలుసుపడి ఉంది మీది ... " అంటూ తీసి అరుగుమీద పెట్టాడు. కంగారులో యిందాక జారిపోయి ఉంటుందనుకుంది.

డబ్బుకోసం కలవరించే ధనమ్మకి వాడి నిజాయితీకి మతిపోయింది.






మధు, సుషమ, చంద్రం ఈ అభివృద్ధి కార్యక్రమాల్లో అమితోత్సాహంతో పాల్గొని, అన్ని విధాలా శేఖర్ కు అండగా నిలిచారు.

శేఖర్ చదువుకు కలకత్తా వెళ్ళిన కొత్తలో అనుకునేవాడు. "పల్లె ప్రజలంతా కలకత్తామీద యింత మోజు చూపుతా రెందుకు? పట్నం, పట్నం అని పడి చస్తారెందుకు? ఏముందిక్కడ? క్షణం విశ్రాంతిలేని జీవితాలు. మెకానికల్ గా మారిపోయిన మనుషులు ఆప్యాయమైన పిలుపులకు, ఆదరణకు, ముఖంవాచి నట్లుండే పిల్లలు. ప్రొద్దున తాము లేవక ముందు ఉరుకులు పరుగులతో, ఆఫీసులకు పరుగెత్తిన తండ్రి, మళ్ళీ రాత్రి పిల్లలు నిద్రపోయాక యింటికి చేరే తండ్రిని, ఆ పిల్లలు కొన్ని రోజుల తరబడి చూసే అవకాశం వుండదు. అదే తమ గంగాపూర్ ఎంత బావుంటుంది? ఒకళ్ళమీద ఒకళ్ళకు విపరీతమైన ప్రేమలు. ఆపేక్షలు. గ్రామంలో ప్రతి ఒక్కరూ మరొకర్ని ఏదో వరసతో తప్ప వేరే విధంగా పిలవగా తను చూడలేదు. అంతా ఒకే కుటుంబంలోని సభ్యులేమో అని పరాయివాళ్ళు అనుకునేంత ఆపేక్షగా పిలుచుకుంటారు. ఈ కలకత్తాలో వున్న కొన్ని వసతులు మాత్రం గంగాపూర్ లో వుంటే గ్రామాలు పట్టణాలకు ఏ విధంగానూ తీసిపోవని నిరూపించవచ్చు."

అలా అనుకొని గంగాపూర్ అభివృద్ధి కార్యక్రమాలను గురించి కలలు కనేవాడు. ఆ కలలు కొంతవరకూ సమిష్టి

వ్యవసాయం ద్వారా ఫలించి తమ గ్రామానికి రాష్ట్రస్థాయిలో గుర్తింపు రావడంతో శేఖర్ కన్న మిగతా కలలు సాకారంగా నిలవడానికి ఎక్కువ టైమ్ పట్టలేదు. అందుకు మధు తోడ్పాటు ఎంతో వుంది ఏదో ఓ పని చేస్తూ తనని తాను మర్చిపోయేది మధు.

చంద్రం, శేఖర్‌లు పగలంతా పొలం పనులు. ఏకాస్త టైమ్ దొరికినా గ్రామాభివృద్ధిని గురించిన చర్చలతో, కొత్త ప్రణాళికలతో, అవి ఫలించే ఏర్పాట్లలో మునిగిపోయేవారు. మధు మనస్ఫూర్తిగా ఆ కార్యక్రమాల్లో మునిగి చాలావరకూ విషాదమైన గతాల్ని మర్చిపోయిందనే చెప్పవచ్చు. అంతగా ఏకాగ్రతతో కృషి చేసి పిల్లలకే కాకుండా పెద్దవాళ్లకు కూడా ప్రీతిపాత్రురాలైంది. చెవిగా చెప్పుకున్న నోళ్ళే, మళ్ళీ మధు గురించి ఎంతో గొప్పగా చెప్పు కుంటున్నాయి.

* * *

ఓ రోజు, శ్యాం పోయిన సంవత్సరం న్నర దాదాపు గడిచిన తర్వాత... రఘుపతిరావుగారు చంద్రాన్ని పిలిపించి మధు శేఖర్‌ల వివాహం గురించి మాట్లాడారు. సంతోషంగా విన్న చంద్రం నాన్నగారి ఔన్నత్యానికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొని, వురకులు పరుగులతో శేఖర్ దగ్గరకు వెళ్ళి, "ఒరేయ్ శేఖర్! అత్యంత శుభవార్త! శ్రీమాన్ రావుబహద్దూర్ రఘుపతిరావు గారు... నీకూ, మధుకూ వివాహం చేయాలనుకుంటున్నార్రా! బహుశా యిప్పుడు మధు నీ మాట కాదనదు. నీ కలలు ఫలించబోతున్నాయిరా!

గంగాపూర్ అభివృద్ధి అంటూ మొద లెట్టి, ఆ అభివృద్ధితోపాటు మధును మానసికంగా గట్టిపడేశావు. యిప్పుడు పాతవిషయాల్ని గురించి ఆలోచించ డానికి మధుకు టైముండటంలేదు. ఇంత త్వరలో అన్నీ మరచిపోయి మధు యింత ధైర్యంగా నిలబడిందంటే ఆ క్రెడిటంతా నీదేరా!" అంటూ తట్టుకోలేని ఆనందంతో అభినందిస్తూ "అంతే కాదురా! ఈ సంవత్సర కాలంలో నాన్నగారి పరీక్షల్లో కూడా నెగ్గి ఆయన కోడలయ్యే అర్హత సంపాదించిందంటే మధు నిజంగా అదృష్టవంతురాలు" అని తృప్తిగా అంటున్న చంద్రం చేయి పట్టుకొని ఆప్యాయంగా నొక్కుతూ —

"ఈ విషయం యిప్పుడే మధుకు చెప్పకు. నెమ్మదిగా నేనే అడుగుతాను," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"సరేలేరా! ఆ శుభవార్తేదో నీ నోటితో నువ్వే చెప్పుకో, మధ్య నేనెందుకు చెప్పడం? పోనీ సుషమతోనైనా చెప్ప వచ్చా? అదీ కూడదా?" అన్నాడు చిలిపిగా నవ్వుతూ.

"సుషమతో చెప్పవే...నేను వద్దంటే మట్టుకు నువ్వూరు

కోగలవా ?" అంటూ వుత్సాహంగా యింటివైపు బయలుదేరాడు శేఖర్.

సుషమ చంద్రం ద్వారా వార్త వినగానే "ముందు డాడీకి, అన్నయ్యకూ వుత్తరాలు వ్రాస్తాను. అన్నయ్య వచ్చే టైమ్ కూడా దగ్గరికి వచ్చింది కనుక వాడొచ్చే టైమ్‌కు ముహూర్తాలు పెట్టించు కోమని శేఖరన్నయ్యతో చెప్పాలి. అంతా వుంటే సరదాగా వుంటుంది," అంటూ చిన్నపిల్లలా సంతోషంగా గంతులు వేస్తూ, "మధు ఏదీ ? మధూ !" అంటూ ముందుకు వెళ్ళబోతున్న సుషమ చేయి పట్టుకొని చంద్రం లాగిన విసురుకు, చంద్రం గుండెలకు అతి సమీపంగా వచ్చిపడింది. అలాగే రెండుచేతుల్తో సుషమను చుట్టేస్తూ, "ష్! నే చెప్పిన మాటలు మధుతో చెప్పకు. ఇది మీ శేఖరన్నయ్య ఆర్డర్. అయినా మీ ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదు కదా! యిలా చెప్పానో లేదోఅలా మధుకు ట్రాన్స్‌ఫర్ చేయాలని పరుగు," అంటూ నవ్వుతూ కౌగిలి బిగిస్తున్న చంద్రం, ఎదురుగా మధు రావడం గమనించి సుషమను వదిలేశాడు. వాళ్ళిద్దరినీ అలా చూసి వెంటనే వెనుదిరిగిన మధు సుషమ పిలుపుతో ఆగిపోయింది. చంద్రం మరోసారి నవ్వుతూ తనవైపు చూసిన సుషమను కళ్ళతోనే హెచ్చరించాడు, బెదిరించాడు. చిన్నగా నవ్వుతూ తల వూపిన సుషమ,

"మధూ! మా అన్నయ్య పదినా వచ్చేనెలలో వస్తున్నారట తెలుసా?" అంది.

"ఆ విషయం నిన్ననే చెప్పావుగా సుషమా !" అంది మధు నవ్వుతూ.

"చెప్పేశానా ?" అని నాలుక కొరుక్కుంటున్న సుషమను అలాగే వదిలేసి నవ్వుతూ ముందుకు వెళ్ళి పోయింది మధు

మధు వెనకే తలుపులు మూసిన చంద్రం కౌగిట్లో నుంచీ తప్పుకోలేక అలాగే నవ్వుతూ వొదిగిపోయింది సుషమ గువ్వ పిట్టలా.

* * *

"మధూ!" ఏవో ఆలోచనల్లో తేలి పోతున్న మధు వులిక్కిపడి తలెత్తి చూసింది. ఎదురుగా నవ్వుతూ కనిపించిన శేఖర్‌ని చూసి, నవ్వుతూ లేచి "కూర్చోండి" అంటూ కుర్చీ ముందుకు జరిపింది.

"ఊహు! అలా పొలాల వైపు వెళ్దాం రా!" చేయి పట్టి ముందుకు అడుగు వేసిన శేఖర్ స్పర్శతో తడబడింది మధు. చాలా రోజులయిన తర్వాత తనకంత దగ్గిరగా నిలబడి తన కళ్ళలోకి చూస్తున్న శేఖర్ కళ్ళలోకి చూసి ఆ మాటను ధిక్కరించగల ధైర్యంలేక, నెమ్మదిగా శేఖర్‌ను అనుసరించింది. మధు అనుసరించగానే చెయ్యి వదిలేశాడు శేఖర్.

మధుకు శరీరమంతా తేలిపోతున్నట్లుగా వుంది. అతనలాగే చేయిపట్టుకొని నడిపించుకెళ్తే బావుండు ననిపించింది కానీ శేఖర్ ముందుకు నడిచాడు శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకొని శేఖర్ వెనకే నడిచింది.

పచ్చగా పెరిగి తల లూపుతున్న చెరుకుతోటల ప్రక్కనుంచి నడిచి, నిమ్మతోటను చేరుకున్నారు. అక్కడనుంచి పొలం గట్లమీదుగా నడుస్తూ శేఖర్ ఎప్పుడూ కూర్చొనే చోట, ఓ గట్టుమీద కూర్చున్నాడు. పక్కనే కొద్ది దూరంలో కూర్చుంది మధు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. శేఖర్‌కు మనసు నిండిన ఆనందంతో మాటలు రావడంలేదు.

గమ్మత్తేవిటంటే రెండు విరుద్ధ పరిస్థితుల్లో మనిషి ఒకే అనుభవాన్ని పొందుతాడు హృదయం ఆనందంతో నిండిపోయినప్పుడు, హృదయం బాధతో నిండిపోయినప్పుడు ఈ రెండు పరిస్థితుల్లోనూ మనిషికి ఆత్మీయుల దగ్గర మాట పెగలదు. శేఖర్ కొంతసేపటికి మాటలు కూర్చుకుంటూ,

"మాధూ!" ఆశ్చర్యంగా కళ్ళెత్తి చూసిన మధు మరింకేమీ వినకుండా శేఖర్ హృదయంలో తలదాచుకుంది. ఆ పిలుపులోని ఆత్మీయత మధును కట్టేసింది. అలా తనను పిలిచింది మొదట తండ్రి. ఆ తర్వాత శ్రీధర్ మావయ్యా, యిప్పుడు శేఖర్. కొంతసేపు అలాగే శేఖర్ గుండెలయల్ని వింటూ, విశ్రాంతి తీసుకున్న మధు నెమ్మదిగా లేచి సర్దుకుని కూర్చుంది. తన తొందరపాటుకు ఏమాత్రం సిగ్గుపడటంలేదు మధు. శేఖర్ తనకు పరాయివాడని అనిపించడంలేదు. నెమ్మదిగా మధు భుజంమీద చేయివేసి "ఇప్పటికైనా నన్ను గ్రహిస్తావా మధూ! నాన్నగారు సాధ్యమైనంత త్వరలో మన వివాహం చేయాలనుకుంటున్నారు," అన్నాడు చిన్నగా నవ్వుతూ. మౌనంగా కూర్చున్న మధువైపు రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు శేఖర్. మళ్ళీ తనే అన్నాడు. "మధూ! నీ కిష్టంలేకపోతే మరో పది సంవత్సరాలాగటానికైనా నేను సిద్ధమే. ఈ మధ్య నాన్నగారి పరిస్థితి ఏమంత బావుండటంలేదు. అనారోగ్యంతో బాధపడుతున్నారు. వయస్సు కూడా ఆయన శక్తిని, సహనాన్ని పోగొడుతోంది. ఆయన చిరకాలవాంఛ నా వివాహం చూడాలని. అమ్మ కూడా రోజూ అదే విషయం చెప్పి బాధపడుతోంది. ఇన్నాళ్ళూ నీ మనసు స్థిమితంగా లేదనీ, మానసికంగా నువ్వు దెబ్బతిని వున్నావనీ ఈ విషయం యింతకాలం నీ దగ్గర ఎత్తలేదు. ఇప్పుడైనా నీ అంగీకారం లేకుండా ఏమీ జరగదు," అంటున్న శేఖర్ వైపు చూసిన మధు కళ్ళు కృతజ్ఞతతో నిండుకున్నాయి.

'తన మంచికోసం, తన మనసు కోసం, అంతగా ఆలోచించే ఆప్తుడిని, ఆత్మీయుణ్ణి, యిన్నాళ్ళూ తను ఎంత గానో బాధపెట్టింది? అతను తన మూలంగానే యిన్నాళ్ళూ ఒంటరిగా వుండిపోయాడు. అయినా ఓ చిన్న నిందకూడా తనమీద వేయకుండా, యిప్పుడు కూడా తన యిష్టానికి వ్యతిరేకంగా జరగదని హామీ యిస్తున్నాడా ప్రేమమూర్తి! అతనికి ఏమిచ్చి తను అతని ఋణం తీర్చుకోగలదు?' కన్నార్పకుండా తన వైపే చూస్తున్న మధును చూసి తలవంచుకొని,

"మధూ! వెళ్ళిపోదాం!" అంటూ మౌనంగా లేచి నుంచున్న శేఖర్ వైపు కళ్ళెత్తి చూస్తూ "సమాధానం అక్కర్లేదా బావా?" అంది చిన్నగా నవ్వుతూ. మధు వైపు ఆశ్చర్యంగా చూసిన శేఖర్‌కు ఆ కళ్ళలో కదలాడుతున్న కొంటెతనం కన్పించింది. మళ్ళీ గట్టు మీద కూర్చుంటూ,

"అక్కర్లేదు, మరదలుపిల్ల దారిలో పడిందని తెలిసిపోయింది" అంటూ మధు చేయి చేతుల్లోకి తీసుకొని ఆపేక్షగా నిమురుతూ చటుక్కున పెదవుల కానించుకొని ఆ చేయి పట్టుకొని అలాగే లేచి నిలబడ్డాడు. యిద్దరూ నవ్వుతూ నడకసాగించారు.

అన్నాళ్టికి మళ్ళీ మొట్టమొదట తనకు గంగాపూర్‌లో అడుగు పెట్టగానే దర్శనమిచ్చిన...మధు, కొంటెతనంగా చేసిన దిష్టి తీయడం సీను, మావిడితోట, మా మావయ్యగారి దన్న దబాయింపూ, అన్నీ జ్ఞాపకం వచ్చి శేఖర్ పగలబడి నవ్వాడు. ఆ నవ్వు చూసి బిత్తర పోయిన మధు-

"ఏవిటది? ఏమైంది? ఎందుకంతలా నవ్వుతున్నారు?" అంది ఖంగారుగా.

"ఏం లేదు. యిటునుంచిటు మీ మావయ్యగారి తోట కెళ్దామేవిటి? చెట్లెక్కి మావిడికాయలు కోసి, సగం తిని నాకు విసురుదువుగాని" అన్నాడు, మధు చేయి మృదువుగా నొక్కుతూ ఎగతాళిగా.

అప్పటి తన ప్రవర్తన గుర్తుకు రావడంతో మధు కూడా శేఖర్ నవ్వుతో శృతి కలిపింది. పక్షులు కిలకిలారావాలతో గూళ్ళకు చేరుతూ వాళ్ళ నవ్వులతో శృతికలిపాయి

పల్చటి నీరెండలో ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ, కొత్తగా కడుతున్న హాస్పిటల్ భవనం ముందుగా వూళ్ళోకి ప్రవేశించే దగ్గర చెట్టా పట్టాలేసుకున్న రెండుచేతులూ విడిపోయాయి.

"సార్! యింక మీ దారి అటు, నా దారి యిటూ" అంటూ ముందుకు అడుగులువేస్తున్న మధు చేయిపట్టుకొని,

"మధూ! యింక మనిద్దరి దారీ ఒక్కటే! పద! చెయ్యి పట్టుకుంటే బావుండదు గాని ముందు చంద్రంతో

ముహూర్తాలు పెట్టించమని చెప్పాలి. పద" అంటూ మధును అనుసరించాడు.

సుషమ చెప్పిన ప్రకారం మరో నెల రోజుల్లో వున్న ముహూర్తం నిశ్చయం చేసుకున్నారు. శ్రీధర్ గారు తన ఆనందాన్ని తెలియజేస్తూ, కొన్ని పనుల వత్తిడివల్ల తను ముందు రాలేకపోతున్నానని ముహూర్తం సమయానికి తప్పక వస్తామని లెటర్ వ్రాశారు. పెళ్ళిపనులు అత్యంత ఉత్సాహంగా చేస్తున్నాడు చంద్రం. శాంత పెళ్ళికంటె ఘనంగా జరగాలని శుతని ప్రయత్నం రఘుపతి గారు తన యింటి దగ్గర ఏర్పాటు చేయిస్తానంటే,

"నాన్నగారూ! మీ అంత గొప్పగా నేను చేయలేకపోయినా మా చెల్లెలి పెళ్ళి మా యింట్లో జరగటమే న్యాయం," అంటూ రఘుపతిగారిని ఒప్పించాడు చంద్రం.

మధు, శేఖర్‌ల పెళ్ళి అని తెలిసి వూళ్ళో కుర్రకారంతా చేరి పెళ్ళి పనుల్లో తలా ఓ చెయ్యివేసి, చంద్రం కోరిక ప్రకారం గోపాలంగారింటి ముందు పెద్ద పందిరితో పాటు బ్రహ్మాండమైన కళ్యాణ మండపం తయారుచేశారు. రంగు రంగుల కాగితాలతో, పూలతో, పందిరికి వేలాడగట్టిన మావిడాకుల తోరణాలతో ఆ యింటికే ఒక చక్కటి కళ వచ్చింది. గంగాపూర్ అభివృద్ధికి ఎంతో శ్రమించిన మధు, శేఖర్, చంద్రం గంగాపూర్ పిల్లలందరికీ మార్గదర్శకులుగా కనిపించారు. అందుకే యువకులంతా నడుం కట్టి చంద్రానికి సాయంగా వచ్చారు. తమ తోబుట్టు పెళ్ళిలాగే సంబరపడుతున్నారు వాళ్ళు పైగా ఓ సామాన్యమైన కుటుంబంలో పుట్టిన మధు ఆ వూరికే ఆధిపతిలాంటి రఘుపతిరావుగారి కోడలు, తమకు అతి ప్రియమైన శేఖర్‌కు భార్య కాబోతోందంటే వాళ్ళకు చెప్పలేని ఆనందంగా వుంది.

శాంత, సుషమ తీరికలేకుండా జమీందారుగారింటికీ, పెళ్ళింటికీ తిరుగుతూ మహా హడావుడి పడిపోతున్నారు. అసలు తీరికే లేనట్లుంది వాళ్ళను చూస్తే. చంద్రం తల్లి శాంత కొడుకును చూస్తూ వాడి బాధ్యత తను వహించి వాడి మంచి చెడులు చూస్తుంటే, శాంత మళ్ళీ ఎప్పటిలా, చిన్నపిల్లలా గంతులు వేస్తూ సుషమతోపాటు తిరుగుతూ, మధ్య మధ్య మధును, సుషమనూ అల్లరి పెడుతూ కొడుకును కూడా మరచి, సందడిగా తిరుగుతోంది. రాజేశ్వర్ కూడా పెళ్ళికి నాలుగురోజులు ముందుగానే వచ్చి పెళ్ళి పనుల్లో యింటల్లుడి హోదాతో, మధు అన్న హోదాతో పాల్గొన్నాడు.

అనుకున్న రోజొచ్చింది. ముహూర్తం రోజు ప్రొద్దుటే శిరీష్, ఫ్లారెన్స్ దిగారు. శ్రీధర్‌గారు వెనక ట్రెయిన్‌లో వస్తానన్నారని చెప్పారు. అన్నా, వదినా

ఇప్పుడు మీరు అతని పళ్లను
పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

# వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు
దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.






## సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో

కుటుంబంలో వారికి పిప్పి
పళ్లు రాకుండా నిరోధిస్తుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2.1-172 TL

వచ్చేసింతర్వాత కూడా తండ్రికి అంత తీరికలేని పనులేమిటో తెలీక విసుక్కొంది సుషమ. తనని పలకరించ డానికి వచ్చిన శిరీష్‌తో,

"మావయ్యను మీతోపాటు తీసుకు రావల్సింది" అంది నెమ్మదిగా మధు. ఆయన రాలేదంటే మనసులో చాలా బాధగా వుంది. ఏదో వెలితిగా వుంది. శిరీష్, ఫ్లారెన్స్‌లకు ఘనస్వాగతం ఇచ్చాడు శేఖర్. చంద్రం వచ్చిన వాళ్ళను తమ యింటికి లాక్కెళ్ళాడు శేఖర్‌తో పోట్లాడి.

"ఒరే చందూ! వాళ్ళు నా పెళ్ళికి వచ్చార్రా ఫూల్" అంటుంటే-

"కాదు నా మరదలి పెళ్ళికి వచ్చారు. పెళ్ళి మా యింట్లో. మీ యింట్లో కాదు" అంటూ శిరీష్‌ను చెయ్యి పట్టుకు లాక్కెళుతున్న చంద్రం వైపు విచిత్రంగా చూస్తున్న ఫ్లారెన్స్‌కు విషయం వివరించి, నవ్వుతూ ఫ్లారెన్స్‌తో చంద్రం యింటికి చేరుకున్నాడు శిరీష్. ఎదురుగా వచ్చిన చెల్లెల్ని కళ్ళనిండుగా చూస్తూ ఫ్లారెన్స్‌కు పరిచయం చేశాడు శిరీష్. ఆ తర్వాత యిద్దరూ మధు వున్న గదిలోకి వెళ్ళారు. మధుకు కూడా ఫ్లారెన్స్‌ను పరిచయం చేసి ఫ్లారెన్స్‌ను సుషమ కప్పగించి, చీర కట్టించమని చెప్పి వాళ్ళందరికోసం తెచ్చిన డజను చీరలు సుషమ కిచ్చాడు.

కబుర్లతో, జోక్స్‌తో యిల్లంతా సందడిగా వుంది. సరదాగా టైమ్ తెలీకుండా గడిచిపోతోంది.

అంత గొప్పగా షామియానాలు కట్టడం ఎప్పుడూ చూడని గంగాపూర్ ప్రజలకు వింతగా విచిత్రంగా వుండటమే కాకుండా, ఆ పెళ్ళికి అందరికీ ఆహ్వానముందని తెలిసి సంతోషంగా వుంది.

రాత్రి ముహూర్తం సమయానికి దిగారు శ్రీధర్‌గారు. సరాసరి రఘుపతి రావుగారింటికి వెళ్ళారు. అప్పటికే అంతా పెళ్ళికి తరలివెళ్ళడంవల్ల తన వెంటవచ్చిన యువకుడిని, శేఖరింటి దగ్గరే వదలి, తను పెళ్ళిజరిగే చోటుకు చేరుకున్నారు

మధు, శేఖర్‌ల వివాహం ఘనంగా వైభవోపేతంగా జరిగింది. చంద్రం శేఖర్ కాళ్ళు కడిగి కన్యాదానం చేశాడు. అప్రయత్నంగా చంద్రం కళ్ళలో నీళ్ళు తిరిగాయి. బాబాయి చెయ్యాల్సిన పని తను చేయవలసి రావడం తలుచుకొని అంతలోనే కళ్ళు తుడుచుకొని.నవ్వుతూ పురోహితు డడిగినవన్నీ అందిస్తున్నాడు. సూత్రధారణ జరిగిపోయింది. మాధవి, శ్రీమతి మాధవి అయింది. మాధవి శేఖరయింది. దంపతులిద్దరూ లేచి అందరికీ నమస్కరిస్తున్నారు రఘుపతిరావుగారు ఆనందంగా కళ్ళు తుడుచుకున్నారు కాళ్ళకు నమస్కరిస్తున్న మధును శేఖర్‌ను పైకి లేపుతూ.

మధు ముందుకు ఓ అడుగువేసి శ్రీధర్‌గారి కాళ్ళకు నమస్కరించింది.

# కీళ్ళ నొప్పా?





## బాధ నివారణ కోసం అయొడెక్స్ రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్ మీకు బాధనుంచి ఉపశాంతిని యియ్యవచ్చు. అయొడెక్స్ ఉపశాంతిని యిస్తూ, బాధను నివారిస్తుంది. దీనిలో అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ, కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక ఆయింట్‌మెంట్-అయొడెక్స్.




అయొడెక్స్
మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.

లింటాస్-IODEX.12-172 TL

శేఖర్ కూడా నవ్వుతూ శ్రీధర్ గారికి పాదాభివందనం చేశాడు. యిద్దర్నీ దగ్గిరకు తీసుకొని

"మాధూ! శేఖర్! యివాళ నాకెంత ఆనందంగావుందో తెలుసా? యిన్నాళ్ళకి నా కోరిక ఫలించింది." అంటున్న ఆయన కళ్లు చెమ్మగిల్లటం చూసిన మధు కళ్ళలో నీళ్లు చిప్పిల్లాయి. అతికొద్ది పరిచయంతో అంత ఆపేక్షగా తన మంచిచెడ్డల్ని గురించి ఆలోచించి బాధ పడ్డ ఆయనమీద భక్తిభావం కలిగింది. అక్కడినుంచి ఎదురుగా నవ్వుతూ చూస్తున్న చంద్రం దగ్గరకెళ్ళి క్రిందకు వంగిన మధును మధ్యలోనే భుజాలుపట్టి పైకి లేపి కళ్ళు తుడుచుకుంటున్న చంద్రాన్ని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు శేఖర్. సారధిలా నిలచి తన ప్రతి పనిలో ఓ సోదరుడిలా తోడ్పడ్డ తన బహిప్రాణం చందూకి అంతకంటే ఎలా కృతజ్ఞతలు తెలియజేయాలో తెలీలేదు శేఖర్ కు.

చంద్రం వెనగ్గా నుంచొని ఆత్రుతగా చూస్తున్న రెండుకళ్ళు మధును ఆకర్షించాయి. ఆ కళ్ళలో ప్రతిఫలిస్తున్న బాధా, ఆనందం సమ్మిళితమైన భావం మధు మనసును లాగినట్లైంది. చంద్రాన్ని దాటి ముందుకెళ్ళి చూసింది. ఫుల్ గ్రీన్ సూట్ లోవున్న ఆ యువకుడిని ఎంతమంది మధ్య వున్నా గుర్తించగలదు మధు. ఆ యువకుడిని, ఆలాగే రెండు క్షణాలు దిగ్భ్రాంతితో చూస్తూ నిల్చున్న మధు.

"అక్కా!" అంటూ ముందుకొచ్చిన శ్యాంని దగ్గరకు తీసుకుంది. చెంపలమీదుగా కట్టలుతెగిన నీటి ప్రవాహం. ముఖంలో అంతులేని ప్రసన్నత.

అక్కమీదవున్న ప్రేమాభిమానాలు గంగాజమునల్లా ప్రవహిస్తున్న కన్నీళ్ళ రూపంలో బయటపడ్డాయి శ్యాం కళ్ళ నుంచి.

మధు పరిస్థితీ అలాగేవుంది. అంతటి ఆనందాన్ని తట్టుకోలేకుండా వుంది. శ్యాం ... శ్యాం అని సన్నగా వణుకుతున్న కంఠంతో అంటూ ధారావాహినిలా కారిపోతున్న కన్నీళ్ళను తుడుచుకునే ప్రయత్నంకూడా చేయకుండా శ్యాం తలా, చెంపలు నిమురుతూ తనివి తీరా ఒక్క సంవత్సరంన్నరలో ఎంతో గొప్పగా ఎదిగినట్లున్న శ్యాంని చూస్తోంది

నిజానికి శ్యాం అంతగా ఏమీ ఎదగలేదు. అయితే నిక్కరు, షర్టుకు బదులుగా, చక్కటి సూట్, అందంగా కత్తిరించిన క్రాప్. మునుపటికంటే దృఢంగా అందంగా పెరిగిన శరీరంతో మరో మనిషిలా కనిపిస్తున్నా అతను శ్యాం అని అర్థమైన అందరికీ అదో అద్భుతంలా కనిపిస్తోంది. అంతా విచిత్రంగా ఆనందంగా కళ్ళు పెద్దవిచేసి



యువ

శ్యాంవైపే చూస్తున్నారు. అక్కను వదిలి ఆశ్చర్యంగా చూస్తున్న చంద్రం, శేఖర్‌ల దగ్గరకు వచ్చాడు శ్యాం. చంద్రం యింకా ఆశ్చర్యంనుంచి తేరు కోకముందే "అలా ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయినందుకు నన్ను క్షమించు బావా! మిమ్మల్నందరినీ చాలా బాధ పెట్టాను" అంటూ తలవంచుకున్నాడు శ్యాం.

అప్పటివరకూ అందరినీ గమని స్తున్న శ్రీధర్‌గారు ముందుకొచ్చి,

"ఒరే నిన్నప్పుడే ఎవరురమ్మన్నా రురా? నా పర్మిషన్ లేకుండా ఎందు కొచ్చావ్! నేను కబురుపెట్టేంతవరకూ రావద్దని చెప్పలేదూ! నేనిటురాగానే, నువ్వూ మెల్లగా జారుకుని వచ్చేశావన్న మాట!" అంటూ ఆప్యాయంగా మంద లించడం చూసి మరింత ఆశ్చర్య పోయారు.

చిన్నగా "క్షమించు మావయ్యా! మా అక్కయ్య పెళ్ళి జరుగుతుంటే— వూళ్ళోవుండి చూడకుండా వుండటం నాకు సాధ్యంకాలేదు అందుకే మీ వెనకే వచ్చేశాను. ఇంతవరకూ ఎలాగో చాటున వుండి చూడగలిగాను కానీ అక్కయ్యను యింత దగ్గరలో యిన్నా ళ్ళకు చూస్తుంటే మనస్సాగలేదు," అన్నాడు తలవంచుకుంటూ.

"ఫర్వాలేదులేవోయ్! నువ్వు కన్పిస్తే మధ్యలో మీ అక్క లేచెక్కడ వస్తుందో నని మా భయం. అందుకే తర్వాత చూపిద్దామనుకున్నాం" అంటూ శ్యాం భుజం తడుతున్న రఘుపతిరావుగారిని చూసి చంద్రం, శేఖర్ ముఖాలు చూసు కున్నారు.

మధు, శాంత, శిరీష్, సుషమ, ఆ పంక్తిలోవున్న ఏ ఒక్కరికీ ఆ మిస్టరీ ఏమిటో అర్థంకాలేదు చంద్రం ధైర్యం చేసి రఘుపతిగారి దగ్గరకెళ్ళి—

"నాన్నగారూ! విషయమేమిటో మా కెవరికీ అర్థంకావడంలేదు. మీరూ మావయ్యగారూ జంటకవుల్లా మాట్లాడే మాటలు అసలు అర్థంకావడంలేదు. వాడిన్నాళ్ళూ ఎక్కడ వున్నాడు? మీకు తెలుసా? ఎక్కడ కనిపించాడు? మావయ్యగారెలా తీసుకొచ్చారు? మీరెప్పుడు చూశారు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తున్న చంద్రాన్ని "అబ్బ! ఆగరా చందూ! ఒక్కసారే అన్ని ప్రశ్నలు వేస్తే సమాధానం ఎలా చెప్పనురా. ఒక్కటొక్కటే అడిగితే చెబుతాం సరే అడిగేశావు కనుక విను.

* * *

"ఆ రోజు శేఖర్‌కు జబ్బుగావున్న పుడు శ్రీధర్ చూడటానికి వచ్చాడు జ్ఞాపకం వుందా? అప్పుడే మేమిద్దరం కలసి మీ కుర్రకారు చేస్తున్న అకతవక పనులను గురించి మాట్లాడుకున్నాం. అమ్మాయిమీద మనసుతో ఆరోగ్యం పాడుచేసుకున్న అవివేకి ఒకడైతే...

# Suvega

## సువేగా పెట్రోల్ బంక్‌లకి మంచి వ్యాపారం అంద చేయడం లేదు. దానికి బదులు లీటర్‌కి




## 70 కిలోమీటర్ల పైగా మీకు ఇస్తూ!



సరికొత్తది, ప్రత్యేకంగా రూపొందించబడిన యస్ యప్ సర్వీస్ కార్బురేటర్ ఇప్పుడు మిమ్మల్ని లీటర్‌కి 70 కిలో మీటర్లకు పైగా తీసుకు వెళ్లగల ఒకే ఒక మోపెడ్ గా సువేగాని తీర్చిదిద్దుతోంది. ఊహించండి! కేవలం ఒక లీటర్ 70 కిలోమీటర్లు వస్తుంది.

అంతేకాదు. మెయింటెనెన్స్ విషయంలోనూ సువేగా సులభమయినది. హార్డ్-క్రోమ్డ్ అల్యూమినియం సిలిండర్లు వున్న ఒకే ఒక మోపెడ్ కావడంతో అది నిరంతరాయంగా కదులుతుంది. వీటికి తోడు క్విక్ పిక్-అప్, దృఢంగా ప్రెస్ చేయబడిన స్టీల్ బాడీ మరియు చైన్-డ్రైవ్ శ్రేష్ఠమయిన రోడ్ గ్రిప్ మరియు వేగం అందచేస్తాయి. ఇంతకంటె ముఖ్యం. సువేగా ఇద్దర్ని తీసుకు వెళ్తుంది. సువేగా పొదుపుకి మరేదీ సాటిరాదు.

కదలండి సువేగా సంపాదించండి. లీటర్‌కి 70 కిలోమీటర్లతో, అది మంచిబేరం.

**ఆశ్చర్యం లేదు, భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతోన్న మోపెడ్ సువేగా**



మోపెడ్స్ ఇండియా లిమిటెడ్ తిరుపతి ఆంధ్రప్రదేశ్

SAA/MIL/2816/TEL

అమ్మాయికోసం అందర్నీ వదలి అమెరికా దాకా ఆరాటంగా పరుగెత్తిన అభాగ్యుడు మరొకడు." అంటున్న రఘుపతిగారి మాటలకు శిరీష్, శేఖర్ తలలు వంచుకున్నారు. అందుకిప్పుడు సిగ్గుపడ వలసినపని లేదనుకో, అన్నీ ఆనంద కరంగా ముగిశాయి.

ఇంక ఏదో వో ఆదర్శాన్ని పెట్టుకొని గుడ్డిగా అందమైన జీవితాన్నే పణంగా పెట్టి అది సాధించాలనుకున్న మధు విషయం కూడా ఆలోచించాం. పరిష్కార మేమిటాని తలలు బద్దలుకొట్టుకున్నాం. అప్పుడే ఓ అయిడియా వచ్చింది. శ్యాంని యిక్కడలేకుండా చేస్తే... ఆదర్శాన్ని నమ్ముకున్న అమ్మాయికి ఆధారానికి అల్లుకుపోవలసిన ప్రకృతి సత్యం గుర్తొస్తుందని." క్రీగంట మధును చూసిన రఘుపతిగారు చిన్నగా నవ్వారు మధు తలవంచుకుంది. సరే యిద్దరం కల్సి ప్లాన్‌వేశాం. ఎలాగూ పరీక్షలు దగ్గరకొచ్చాయి కనుక అవి అయ్యేంతవరకూ వుంచి, ఆ తర్వాత తనదగ్గర వదిలివేయమని శ్రీధర్ చెప్పాడు. అది సమంజసంగానే కనిపించింది.

తెల్లవారితే పరీక్షలైపోతాయనగా స్కూల్‌దగ్గిర కాపువేసి. పరీక్షవ్రాసి వుత్సాహంగా బయటకు వస్తున్న శ్యాంని పట్టుకున్నాను "నీతో మాట్లాడాలి రారా బాబూ" అంటే భయపడుతూనే నన్ననుసరించాడు. మా తోటదగ్గరకు తీసుకెళ్ళి ఓ చెట్టుక్రింద కూర్చుంటూ వాడినీ కూర్చోబెట్టాను. వాడు భయం భయంగా చుట్టూ చూస్తున్నాడు. యింత పెద్దమనిషికి నాతో మాటలేమిటానిపించి వుండవచ్చు... సరే కూర్చోబెట్టి 'నీకేం భయంలేదురా నాన్నా' అని విషయం వివరించాను "కలకత్తా తీసుకెళ్తాను వస్తావా? శ్రీధర్ మావయ్య నిన్ను చదివించి గొప్ప ఆఫీసర్‌ను చేస్తారట.

అయితే యీ విషయం మీ అక్కయ్యతో అన్నావంటే నువ్వనుకున్నట్లు జరగదు. మీ అక్కయ్య నిన్ను తన దగ్గిరే అట్టిపెట్టుకోవాలని చూస్తుంది అప్పుడు మీ అక్కయ్యకు పెళ్ళికాదు, నువ్వు ఆఫీసరువీ కాలేవు" అని సాధ్యమైనంతవరకూ వాడి బుర్రలోకి వున్న నిజాన్ని కలకత్తా వెళ్ళడంవల్ల కలిగే రెండు మంచిపనులను ఎక్కించడానికి ప్రయత్నించాను. కొంచెంసేపు ఆలోచించి...

"మరి... నన్ను పైలట్ ఆఫీసర్‌ని చేస్తారా?" అన్నాడు... "ఓ యస్" అన్నాను.

"మరి......మరి......అక్కయ్య ఒక్కతీ ఎలా వుంటుందండీ... నే వెళ్ళిపోతే ఒక్కతీ అయిపోతుందిగా, బాగా యేడుస్తుంది" అని చెబుతున్న వాడి కళ్ళ వెంట నీళ్ళుచూసి ఓ క్షణం నా మనసు చలించింది. అక్కా తమ్ముళ్ళను వేరు

చేసిన పాపం నాకు తగులుతుందేమో ! అనిపించింది. అయినా మనసు దృఢం చేసుకుంటూ చెప్పాను "మీ అక్కయ్యకేం ఫర్వాలేదు. శేఖర్‌ని పెళ్ళిచేసుకొని మా యింట్లో వుంటుంది. నువ్వు ఆఫీసరువైన తర్వాత తిరిగొచ్చి మీ అక్కయ్యను, బావను చూద్దువుగాని" అన్నాను. వాడే మనుకున్నాడో "సరే" అన్నాడు. "మరి ఈ విషయం ఎవరితో చెప్పవద్దు. రేపు సాయంత్రం పరీక్షకాగానే స్కూల్ నుంచి సరాసరి బస్టాండుకు రా ! అక్క డారిన వచ్చేసెయ్. రాత్రిబండి పట్టుకొని కలకత్తా వెళ్ళిపోదాం" అన్నాను.

అన్నమాట ప్రకారం శ్యాం వచ్చాడు. నేను మామూలుగా శ్రీధర్ లెటర్ వ్రాశాడు,ఏదో పనుందట. కలకత్తా వెళ్ళి వస్తానని యింట్లో చెప్పి బయలుదేరాను. అదృష్టవశాత్తూ ఆ రోజు మన వూరివాళ్ళెవరూ మేమెక్కిన బస్సు ఎక్కలేదు. బస్సులో స్టేషన్ చేరి, వెంటనే ఆ రాత్రి బండిలో కలకత్తా చేరుకున్నాం.

అక్కడ వాడిని కాలేజీలో చేర్పిద్దామన్నాడు శ్రీధర్ వాడిని మళ్ళీ అడిగాను "ఏంరా శ్యాం ! కాలేజీలో చేరతావా ? పైలట్ ఆఫీసర్‌వి అవుతావా ?" అని. వాడు రెండోదే కోరుకున్నాడు. తొందరగా ఆఫీసరైపోతే గంగాపూర్ వచ్చేయవచ్చని. శ్రీధర్ ఇన్ఫ్లుయన్స్‌తో వాడిని ఫ్లైయింగ్ సెంటర్‌లో మెంబరుగా చేర్చుకున్నారు. సంవత్సరంనుంచీ ఓ ప్రక్క చదువుకుంటూ, ఓ పక్క ఫ్లైయింగ్ సెంటర్‌లో ట్రైనింగ్ అవుతున్నాడు. మొన్న జరిగిన పైలట్స్‌యింటర్వ్యూకు ఎటెండయి అన్ని టెస్ట్‌లూ నెగ్గాడు ప్రస్తుతం మనవాడు, యిండియన్ ఎయిర్ ఫోర్స్‌లో పైలట్" అంటూ నవ్వుతూ శ్యాం కథ ముగించారు రఘుపతిరావుగారు. ఈ క్రెడిట్ అంతా శ్రీధర్‌ది. శ్రీధర్, శ్యాం నాన్నగారు శ్రీరాం ఆప్తమిత్రులట ఒకప్పుడు. ఆ అభిమానంతో ప్రాణస్నేహితుడి పిల్లలమీద మమకారం పెంచుకున్నాడు.

'నా కొడుకు అమెరికా వెళ్ళిపోయినా మరో కొడుకు దొరికినందుకు పొంగిపోతున్నాను' అంటూ లెటర్స్ వ్రాసేవాడు శ్రీధర్. అంటున్న రఘుపతిగారి భుజంమీద చేయివేస్తూ "ఆపండి, మీ పొగడ్తలు. మీరు శ్యాంని అంత జాగ్రత్తగా మరో కంటికి తెలీకుండా అప్పగించకపోతే నేనేం చేయగలిగేవాణ్ణి," అంటున్న శ్రీధర్ దగ్గరగా వస్తూ "నేనింతటివాడిని కావడానికి మీ యిద్దరూ కారకులే మావయ్యా !" అంటూ యిద్దరి కాళ్ళకూ నమస్కరిస్తున్న శ్యాంని చూసి గర్వంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకొని నవ్వుకున్నారు శ్రీధర్ రఘుపతిరావుగార్లు.

వాళ్ళకు దగ్గరగా వచ్చిన మధు, ఓ క్షణం వాళ్ళిద్దర్నీ చూసి "మీ ఋణం

ఎలా తీర్చుకోగలం మావయ్యా!" అంటే యిద్దరినీ వుద్దేశించి.

"అది చాలా తేలికమ్మాయ్! అతి త్వరలో ఓ అందమైన మనవణ్ణి అందించావంటే...మేమే నీకు ఋణపడిపోతాం" అంటున్న రఘుపతిగారి మాటలు అప్పటి వరకూ మౌనంగా ఆయన చెబుతున్న కథా జరుగుతున్న కథా చూస్తున్న అందరికీ నవ్వు తెప్పించాయి. ఆ కళ్యాణ మండపం ఓసారి నవ్వులతో మార్మోగింది.

"కంగ్రాచ్యులేషన్స్ బావగారూ!" అంటూ చెయ్యి చాపిన శ్యాం వీపున ఒక్కటి చరిచి దగ్గరకు లాక్కున్నాడు శేఖర్.

గర్వంగా మెరుస్తున్న శేఖర్ కళ్ళు చూసి, సిగ్గుతో మధు కళ్ళు వాలిపోయాయి. మధురంగా నవ్వుతున్న మధు పెదాలవైపు నవ్వుతూ చూశాడు శేఖర్.

మధు మమత నిండిన ఆ మనుషుల మంచితనాన్ని, మధురానురాగంతో తనను బంధీని చేసి బ్రతికించుకున్న శేఖర్ కళ్ళలో ప్రవహిస్తున్న ప్రేమ వాహినినీ చూసి తనలో తాననుకుంది- మొట్టమొదటిసారిగా ప్రపంచంలో తనంతటి అదృష్టవంతు లెవ్వరూ వుండరని

ఇంతలో "మరో శుభవార్త ఈ సంవత్సరంతో రిటైర్ కాబోతున్న శ్రీధర్ మన 'గంగాపూర్' వచ్చేసి యిక్కడే వుండిపోవాలనే నిశ్చయానికి వచ్చాడు" అన్నారు రఘుపతి నవ్వుతూ శ్రీధర్ వైపు చూస్తూ. సుషమ, మధు ఆనందంగా చూశారు.

"చూడు మధూ! నన్ను ఒక్క శుభవార్తైనా చెప్పనిస్తున్నారేమో! అన్నీ తనే చెప్పేస్తున్నారు" అంటున్న శ్రీధర్ వైపు కళ్ళ నిండా ఆప్యాయత నింపుకొని చూస్తూ "పోనీ గంగాపూర్ లోనే వుండాలనే అభిప్రాయానికి నువ్వెందుకొచ్చావో నువ్వు చెప్పు మావయ్యా!" అంది నవ్వుతూ.

అందరూ ముందుకు సర్దుకున్నారు కుతూహలంగా ఏం చెబుతారోనని. గర్వంగా రఘుపతిరావుగారి వైపు చూసి "ఏముందీ నా కొడుకు శేఖర్, అల్లుడు చంద్రం, కోడలు మధు, కూతురు సుషమా కలసి కృషిచేసి సకల వసతులూ కల్పించారు గంగాపూర్‌కు. అంతేకాక యింక కలకత్తాలో ఏముంది గనుక యిక్కడ లేంది? దుమ్మూ, ధూళీ వున్నాయి. అవి మనకక్కరలేదు. కనక పరిశుభ్రమైన పల్లెలో పంటపొలాల్ని చూస్తూ, అపురూపంగా దొరికిన మిత్రులు రఘుపతిగారితో గంగాతీరానికి షికార్లు వెళుతూ, నావాళ్లందరి సమక్షంలో హాయిగా నా శేషజీవితాన్ని గడపాలన్నదే నా కోరిక" అంటున్న శ్రీధర్ మాటలకు మధు శాంతకు సైగచేసి, చప్పట్లు





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారీ భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకువెళ్ళి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం. ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




సంపూర్ణ దంత రక్షణకోసం కోల్గేట్ టైగార్డ్ టూత్‌బ్రష్‌లను వాడండి అవి పళ్ళ ఎనామిల్‌ను కాపాడి పళ్ళపైవున్న ప్లేక్ దానినుండి రక్షించడంతోపాటు చిగుళ్ళకు రక్షణ సమకూరుస్తాయి మీ కుటుంబంలోని ప్రతివారికీ అనువుగా 4 రకాలలో దొరుకుతాయి

**ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

కొట్టింది అంతా లయబద్ధంగా చప్పట్లు కొడుతుంటే తెల్లబోయి చూశారు శ్రీధర్.

"ఇక పదండి, భోజనాలకు వేళ మించి పోతోంది పదరా శ్యాం! పనులన్నీ తప్పించుకున్నా వడ్డన పని నీకు తప్పదు. ముందా సూటూ, బూటూ విప్పి పంచ కట్టుకొని లాల్చీ వేసుకురా, వడ్డించేద్దాం అందరికీ" అంటుంటే "బావా! మొత్తానికి పల్లెటూరి బావ వనిపించావు." అంటున్న శ్యాంని కొట్టబోతే తప్పుకొని యింట్లో దూ రా డు... అంతా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ ముందుకు కదిలారు భోజనాలకు

* * *

ఆ రాత్రి తెల్లటి వెన్నెలతో పోటీ పడుతున్న పాలనురగలాంటి చీర కట్టుకొని ముఖమంతా వెలుగు నింపుకొని, మనసు నిండిన సంతోషంతో శేఖర్‌ని సమీపించిన మాధవి, శేఖర్ అనురాగంతో చాచిన చేతుల్లో మనస్ఫూర్తిగా ఒదిగిపోతూ అతని కౌగిలిలో కరగిపోతూ మరోసారి అనుకుంది, తనంత అదృష్టవంతురాలు ప్రపంచంలో మరొకరు వుండరని. అంతేకాక మరో విషయం నిశ్చయంగా తెలిసింది. ఆ ప్రేమ వాహినిని తప్పుకుపోగం శక్తి తనకు లేదని, ఆ ప్రేమ జలధిలో మనస్ఫూర్తిగా మునగటంలో వున్న తృప్తి మరెందులోనూ లేదనీ... ఆ అనురాగానికి వారధి కట్టిన మెరుస్తున్న మంగళసూత్రాలు తీసుకొని కళ్ళకద్దుకుంటున్న మధును మరింత దగ్గరగా తీసుకుంటూ, చెవిలో గుసగుసగా "గంగాతీరానికి వెళ్దామా గంగమ్మా!" అంటుంటే సిగ్గుగా అతని గుండెల్లో తలదాచుకుంది మధు.

అదే సమయంలో పౌర్ణమి వెన్నెల్లో గంగాతీర సౌందర్యాన్ని చూడాలని అభిలాషపడుతున్న సుషమను తీసుకొని చంద్రం గంగాతీరం చేరుకున్నాడు.

"ఇన్నాళ్టికి నాకున్న ఓ పెద్ద బాధ్యత తీర్చుకోగలిగాను సుషమా! యింక మనం తీరిగ్గా ప్రేమించుకోవచ్చు" అంటూ నవ్వుతున్న చంద్రం ఒళ్ళో పడుకొని "ఇన్నాళ్ళూ ప్రేమించడానికి తీరిక దొరక్క, వదిలేశారా సార్?" అంటూ నవ్వుతూన్న సుషమ నవ్వుతో శృతి కలుపుతూ వెన్నెల్లో మిలమిలా మెరుస్తున్న ఆ కళ్ళమీద సున్నితంగా ఓ ముద్ర వేశాడు చంద్రం. "చందూ" అని పిలుస్తూ అతని మెళ్లో రెండు చేతులూ హారంలా వేసిన సుషమను, యింక మాట్లాడనివ్వలేదు చంద్రం.

(సమాప్తం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO




## బహుమతి : రూ. 116 + రూ. 116

మే నెల 'క్విజ్' కు పాఠకులు చాలా మంది ఉత్సాహంగా ఎంట్రీలు పంపించారు. అందుకు కృతజ్ఞతలు. అయితే ఎవ్వరూ ఆల్ కరెక్టు ఎంట్రీలు పంపలేదని తెలియ జేయటానికి విచారిస్తున్నాము. బహుమతి మొత్తాన్ని జూన్‌నెల 'క్విజ్' కు కలపడం జరిగింది. అంటే జూన్ నెల క్విజ్ బహుమతి రూ. 232. ఈ క్విజ్‌లో పాఠకులు ఉత్సాహంతో పాల్గొంటారని ఆశిస్తున్నాము.

**ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.**

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దు[illegible] ఉ[illegible]గాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి. ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరిం[illegible]
2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్‌కరెక్ట్ సమాధా[illegible]ంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య వ[illegible]క్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను జులై సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ మే 31. ఆపై వచ్చినవాటిని పరిశీలించడం జరగదు.

## జూన్ నెల క్విజ్

1. ఈ దేశస్థులను మాగ్‌యార్స్ అంటారు.
ఎ) హంగేరీ బి) దక్షిణాఫ్రికా సి) మొరాకో డి) దక్షిణ అమెరికా

2. మ... ంలో నిముషానికి ఎన్నిసార్లు కొట్టుకుంటుంది.

80 బి) 45 సి) 60 డి) 72

3. నల్లటి హంస (Black Swan) కింది దేశంలో ఉంది.

ఎ) ఆస్ట్రేలియా బి) రష్యా సి) స్విట్జర్లాండ్ డి) నార్వే

4. బైఫోకల్ లెన్స్ (Bifocal lens) ను కనిపెట్టింది.

ఎ) బెనెడిక్టస్ బి) ఎడిసన్ సి) డోలాండ్ డి) ఫ్రాంక్లిన్

5. 1977 లో మనదేశంలో తీసిన సినిమాలు

ఎ) 557 బి) 567 సి) 577 డి) 587

6. ప్రపంచంలో అత్యధిక జనాభా గల పట్టణం ————

7. కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణం విజయవాడ వద్ద ———— సంవత్సరంలో జరిగింది.

8. మన శరీరం బరువులో దాదాపు ———— శాతం నీరు ఉంది.

9. 'బటర్ ఫ్లై' అనే పదం ———— క్రీడకు సంబంధించింది.

10. అత్యధిక ఉష్ణోగ్రతను కొలిచే సాధనం ————

యువ

క్విజ్ కూపన్ - జూన్ '78

జవాబు

1 - ☐ ☐ 4 - ☐ 5 - ☐

6 ............ 8 ............

9 ............ 10 ............

పేరు : ______________

అడ్రసు: ______________

______________

______________

